# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు **1959**

సంపుటము 36 : : సంచిక 10

**విడిప్రతిక వెల ఒక రూపాయి**

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1959



## నవంబరు సంచికలో

# వార్తలు

## డాక్టర్ సుబ్బరాయన్‌కు కేంద్రమంత్రిపదవి

మద్రాసు రాష్ట్రంనుంచి లోక్‌సభకు ఎన్నికైన డాక్టర్ సుబ్బరాయన్ కేంద్రప్రభుత్వం రవాణా, రహదార్ల శాఖల మంత్రిగా నియమితులయ్యారు.

## దేశంలో తొలిసారిగా టెలివిజన్

ఆల్ ఇండియా రేడియోవారు సెప్టెంబరు నెలలో ఢిల్లీ కేంద్రంలో తొలిసారిగా టెలివిజన్ ఏర్పాటు చేశారు. దీనికి రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం జరిపారు.

## సజ్జన్‌బా అద్భుతకృత్యాలు

గుజరాత్ ప్రాంతంలోని అమ్రేలీజిల్లా జినాకా అనే గ్రామంలో సజ్జన్‌బా ఉరఫ్ దేవ్‌బా పెక్కు మాహాత్మ్యాలు చూపుతున్నది. పూర్వజన్మగాథలు చెబుతున్నదట. భవానీదేవి ఆవేశించినపుడు ఈమె మహాత్మ్యం విశేషమౌతుందని వదంతి. ఈమె దర్శనానికి సెప్టెంబర్ మూడవ వారంలో చేరిన 50 వేల మంది తొక్కిడివల్ల 49 మంది మరణించారు.

## లావోస్ పరిస్థితి పరిశీలన

ప్రస్తుతం కల్లోలం చెలరేగిన లావోస్ పరిస్థితిని పరిశీలించడానికి భద్రతాసంఘం జపాన్, ఇటలీ, టునీసియా, అర్జంటీనాలతో ఒక ప్రత్యేకసంఘాన్ని సెప్టెంబర్ రెండవ వారంలో భద్రతామండలి నియమించింది.

## చంద్రలోకానికి రష్యా రాకెట్

సోవియట్ యూనియన్ సెప్టెంబర్ 13 వ తేదీన ప్రయోగించిన రాకెట్ "రెండవ ల్యూనిక్" 14 వ తేదీ అర్ధరాత్రి చంద్రమండలంమీద దిగింది. జనవరి నెలలో మొదటి ల్యూనిక్ ప్రయోగించబడింది. ఇది చంద్రమండలం దాటిపోయి, సూర్యమండలానికి ఉపగ్రహంగా మారింది. ఈ రెండవ రాకెట్ గంటకు 27 వేల మైళ్ళ వేగాన పయనించి చంద్రమండలంలో దిగింది.

## కృశ్చేవ్ అమెరికా పర్యటన

సోవియట్ యూనియన్ ప్రధాని శ్రీ నికితా కృశ్చేవ్ అమెరికా ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ ఆహ్వానంపై పర్యటంగా సెప్టెంబర్ 15 వ తేదీన మాస్కోనుండి అమెరికాకు విమానంలో వెళ్ళాడు. వాషింగ్టన్‌లో ఆయనకు ఘనస్వాగతం ఇవ్వబడింది. కృశ్చేవ్ 12 రోజులపాటు అమెరికాలో పర్యటించి తిరిగివెళ్ళాడు. రష్యా, అమెరికల సాంఘిక వ్యవస్థలు భిన్నంగా ఉన్నప్పటికీ ఉభయదేశాల మధ్య సహజీవన సూత్రం పునాదిగా సంబంధబాంధవ్యాలు అభివృద్ధి కావడం అవసరమని కృశ్చేవ్ పెక్కు సమావేశాలలో ప్రసంగించాడు.

## లంక ప్రధాని హత్య

సెప్టెంబరు 25 వ తేదీన బౌద్ధభిక్షువు వేషంలో ఉన్న ఒక వ్యక్తి సింహళప్రధాని శ్రీ సోలమన్ బండారనాయకేపై ఆయన ఇంటిలో ఉండగా రివాల్వర్ పేల్చాడు. రివాల్వరుగుండ్లు ఆయన పొత్తికడుపును, కాలేయానికి తగిలాయి. ప్రధాని 26 వ తేదీన ఆస్పత్రిలో మరణించాడు. ఆయన మంత్రివర్గంలో విద్యామంత్రిగావున్న శ్రీ దహనాయకే ప్రధానిగా ఎన్నుకోబడ్డాడు.

## గోదావరి వరదల భీభత్సం

సెప్టెంబరు నెలలో వచ్చిన గోదావరి వరదల మూలంగా తూర్పుగోదావరిజిల్లాలో 450 గ్రామాలు దెబ్బతిన్నాయి. 20.500 ఇళ్లు నష్టపడ్డాయి. లక్షన్నర యకరాలకుపైగా పైరు నష్టమయ్యాయి.

## శ్రీ పరవస్తు రామానుజస్వామిగారి మృతి

సుప్రసిద్ధ సంస్కృత, ప్రాకృత విద్వాంసులు, పరిశోధకులు శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు సెప్టెంబరు 14 వ తేదీన బెంగుళూరులో మరణించారు వీరివయస్సు 64 సంవత్సరాలు. వీరు విజయనగరం సంస్కృత కళాశాలకు 12 సంవత్సరాలపాటు ప్రిన్సిపాలుగా పనిచేశారు 1942 నుంచి 1954 వరకు తిరుపతిలో ప్రాచ్య పరిశోధనాలయానికి డైరెక్టరుగా పనిచేశారు. హేమచంద్రుని 'దేశీనామమాల' ఇతర సంస్కృత ప్రాకృతగ్రంథాలు సంస్కరించి ప్రచురించారు.

## 'అపరాజిత'కు బహుమతి

1958–59 లో దినపత్రికలలో వెలువడిన కథలను తీసుకుని హైదరాబాదు నవ్యసాహితీ సమితి నిర్వహించినపోటీలో, "భారతి" పత్రిక 1959 మార్చి సంచికలో ప్రచురితమైన "అపరాజిత" అనే కథకు మొదటి బహుమతి రు 116 లభించినది. దాదాపు 1500 కథలు ఈ పోటీలో పరిశీలించబడినవి. శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, కురుగంటి సీతారామయ్య, త్రిపురనేని గోపీచంద్ గారలు సభ్యులుగా ఏర్పడిన ప్రత్యేక సంఘం ఈ నిర్ణయం చేసింది.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఎడఁద నాయది దూదిపరుపై కదలని యింతసుఖంపుఁ
బడఁక యేర్పడ్డది నీకు నాయెదఁ బన్నినమాయ
యిడియించదుగదయ్య నిన్నుగూడ నా యీ దోన మింత
సుడియించు నన్ను శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నిను గుండెతోరాచి నొవ్వకనకుండ నీమీఁద వట్టి
కునుకుమాట లిఖింప నంచు మతి చేసికొంటి నీలోన
ననుచు కొందువు నిన్ను నీవ గుండెలోనఁ ఊపుపొందు
చును ఊపు కనవు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ననుపుకాడవు నిశానిద్ర మెఱుగవు నావలె నీవు
కనిపించినప్పుడు నీవు రాలేదు గద యన్న నేను
చనుదెంచితిని నిద్రపోవుచుంటివం చనవచ్చు తొలచు
చున నేమి యనరు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నాయూహా నాగుండెలోని కదలిక నా బ్రదుకెల్ల
పాయని యీ కేవిమీఁద నాధారపడియుండె నభవ
నా యీ తనువు చేసినావు రాయిగ నను జొరలేవు
సూయాణముగను శ్రీశైల మల్లికార్జునమహాలింగ!

అరయ నా భావనాశక్తి కవధి లేదాయె మిక్కిలిగఁ
బెరిగిన విఱుగుట యగుదె యేదైన వృషభరాడ్వాహ!
పరమమా నీదు నిశ్చలమహాస్వాగ్న భావనాశక్తి
సురుగఁ జేయఁగదె శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

పెరిగి బుద్ధులు నేర్చికొను జగము తమపెద్దలవలన
పెరిగినతరువాత నాప్తవాక్యము విషమయి పోయె
నరయ నీయున్కికి నెల్ల నాప్తవాక్యము ప్రమాణమ్ము
సురలోకవంద్య శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఎండినమతికిఁ బ్రమాణశతశతము మెక్కదు నీకుఁ
బండినమతి కాప్తవాక్య మొక్కటి పరమప్రమాణ
మెండుపచ్చిమనస్సు లెంత వాదించు నిల దండితో ప్రగ
ళుండాలచైత్య శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

కలసివచ్చినవాఁడు జగము పౌరుషకలనమం చాడు
కలసిరానియతండు లోక మిది దైవఘటనయం చాడు
తెలివి వేయివిధాలు తేల్చివేయుట తేలిక నిన్ను
సులభమార్గమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఏది యెట్లైననేమి మరి నే మార్చుటింతయు లేదు
నీదయ యనుకొంటి లోనఁ దప్పేమొ నే నెఱుంగ నినుఁ
గాదని పొడిచివేసినది యేమి యాఘటకుండు తుదకు
సోదెలో రాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

తనలోనఁ దన్నుఁదాఁ జూచికోఁజోక తనకంటె నితర
మునయందుఁ దన్నుఁదాఁ జూచికొన్నట్లు మురిసి తానదియ
యనినట్లుగ స్వయంప్రతారణముసేత యలవాటుపడి పి
శునజాతి యాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఎవరిదాఁకనో యేలనయ్య నీమీద నెద నిల్పలేక
యవుర వారును వీరు నిట్టివారును నట్టివారంచు
తవులు మానినగుండెతోడ శివ! పెడదారిఁబట్టెదను
సువిచారమూల! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ప్రియతమతేజ నాగుండె నీనుండి బెసుకనీయకువె
దయమాలి తనుకోను బెనకిపోయిన దండింపుమయ్య
యయయొ నీదండన మద్ది క్రొత్తయా యల్పమా భావ
సుయమ గూఢాకార శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అటు సుఖావధి వౌచు నీవు దుఃఖాని కవధివైయె నేను
ఘటియించు దుఃఖంబు చివరజ్యోతివై కన్బొమల్ నడుమ
మొటకరించుచునుంటి గుండె యటమటింపుఁయుఁ గన్నీటి
జొటజొటమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

నిరతిశయంబు దుఃఖంబు సాధనానియతి నేగ్గుఱచి
నిరతిశయంబు సౌఖ్యంబు నీమూర్తి నిభృతంబు సేర్తు
పరమకాఠిన్యమో పరమదయయో స్వభావంబు నీది
సురుచిరమహాన శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

కదలక మెదలక యంత నిశ్శబ్దఘటనగా నుందు
మదిలోన నెంచినమాత్రలో సర్వమహిమ భాసించి
యెద దూసికొనిపోదు దూసినమ్ము సాహిత్యమ్ము కలవు
రొదలేనియమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

క్షితిలోనఁ బ్రత్యర్థితోడ యుద్ధమ్ముచేసెద రభవ!
శితికంఠ భక్తులతోడ యుద్ధమ్ముసేసెద వీవు
అతిదయాక్షీరాంబునిధివి పిల్లలమని గుండె మాకు
శ్రుతిచేసికొంటి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అనుభవ పారమ్యమందినపుడు బ్రహ్మానందపరిధి
వల చెప్పచుందురుగాని యవునుగా దది యుమాజాని
మనసులోనఁ దలంచుమాత్ర మధుపరీమళరేఖ యెపుఁడుఁ
జొనిపినట్టు లగు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఇల సుఖార్థులు గడ్డితించు కుధనులై యెకదొట్టులేలా
తలఁపులోపల నీవు నువ్వగింజంత తారాడ. నొడలు
పులకరించెడు గుండె పరమనిర్వాణముం బొందు నింత
సులభసౌఖ్యమవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

లౌకికంబయినట్టి సౌఖ్యలేశంబు లభియించు వ్యసని
తా కారణంబుగా వ్యసనభావంబు తమరిపై మఱచఁ
దేఁకువ సౌఖ్యంబు తెచ్చి నిలువుగాదెల నింపవచ్చు
శోకాపనోద శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నిన్నుఁగూర్చిన యూహ కాగడావోలె నించి కాలెడిని
మున్ను సమృద్ధిగా నా ముదంబును బోసితివేమొ
నన్ను తావిఁబ్ధెన్న తైలధారాసుసాంతత్య మొప్ప
చున్నట్టు లుండె శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

# కేరళప్రభుత్వ గ్రహచారము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఏనది. కోలాహలము శాంతమయినది. కొన్ని నెలలుగా కేరళ దేశములో చెలరేగి యుండిన అరాజక వాతావరణపు దుమారము ప్రశాంతమయినది. సమ్మెలు, ప్రాయోపవేశములు, గృహదహనములు, నిరోధక చర్యలు, లాఠీ దెబ్బలు, బాష్పవాయు ప్రయోగములు, తుపాకి కాల్పులు, నిర్బంధావాసములు, మున్నగు విప్లవ చిహ్నములవలని అశాంతి ఇంక ఆ రాష్ట్రములో తగ్గిపోగలదు. పరిపాలనాధికారమును తానే స్వీకరించినట్లుగా, కేంద్రప్రభుత్వపు సలహాపైన, రాష్ట్రపతి శ్రీయుత రాజేంద్రప్రసాదబాబు[1] నిన్నటి (81-7-59) సాయంకాలమున 6-0 P. M. (I.S.T) వేళలో ఆజ్ఞాపత్రముపై హస్తాక్షరములు వేయుటతో శాంతిభద్రతలను సాధింపజాలని కమ్యూనిస్టు మంత్రివర్గ పరిపాలనమునుండి కేరళ భూమి విముక్తిని సంపాదించినది. మంత్రివర్గముతోపాటు కేరళ శాసనసభ సయితము నిన్నటితో కీర్తిశేషమగుటచే, రాష్ట్రపతికి ప్రతినిధిగా గవర్నరుగారే కొంతకాలము రాష్ట్రపరిపాలనమును నిర్వహించగలరు. దేశములో ప్రకృతిరంజకముగా పాలన పద్ధతి జరుగకపోవుటవలన అతృప్తి హెచ్చి, తత్ఫలముగా విప్లవరూపమయిన అంతర్యుద్ధము బయలుదేరి హద్దుమీరిపోవుచున్న కారణమున, సామాన్య రాజకీయనీతిసూత్రములను తాత్కాలికముగా అచట స్తంభింపచేయవలసివచ్చినది. మరల కొన్ని నెలలకు క్రొత్తగా ఎన్నికలు జరిగి ప్రజాప్రతినిధులు వచ్చుదాక వేచియుండవలసినదే.

దేశములో ఇప్పుడిట్టి విప్లవము తలఎత్తుటకు హేతువేమి, ఈ అరాజక చర్యలకు ఎవరు బాధ్యులు, విప్లవకారుల చర్యలు నైతికముగా క్షంతవ్యములా, మంత్రివర్గపు ప్రతిక్రియలు నీతిబద్ధములా, సామాన్య రాజ్యాంగ నీతి నియమములను ఇట్లు కేంద్రప్రభుత్వము స్తంభింపచేయుట సాధువా? అను మొదలగు సమస్యలతో మన కిచట పనిలేదు. వానిని రాజనీతి విద్యా విశారదుల చర్చలకు వదలుదము గాక!

ప్రశంసలోనున్న మంత్రివర్గము ఎట్టి ముహూర్తములో నిర్మించబడెనో, ఈ విప్లవమునకు, ఈ అకాల మంత్రివర్గ పతనమునకు, ఆ ముహూర్త ఫలములతో ఏమి సంబంధమో, కొంత పరిశీలింతము. రాష్ట్రపరిపాలనము కొరకై మంత్రివర్గము నిర్మించు రాజనీతిజ్ఞులు జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిరాదరించుటవలన దేశమునకు ఎంత కీడు మూడునో గమనించగలిగిరేని, ఇకముందైనా, ఇట్టి సందర్భములలో, తగినంత జాగ్రత్త వహించగలరేమో అని ఆశ.

కడచిన హేవలంబ సంవత్సరమున చైత్రశుక్ల పంచమినాడు, రోహిణీ నక్షత్ర యుక్త శుక్రవారమున, (5-4-1957 వ తేదీన) అభిజిన్ముహూర్తమందు, కేరళ రాజధానిలో శ్రీయుతులు ఇ. యం. శంకర నంబూద్రిపాదు ముఖ్యమంత్రిగా ఈ మంత్రివర్గము నిర్మించబడినదని చదువరు లెరుంగుదురు. ప్రభుత్వమువారి మౌహూర్తికు లెవరో కాని, (ఏ ఉపకార్యదర్శియో, ఏ శాఖాధికారియో కాబోలు) ఈ మంత్రివర్గ నిర్మాణమునకు ఆనాడు పగలు 11-0 A M (IST) గంటలకు శుభముహూర్తము నిర్ణయించియుండిరట! ఆ కాలములో ముఖ్యమంత్రి గవర్నరుగారి ఎదుట ప్రమాణస్వీకారము చేయవలసియుండెను. కాని ఆ దినమున రాహుకాలము పగలు 12-24 గంటలవరకు వ్యాప్తిలోనుండినది. ప్రాయికముగా, దాక్షిణాత్యులు, ఇతర విషయములను గమనించకపోయినా, రాహుకాలమన్నచో గడగడ వడకుదురు. ఆ కారణమున కాబోలు, శ్రీ నంబూద్రిపాదు ఏదో యుక్తితో కొంతకాలయాపనముచేసి, 12-80 గంటలకు ముఖ్యమంత్రిగా ప్రమాణముచేయుటకు సిద్ధపడినాడు. రెండు నిమిషములలో తతంగము ముగిసినది. ఆ క్షణమే మంత్రివర్గ

1. ఈ వ్యాసము 1-8-1959 వ తేదీన వ్రాయబడినది.

పాలనమునకు జన్మకాలము. అప్పటి గ్రహస్థితి ఈ క్రింది చక్రము చూపగలదు :

| | | | |
|---|---|---|---|
| | శు 12-52<br>గ15-18-59<br>X 17-0 | బు 0-34<br>కే 21-48<br>రాజ్య22 27 | కు 11-35<br>చ 21-54 |
| | (పాయనము)<br>—<br>నంబూద్రిపాగు<br>మంత్రివర్గ జాతకము | | I 17-42 |
| | | | వ 2-58 (వ)<br><br>య28-12(వ) |
| శ 14-11(వ) | ఇ 1-40<br><br>రా 21-43 | | పుణ్య 14-56<br>గు 24-34(వ) |

పదవీ స్వీకారమునకు చరరాశి లగ్నము అర్హము కాదు. పదవికి సహజముగా ఉండవలసినంత స్థైర్యము చెందదనుట. అందులో నిలుకడలేని ద్విస్వభావ నవాంశ! ఇక, చంద్రుడుండునదియూ, ద్విస్వభావ (మిధున) రాశియందలి చరనవాంశ! ఇట్టి లగ్నములో పుట్టిన పరిపాలనాసంస్థకు స్థైర్య మెట్లు రాగలదు? పోగా, లగ్నమునకు శుభగ్రహ సాన్నిధ్యమయినా, కడకు ప్రబల శుభగ్రహ దృష్టి అయినా, చూపట్టదు. లగ్నాధిపతి చంద్రుడున్ననో, వ్యయభావములోనుండి పతనోన్ముఖుడై నాడు.

"నూనం వ్యయాష్టారిగత శ్శశాంకః,
క్షితీశ్వరం హంతి తదా బలీచేత్."

(జ్యోతిర్నిబంధము)

వ్యయచంద్రుని ఫల మిది. అగుటచే ముహూర్తము కేవలము బలహీనమైయున్నది. రాష్ట్ర పరిపాలన మారంభించుటకు ఇది తగిన ముహూర్తమనుట సాహసము.

ఇంతటితో పోలేదు. పుణ్యసహమము నిండుగా శశికేంద్రవేధలోనున్న కాలములో సంపాదించిన పదవిలో పుణ్యము ఫలించగలదా? ప్రజాహితము చేకూరగలదా? ఇంద్ర, బుధ, వరుణులనుండి సయితము ఈ సహమమునకు ప్రబలవేధ! నిరంకుశాధికార ఫలముగా విప్లవ వాతావరణమును ఈ యోగము సృష్టించ గలదు. రాజ్య సహమాధిపతి శుక్రుడు రాజ్యభావములోనే యుండి యముని పార్శ్వకేంద్ర విషమదృష్టిని తీసుకొని త్వరలోనే రవి సంయోగదగ్ధుడు కాబోవుచుండగా ఆరంభమయిన ఈ మంత్రివర్గపు పరిపాలనము వలన దేశములో శాంతిభద్రతలు ఎంత రమ్యముగా నుండగలవో, ఊహకు మించినదికాదు. కష్టపడి రాహుకాలమును తప్పించినారే కాని, రాజ్యసహమము రాహుకేతువుల వేధలో నలిగిపోవుచుండుట గమనించినవారు కారు. చంద్రమంగళయోగము వ్యయభావములోనుండి, సప్తమాష్టమ భావాధిపతియై షష్ఠభావములోనుండు శనినుండి సమసప్తక వేధ నందుకొనుచున్నది. మంత్రివర్గమును కూలద్రోయుటకై శత్రువుల సన్నాహము ప్రబలముగా నుండుననుటకు సూచన ఇది. శని కట్టుతప్పించుకొని జారిపోవుట సామాన్యముగా అసాధ్యము. పంచమ రాజ్యాధిపతి యగుటచే, "రాజయోగకర స్స్యాత్ ఏక ఏవ ధరాసుతః." అని, కర్కాటక లగ్నమునకు రాజయోగ ప్రదుడయిన కుజునితో లగ్నాధిపతి చంద్రుడు చేరుట. రాజయోగమునకు ప్రాబల్యమే కావలయును కాని,దోష మెట్లగును? అని ఆక్షేపించువారుందురేమో! వాస్తవముగా రాజయోగ ప్రాబల్యమున్న హేతువు వలననే, కేంద్రప్రభుత్వమునకు ఊతకొమ్మయగు కాంగ్రెసుసంస్థకు ప్రతికూలాదర్శములుగల కమ్యూనిస్టు పక్షమునుండి మంత్రివర్గమేర్పడి పదవీ స్వీకారము చేయగల్గుట! కాని, ఇచట ఒక్క విశేషవిధి యున్నది. లగ్నాధిపతియయిన చంద్రుడు రాజయోగకారకుడగు కుజుని సంయోగమునుండి విడివడి అష్టమాధిపతియగు శనితో సమసప్తకమునకే ప్రయాణము చేయుచున్నాడు. అగుటచే, ఈ చంద్రునికి ఇత్థశాలయోగమునకు మారుగా ఈసరాఫయోగము పట్టినది.

"శీఘ్రగ్రహో మందగతే ర్గృహాత్తు
యదైకభాగం పురతః ప్రయాతి,
తదేసరాఫః, సతు మూసరీఫః
పురాతనైః దుష్టఫలః ప్రదిష్టః."

(తాజక భూషణము)

అను తాజక సూత్రము ప్రమాణము. ఇంతేకాదు. పైవిధముగా యోగభ్రంశములను పొందిన ఈ లగ్నాధిపతి చంద్రుడు అష్టమాధిపతి శనితో ఇత్థశాల యోగము నందుట ప్రబలారిష్ట సూచకము.

"లగ్నేంతిహాపతి సమాపతస్తా మృతీరాత్
చే. ద్విధా శాలివ ఇమే నిధనప్రదాః స్యుః."

అను రాజకసూత్రమును గమనించినచో, ప్రబల శత్రువులు గిట్టి పట్టుపట్టి, అంతర్యుద్ధ విప్లవమును గుర్ఛవ్య పద్మవ్యూహమును పన్ని మంత్రివర్గమును కూలద్రోయుదురని స్పష్టమగును. ఆగస్టునెలల ప్రయాసతో ఏబదిలక్షలక్యూయముతో. శత్రుపక్షము కేంద్రము ద్వారా కడకు కార్యమును సాధించినదికదా!

శ్రీ నంబూద్రిపాదు రాహుకాలమును తప్పించుకొనగలిగినా, ఈ లగ్నము తన జాతకములో అతుకునో, లేదో, పాపము, గమనించినవాడు గాడు. ఒకవేళ, గమనించియుండినా, ఇంద్రావరుణ గ్రహముల స్థితిని నిరాదరించి, అంతా సమీచీనముగానున్నదని భావించెనో కాబోలు! చూడుడు. అతని సాయన జాతక చక్రము ఈ క్రిందనున్నది. 18-6-1909 నాడు (8-30 ఉత్తరాక్షాంశలో 76-84 పూర్వరేఖాంశా ప్రదేశములో) జనించిన

| | | | |
|---|---|---|---|
| శు 11-15 | శ 20-57<br>చ 24-48 | | రా 16-26<br>ర 21-52-59<br>బు 23-39<br>య 25-9 |
| | (సాయనము) | | కు 4-10<br>ఇ 15-53 |
| వ 20-11 R<br>I 5-4 | నంబూద్రిపాదు జాతకము | | |
| కే 16-26 | రాజ 4-8<br>పుణ్య 8-3 | X 10-2 | గు 7-10 |

వ్యక్తి ఇతడు. లగ్నాధిపతియగు శనితో, తను భావములోనున్న వరుణునితో, విషమదృష్టియోగము కల మాయావి ఇంద్రుడు సప్తమ భావములోనున్నాడు.[2] ఆ ఇంద్రుని చలితస్థానము ఇపుడు కర్కాటక రాశిలో 17-42 లో నున్నది. నికరముగా అదే భాగకలనే లగ్నముగా ఏర్పరచి ఇతడు పదవీ స్వీకారము చేయుట! అనగా, మంత్రివర్గ జాతకమునందు లగ్నములో అతని ఇంద్రుడూ, సప్తమభావములో అతని వరుణుడు, నిలబడియుండిరనుట! ముఖ్యమంత్రియొక్క ప్రభావము, అనగా, రాజనీతి మంత్రివర్గపు పతనమునకు నిదానమును సూచన సిద్ధమైనది కాదా!

ముహూర్తము రాజయోగప్రదమయినా, ముఖ్యమంత్రి జాతకముతో చక్కని అతుకులేనిచో, సత్ఫలము నివ్వజాలదు. అతని రాజ్యాధిపతి శుక్రుడు చలించి జన్మవరుణునితో సార్ధకేంద్రమునకు రాగా, మంత్రిపదవి పోయినది.

"కర్మకాల ఫలం శస్తం
దుష్టం స్యాత్ జన్మజం ఫలం,
కార్యం భూత్వాపి, తత్పశ్చాత్,
మహావిఘ్నః ప్రజాయతే."

అను సూత్రమును ఇచట మనము అన్వయించుకొనవలసియుండును. పదవి వచ్చినా, తరువాత కార్యనిర్వహణమునకు మహావిఘ్నము దాపురమైనది కదా! 'విమోచన సమర సమితి' యను పేరున రాజ్యాంగమును కూలద్రోయుటకై, పలుకుబడి, ఆర్థిక సాకర్యము, సంఘబలము, కాంగ్రెస్సు సంస్థ సానుభూతి, గల గొప్ప ప్రజాసంస్థ యొక్కటి ఏర్పడి తదేకదీక్షతో నానావిధ కష్టనష్టములకోర్చి విప్లవమును లేవదీసి కడకు తన ఉద్దేశమును సాధించి తీరినది. వరుణుని ఆగడము, ఇంద్రునిమాయ, ఈ కథలో స్పష్టముగా చూపటినవి.

ముహూర్తము అంత దోషభూయిష్ఠమయినచో, మంత్రివర్గము రమారమి రెండు సంవత్సరములమీద

---

2. శ్రీ నంబూద్రిపాదు జన్మకాలము తెలియదు. నిరయనసింహలగ్నము కాబోలునని ఎవరో ఊహించినారట! జీవితానుభవముల ఆధారమున అతని జన్మలగ్నము సాయన మకర రాశిలో 5 భాగలు, 4 కలలనియు, శుద్ధజన్మకాలము ఉదయము 7-34½ (IST) అనియు, సహేతుకముగా నిర్ధరించి, బెంగుళూరు 'అస్ట్రాలాజికల్ మ్యాగజైన్' అను ఆంగ్లమాస పత్రికయొక్క 1957 వ సంవత్సరపు ఆగస్టునెల సంచికలో నా ఊహలను పరిశోధకులకు మనవి చేసితిని. ఆ సమన్వయమును మార్చుకొనుటకు తగిన నూతన సామగ్రి ఏమియూ లభించలేదు. కనుక అపుడు సాధించిన చక్రముచే ఇచటి ఉపయోగించితిని.

మంత్రివర్గ పతనము జరిగిననాటికి పై లగ్నాధారమున అతనికి దైనికజాతకమును సాధించినచో, దైనికలగ్నము అతని వరుణగ్రహ స్థానమునుండే వచ్చుచున్నది. జన్మలగ్నము సాధువనుటకు ఇది సయితము నిదర్శనమగుచున్నది.

నాలుగు నెలలు సాగియుండగలదా? అను శంకకొందరికి కలుగవచ్చును. ఏ యోగములయినా, అనుకూలముగు దశరానిదే ఫలము నియ్యవు. ముహూర్త చక్రమునకు దశనూనదశ సాధించి చూచుదము.

రాజ్యభావమందున్న రవికి 2 భాగలు, 22 కలల దూరము వెనుక నైపున శుక్రుడు నిలచియున్నాడు కదా? ఇది ప్రబల శుక్రమౌఢ్యకాలము. దాక్షిణాత్యులు దీనిని గమనించరట! వారు గమనించినా, మానినా, రెండు దినములకు ఆ శుక్రుడు—రాజ్యసహమాధిపతి—ముహూర్తపు రవితో సంగమించుట తప్పదు. చతుర్థభావాధిపతి అస్తమించుటే ఇది. దీని ఫలముగా, రెండు సంవత్సరములు కడచినంతలో దేశములో శాంతి భద్రతలు మాయమైనవి. 1959 జూన్ నెలకు దశనాథిపతి కుజుడు చలించి ముహూర్త చంద్రునిపైకి వచ్చినాడు. చంద్రమంగళయోగ మిప్పటికి పూర్తి అయినది. అనైతిక చర్యలు, అక్రమ ధనార్జనము, మాతృక్లేశము, ఈ యోగఫలములని వరాహమిహిరాచార్యుని మతము. "సాటస్త్ర్యాసన కుంభి పణ్య మశివం మాతు స్స వక్రశ్శశీ." అని. ఇది సంస్థాజాతకముగుటచే, మాతృక్లేశమునకు మాతృభూమిక్లేశమును అర్థముగ్రహించుట సహేతుకమగును. కనుక, ఈ యోగఫలము లన్నియు ఇపుడు కేరళ దేశమునకు అనుభవమునకు రాదగియున్నవి. విప్లవ రూపమగు ప్రతిష్టంభనము, క్రాంతిఘోషణములు, రక్తపాతములు, అపమృత్యువులు జరిగినవి కదా? మంత్రివర్గ విరోధులతో కారాగారములు కిటకిటలాడినవి. దేశము క్షోభించినది. కేంద్రప్రభుత్వము తల్లడిల్లినది.

రాజ్యసహమమునకు గురువునుండి త్రికోణ శుభదృష్టిసౌకర్యము సమృద్ధిగానుండెను. ఆ సహమము చలించి గురుదృష్టి నతిక్రమించి ముందుకు జరుగుటచే, మంత్రివర్గపాలనము కేంద్రప్రభుత్వపు సానుభూతిని కోలుపోయినది. శశికేంద్రవేధ దెబ్బచే నలుగుచుండిన పుణ్యసహమము చలించి ఇప్పుడే విప్లవకారులగు ఇంద్రావరుణుల అర్ధకేంద్రవేధ నందుకొనుట. పుణ్యమిట్లు ఫలించినది. ఇదే సమయమందే చలితభావమునుండి లగ్నముపై కేంద్ర విషమదృష్టి దాపురముగుట. గ్రహరాజుయొక్క క్రూరదృష్టిఫలము రాజేంద్రుని కలము పోటులో ప్రతిఫలించినది. ఇట్టి దశావిపర్యాస సమయమందే చలితలగ్నము ముఖ్యమంత్రి జాతకపు వరుణునితో నికరముగా సమసప్తకదృష్టికి వచ్చుట. ఈ నాటకమున కిది భారతవాక్యము!

ప్రమాణస్వీకారపు లగ్నమునకు కొంత విలువ కలదా, అని సందేహించువారు రాష్ట్రపతి ఆజ్ఞాపత్రముపై చేవ్రాలు చేసినప్పటి గ్రహస్థితిని కొంత పరికింతురుగాక. 31-7-1959 నాటిరాత్రి 6-0 (IST) గంటలకు దేహలీనగరమునకు గుణించిన చక్రమిది.

| | | | |
|---|---|---|---|
| | కే 6-51 | | చ 20-27 |
| | (సాయనము) — నంబూద్రిపాదు మంత్రివర్గ పతనము. — | | |
| I 18-32<br>శ 1-26 | | | ర 7-33<br>శు 16-6<br>బు 16-23(వ) |
| | ఇ 4-15<br>X 5-22<br>కు 22 19 | రా 6 51 | య 3-1<br>కు 6-53<br>శు 14-10 |

ఆక్షణమున పూర్వదిశాహరిజమున ఉదయించుచున్న సాయన మకరరాశి 18 వ భాగలో ఏమి వైశిష్ట్యమున్నదో, చదువరులు గమనించగలరు. శ్రీ నంబూద్రిపాదు జాతకపు వరుణుని చలితస్థాన మదే. దానిపైన కూర్చుండిన లగ్నము మంత్రివర్గపు లగ్నమునకు ఎదురుచుక్కగా పరిణమించినది. ఇది కాకతాళీయమని గలమా? అదే నిమిషమందే కేరళ రాజధానిలో దశమ కేంద్రము వృశ్చికరాశిలో $4\frac{1}{2}^{\circ}$ భాగలో నుండినది. ఏమి దీని విశేషముందురా? చూచుదము. ముఖ్యమంత్రి జాతకమున రాజ్యసహమము వృశ్చికములో 4-8 లో నున్నది. మంత్రివర్గ జాతకపు చలిత బుధుడు (వృషభములో 4-20) దానికి ఇపుడు ఎదురైనాడు. తాత్కాలికముగా మాయావి ఇంద్రుడు ఆ సహమముపైకివచ్చి ఆ చలిత బుధునితో సమసప్తక శత్రుదృష్టికి రాగా, రాష్ట్రపతి ఈ పరికరము నుపయోగించుకొని ఆజ్ఞాపత్రముల నిచ్చినాడని అప్పటి దశమకేంద్రము చాటి చెప్పుచున్నది. ఇంద్రజాల ప్రభావమువలె మంత్రివర్గము అంతర్ధానమై, రాష్ట్రపాలనము రాష్ట్రపతి అధీనమయినది.

మంత్రివర్గజాతకమునకు ఆ నాటికి దైనికజాతకమును సాధించి చూచుదము. దైనిక దశమకేంద్రము సింహములో $7\frac{1}{2}^{\circ}$ భాగలో నుండినది. శ్రీ నంబూద్రిపాదు చలితభాగ్యాధిపతి బుధుడు (సింహరాశి $7\frac{1}{2}^{\circ}$)

అతని అష్టమాధిపతి రవితో అర్ధకేంద్ర వేధలోనుండగా, ఆ బుధుని సంయోగములో దినికదశము నిలిచినది. నికరముగా ఆ భాగలోనే అప్పటిరవి యుండుట! ఇది కాకతీయమా?

మహాత్మగలగ్నమునకు విలయున్నదో, లేదో, చదువరులే నిర్ధరించుకోగలరు. "జ్యోతిశ్శాస్త్రఫలం సర్వం లగ్నాధీనం బుధైః స్మృతం." అనుట ప్రాచీనుల అభిప్రాయము.

కేంద్రప్రభుత్వపు ఐక్యముతోన కదా ఈ మంత్రివర్గపతనము జరుగుట? ఆ ప్రభుత్వ జాతకమున ఇప్పుడిట్టి చర్యకు సూచన కలదా? అను శంక రావచ్చును. నిస్సంశయముగా అట్టి సూచన ఉండక తీరదు. చూతముగాక.

కేరళ మంత్రివర్గపు జాతకములో రాజయోగమునకు, యోగభంగమునకు సహా కారణముగు చంద్రమంగళయోగమునకు స్పష్టముగా ప్రత్యక్ష శత్రుదృష్టిస్థానమందే శ్రీ రాజేంద్రబాబు జాతకమందు రవియుండుట! అనుగ్రహము, నిగ్రహము, రెండును అతని అధీనములే. 3 ఇట్టి రవి దేవమానదశలో ఇప్పటికి కుంభరాశిలో 18° వ భాగకువచ్చి, మంత్రివర్గ జాతకమందలి యమునికి ఎదురు ముక్కుగా నిలచి యున్నాడు. అతని ఆజ్ఞచే, ఈ మంత్రివర్గము కీర్తిశేషమగుటకు ఇంత చాలు. ఆజ్ఞాపత్రములో అతడు వ్రాలుచేసిన క్షణమందు దేహాలీనగరమందు దశమకేంద్రము నికరముగా అతని జాతకపు శుక్రునిపై (కుంభము 5 19) నుండుట! దేశములో శాంతిని నెలకొల్పుటచే అతని ముఖ్యోద్దేశమనుట స్పష్టము.

ప్రస్తుత రాజనీతిలో రాష్ట్రపతి నిమిత్తమాత్రుడే కదా? కేంద్రప్రభుత్వపు అభిప్రాయమునకు రాజముద్రను తగిలించుటే, సాధారణముగా, అతనికర్తవ్యము. ఆ ప్రభుత్వమునకో, ఈ కమ్యూనిస్టు మంత్రివర్గపు రాజనీతియన్నచో, తలనొప్పి; మొదటినుండి దానిపాలన పద్ధతులపై ఓరగంటి చూపే. మంత్రివర్గ జాతకమందలి లగ్నమునకు 90° భాగలలో ఇంద్రుడు (కర్కాటకము 17-20), 180° భాగలలో (మకరము 18-40) బుధుడు, కలది భారతప్రభుత్వ జాతకము. 4అనగా, శ్రీవంబ్యాది పాదుగారి వరుణునితో కేంద్రప్రభుత్వపు ఇంద్ర బుధులకు, ఏమాత్రమయినా, పొత్తుకుదురదేదనుట! రాజనీతి ఆదర్శములలోగల భేదమే దీనికి కారణమని ఎరుగుదుము. కాని, కేంద్రప్రభుత్వపు శని (రాజ్యభావాధిపతి) కన్యారాశిలో 18°-47' లో నుండి మంత్రివర్గ లగ్నమునకు గుప్తమిత్రదృష్టిలో నుండుటచే, పరీక్షించి చూతమని కొంతకాలము ఓపికపట్టి కేంద్ర ప్రభుత్వము ఊరకుండక తప్పినది కాదు. మంత్రివర్గ జాతకపు రవి చలించి తనలో ఘర్షణమున కెపుడువచ్చునోయని నిరీక్షించుచు, వేయికన్నులతో పరిపాలనా పద్ధతిని గమనించుచుండిన కేంద్రప్రభుత్వజాతకపు ఇంద్రమహాశయునికి ఇప్పుడా అవకాశము లభించెను. ప్రకృతి రంజకముగా పరిపాలనమును సాగించనేరని ఈ కమ్యూనిస్టు మంత్రివర్గము "ఈ, రాజులు రాజులా, వెను తరాజులూగాక ధరా స్థలంబునన్." అనురీతి, నిరర్థకము, అశాంతికరము అయినదని భావించి, సమయముచూచి, ఆ ఇంద్రుడు రాజ్యాంగ స్మృతియందలి 356 వ సూత్రము పేరున, అప్రతిహతమగు తన వజ్రాయుధమును ఉపయోగించినాడు. మంత్రివర్గము, దానికి చేయూతగ నుండిన శాసనసభసహా, క్షణములో చీట్లపేకల మేడవలె టప్పున కూలిపోయినవి. ఇంద్రుని శక్తి అసామాన్యము. కావునే, ఇంద్రుడన్నచో మనవారెంతో భక్తితో ప్రార్థించెడివారు.

"యత ఇంద్ర భయామహే,
తతో నో అభయం కృధి."

అనుచుండిరి వారు. అది యట్లుండె.5 మన మహాప్రధాని శ్రీ నెహ్రూ పండితుని జాతకములో చలితవరుణునితో (తులారాశి 26°-40) నికరముగా పార్శ్వకేంద్ర

3. ఈ మహనీయుడు జనించుట 3-12-1884 వ తేదీనాడు పగలు 11-0 గంటలకట! (25-38 ఉత్తర అక్షాంశ; 85-10 పూర్వరేఖాంశ.) ప్రకృత సమస్యకు అవసరమగు గ్రహస్థితులు మాత్రము వ్యాసములో సూచింపబడినవి.

4. భారత రిపబ్లికు సంస్థ 26-1-1950 వ తేదీన 10-30 Am (IST) లో ఆరంభమయినది. దాని లగ్నము సాయన మేష ...లో 9-15.

5. ఈ లోకోత్తరవ్యక్తి 1889 నవంబరు 14 వ తేదీన (25-25 ఉత్తర అక్షాంశ; 82-0 పూర్వ రేఖాంశ) జనించెననుట సుప్రసిద్ధవిషయము. కాని అతని జన్మకాలమునుగూర్చి జ్యోతిశ్శాస్త్రవేత్తలలో భిన్నాభిప్రాయములున్నవి. 10-45 pm అని యొకరు, 11-8 pm అని యొకరు, 11-22 pm అని మరి యొకరు, 11-39 pm అని వేరొకరు భావించిరి. రాత్రి 11 గంటలకు జననమని "జ్యోతిషరత్నాకరము" గ్రంథములో వ్రాయబడియున్నదట. జీవితానుభవముల దృష్టిలో 11-33 pm జన్మకాలమగునని నా ఊహ. ఇది విమర్శనీయమగుటచే ఈ క్రమమును ఇచట వ్రాయవలసితిని.

# కేరళప్రభుత్వ గ్రహచారము

క్రూరదృష్టిలో రాజయోగ కారకుడగు కుజుడుండగా ఏర్పడినది నంబూద్రిపాదు మంత్రివర్గము. అతని (చలిత) ఇంద్రునికి (మిథునరాశి 1°-55) అర్ధకేంద్ర విషమదృష్టి స్థానమందే ఆ మంత్రివర్గపు జన్మలగ్నముండుట! పైగా, అతని చలిత రవికి (కుంభరాశి 1°-30) కేంద్రములో తాత్కాలికముగా ఇంద్రుడు నిలిచియున్న కాలములో ఏర్పడిన పాలక సంస్థ ఇది. ఇట్టి సందర్భములలో మహాప్రధానికి ఈ మంత్రివర్గ పాలనముపై విశ్వాసము ఎట్లుండగలదు?

కాని, విశేషమొక్కటి కలదు. కేంద్రప్రభుత్వ జాతకమున రాజ్యభావాధిపతియగు శనితో (కన్యారాశి 18°-47') పరివర్తన యోగముతో కూడిన ప్రబలమైత్రి బుధునికి (మకరరాశి 18°-42) కలదు. ఆ గ్రహాన్వయముతో మహాప్రధాని దశమకేంద్రము (వృషభరాశి 19°) పరిపూర్ణ మిత్రదృష్టిగా నుండుట భారతభూమి భాగ్యంపువంట. ప్రస్తుతపు కేరళ గవర్నరు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి ప్రబల రాజ్యస్థానము (వృశ్చికములో 18°-21') శ్రీ నెహ్రూ పండితుని చతుర్థకేంద్రములో, అతని శని బుధులిరువురి అర్ధకోణ సుదృష్టిలో నేయుండుట ముఖ్యముగా మనము గమనించవలసిన అంశము. ఈ ప్రబల గ్రహయోగపు సౌమ్యదృష్టి నంబూద్రిపాదు మంత్రివర్గ జాతకమునకు ఏరీతి లభించినదో, చదువరులు సులభముగా గుర్తించగలరు. గవర్నరుగారి ఉజ్వల నీతిస్ఫురణము భిన్నాభిన్నములకు సామంజస్యమును కూర్చవలెనని ఫలముగా మంత్రివర్గమునకు మహాప్రధాని సానుభూతి లభించియుండెననుకొన్నచో, సత్యమునకు సమీపమునందే [illegible] నిలువగలదు. మేషరాశి 17° వ భాగలో నున్న మంత్రివర్గపు రాజ్యస్థానము (దశమకేంద్రము) స్వాతంత్ర్య ప్రీతితో విపరీత పథము నాశ్రయించు స్వభావము కలది. ప్రజాసామాన్యమునకు రుచించినా, రుచించకపోయినా, ఉన్నతస్థాయిలో పరిస్థితులను మార్పు కుతూహలము దాని నైజగుణము. భారతప్రభుత్వపు ఇంద్రుడు (తులారాశి 17°-20') ఆ దశమ కేంద్రమునకు సమసప్తకమే కదా? మంత్రివర్గపు కార్యములు దానికి అభిమతములు కాజాలవు. కాని, గవర్నరుగారి శాంతిభద్రతాప్రియుడగు శుక్రునితో (ఇతడు చతుర్థ భాగ్యాధిపతిఅగుటచే రాజయోగకారకుడు) చేరి అతని లగ్నము దేవమానవశిలో ఇపుడు మేషరాశి 17° వ భాగకే వచ్చుచున్న కాలమందే ఈ మంత్రివర్గము ఏర్పడిన కారణమున, ఆ మహనీయుని రాజనీతి నైపుణ్యము ఫలించి రెండు సంవత్సరములు పరిపాలనము ఒకవిధముగా సాగినది. కాని, ఎంతఅయినా, ఇది అతుకులబొంత! గురుతరమగు రాజ్యనిర్వహణ భారమును ఇది ఎంతకాలము మోయగలదు? శ్రీ నెహ్రూ పండితుని చలితరవి (అతని లగ్నాధిపతి) మంత్రివర్గపు వరుణునికి ఎదురుకాగా, ఆసంస్థ విచ్ఛిన్నముకాక తప్పినదికాదు. రవి వరుణుల వేగ సంబంధములను సహించదు.

దేశమునకు గొప్ప క్షోభకాని, రాజునకు ప్రబలారిష్టము కాని రానున్నచో, మును ముందుగా ఆ ప్రదేశములో ఉత్పాతములు పుట్టునని పెద్దలు చెప్పుదురు. ధూమకేతు దర్శనము, భూకంపము, మున్నగునవి అట్టి ఉత్పాతములు. అనేక సందర్భములలో ఉత్పాతములనుండి అట్టి సూచనలువచ్చినవి కూడ. ప్రకృత సందర్భములో నయితే యట్టి సూచన వచ్చినదన వచ్చును.

28-7-1959 వ తేదీనాడు 8-55 Am (IST) కాలమున కేరళ దేశములో కొన్ని సెకండ్లు చిన్న భూకంప మొక్కటి కలిగెనని వార్తాపత్రికలలో పాఠక మహాశయులు చదివి యుందురు. ఆనాడే ఢిల్లీలో కేంద్రమంత్రి మండలము కేరళ సమస్యను రహస్యముగా చర్చించిరట! కర్తవ్యమును గూర్చి ఏదో తీర్మానమునకు మహాప్రధాని ప్రముఖులు వచ్చియుండుట అసంభవముకాదు. తరువాత మూడు దినములకే కేరళ దేశమున కమ్యూనిస్టు మంత్రివర్గము పదభ్రష్టమగుట! ఆ దేశమున జరుగుచున్న అరాజక చర్యలు, అనైతిక ప్రవర్తనము, రక్తపాతకములు మున్నగు ఘోరదుర్ఘటనములను సహించక భూదేవి తల్లడిల్లి తన మనోవ్యథను భూకంపరూపమువలన వెల్లడించెనేమో? అచేతన గోళమగు భూమికి ఇట్టి ధర్మముల నారోపించుట కవులకో, పౌరాణికులకో, చెల్లును కాని శాస్త్రీయదృక్పథమునకు చెల్లదను విమర్శ రావచ్చును. సరే. మంత్రివర్గపాలనముతో, దాని అకాలపతనముతో, భూకంపమునకేమి సంబంధమో మన మూహించలేము. మనకు అర్థముకాని ప్రకృతి రహస్యములలో ఇదియొక్కటి. పోనిండు. ఆ భూకంప క్షణమున కేరళ రాజధానిలో దశమ కేంద్రము మిథున రాశి 14°-30' లో నుండినది. మంత్రివర్గ జాతకమున అష్టమాధిపతియగు శని నికరముగా చతుర్థకేంద్రములో నుండెనట. దేశమునకు పట్టియున్న శనిపీడవదలిన ఫలమని సూచన కాదా ఇది? మంత్రివర్గ జాతకమున

దేశారిష్టమును సూచించుచున్నది కుజునుల సముసప్తకవేధ. భూకంపకాలమున ఆ గ్రహస్థానములందే కేరళీయుల దశమ చతుర్థకేంద్రములు వచ్చుట కాకతాళీయ మగునా? ముఖ్యమంత్రిగారి చలితరాహుస్థానమందే ఆ దశమ కేంద్రము నిలుచుట అర్థరహితమనవచ్చునా? ఏమో మరి? మరియొక్క విశేషము. వర్షారంభకాలమునకు, అనగా, సాయన మేషసంక్రమణ కాలమునకు గ్రహస్థితిని సాధించినచో, ఆయా రాజధానీ నగరములకు వచ్చు భావస్థితినిబట్టి ఆ దేశములకు శుభాశుభ ఫలములు నడచుననే సంప్రదాయమున్నది. ప్రతి చర రాశి సంక్రమణమునకు సహా ఇష్ట చక్రముల సిద్ధపరచి ఫలముల నూహించెదరు. కాని, వానిలో ప్రధానమయినది మేష సంక్రమణ మనుట నిర్వివాదము.

1959 వ సంవత్సరమున మార్చినెల 21 వ తేదీనాడు 8-55 Am (IST) కాలమున సాయన మేషములో రవి ప్రవేశించెను. కేరళ రాజధానిలో అప్పటి గ్రహస్థితి ఇది—

| | | | |
|---|---|---|---|
| | ర 0-0-0<br>శు 7-23 | X 0-55 | |
| | (సాయనము)<br>—<br>మేష సంక్రమణము<br>(1959)<br>— | | I 29-46 |
| శ 2 0 | | | చ 14-12<br>వ 15 30<br>బు 19-16 |
| | ఇ 4-12<br>గు 22-8 | రా 7-23 | కు 0-34<br>య 2-17<br>కే 9-12 |

కర్కాటక రాశి గండసంధిలో లగ్నమున్నది. జలరాశినుండి అగ్నిరాశికి దూకనున్న దేశము లగ్నము రాష్ట్రములో నున్న విప్లవమును, అశాంతిని, సూచించజాలును. పరిపాలకునకు సహా గండమే ఇది. లగ్నాధిపతి చంద్రుడు వరుణ సంయోగమునే అభిలషించుచు అరాజక పరిస్థితులు రానున్నవని తెలుపుచున్నాడు. ప్రబలుడగు గ్రహరాజు భాగ్య (ధర్మ) స్థానములో కూర్చుండి ఆ చంద్రవరుణ సంయోగముపై సార్థ కేంద్ర క్రూరదృష్టిని బరపుచుండుట గమనింపదగినది. కేరళ మందలి విషమపరిస్థితిని కేంద్రప్రభుత్వపు రాజనీతి సవరించవలసి యున్నది ఇది.

ఈ సంక్రమణ కాలమునకు దేహాలీనగరమునందు లగ్నము సింహరాశిలో 7°-12′ లో నుండినది. లగ్నాధిపత్యము రవికి వచ్చుట. ఏనాడు చారవశమున రవి ఆ సింహరాశి 7°-12′ కు వచ్చెనో, ఆనాడే (31-7-1959) రాష్ట్రపతి ఆజ్ఞాపత్రమును వసలించుట! కాలపురుషుని మహిమ!

శ్రీ సంజీవ్యాగ్రిపాదు జాతకములో రవివేధకల చలితబుధస్థానము సింహరాశిలో 7°-17′. మేష సంక్రమణకాలమున దేహాలీనగరమునందు లగ్నము సింహములో 7°-12′. మంత్రివర్గపతనమునాడు రవియుండుచోటే ఆ సింహరాశిలో 7°-33′ లో. మంత్రివర్గజాతకమునకు ఆనాటి దైనిక దశమకేంద్రము అదే సింహరాశి 7°-30′ లో నుండుట! రాజేంద్రబాబు చలితచంద్రుడుండుట కుంభరాశిలో 7°-22′. ఏమి ఈ కాలపురుషుని గణిత చమత్కారము?

ఇంతేకాదు. దేహాలీనగర లగ్నమునకు పుణ్యసహమము ధనుస్సులో 21°-24′ లో నున్నది. కేరళ లగ్నాధిపతి చంద్రుడుండిన భచక్రభాగ ఏనాడు ఈ పుణ్యసహమమును చేరుకొనునో, ఆ దినముందే ఆ దేశపు పుణ్యము పండి కేంద్ర పాలనమువలన శాంతి చేకూరును.

| | | |
|---|---|---|
| ఆ పుణ్యసహమపు నాక్షత్రకాలము | ... | 11 38 |
| చంద్రస్థానపు నాక్షత్రకాలము | ... | 2-56 |
| వ్యత్యాసము | | 8 42 |
| మేషసంక్రాంతినాటి నాక్షత్ర కాలభుక్తి | | 23-52 |
| చేర్చగా మొత్తము | ... | 8-34 |

నికరముగా 31-7-1959 నాటి నాక్షత్రకాలభుక్తి 8-34! చిత్రముకాదా! ఇంత చాలును. బమ్మెర పోతనామాత్యుని భాగవతమునందలి ఈ క్రింది పద్యరత్నమును స్మరించుచు విరమింతము గాక!

"కారె రాజులు? రాజ్యముల్ కలుగవే?
గర్వోన్నతిం బొందరే?
వా రేరీ? సిరి మూటగట్టుకొని పో
వం జాలిరే? భూమిపైఁ
పేరైనం గలదే? శిబి ప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
ఈరే కోర్కులు? వారలన్ మరచిరే
ఇక్కాలమున్ భార్గవా?"

# గమ్యస్థానం

శ్రీ ఆర్. ఎం. చిదంబరం

నిశ్శబ్దంగా ఆవులిస్తున్న ప్రకృతి—అనురాగంలో చలిపల్చి చల్లగా ముద్దుపెట్టుకుంటున్న పిల్లగాలుల చేష్టలకు కోపంతో మండలిస్తూ కొద్దిగా కదులుతున్నవి తాటిచెట్లు... నల్లని పుంతనుండి ఎదుర్కొంటున్న మేఘాలధాటికి ఆగలేక సూర్యుడు మధ్య మధ్య తెరను చీల్చి బయటకు తొంగిచూస్తూ, అంతలోనే అదృశ్యమవుతూ దోబూచులాడుతున్నాడు. విశాఖపట్నంనుంచి రావలసిన పార్సిలు పాసెంజరు రెండు గంటలు లేటని ఎవరో అనేదాకా నాకు తెలియలేదంటే, ఆ గంభీరప్రకృతిలో వున్న ఆకర్షణే అయుండాలి. ఉదయం ఎనిమిదింటలకే రెండెళ్ల సంచితో స్టేషను చేరుకున్నాను. కాని రైలు పదకొండున్నర దాకా రాదు.

ప్రతిక్షణం ఓ యుగంలా వుంది. గడియారంవంక చూస్తే అది ఆరుగంటలకే కాళ్ళు బారచాపి సుషుప్తిలో మునిగిపోయింది. 'కీ' ఇవ్వటం మరచి వుంటాను. 'జీవితంలో ప్రతివస్తువూ ఇంతేనా?' అనిపించింది. అవసరానికి ఏదీ అందుకోదు. ఆ వుదయం ఉత్తరం పోస్టుచేద్దామని వెళ్ళేసరికి ఒక్క నిమిషం క్రితమే టపా తీసినట్లు తెలిసింది. అంతే—ప్రతి అవకాశం ఒక్కక్షణంలో తప్పిపోతుంది. 'అయ్యో! అడుగులు త్వరగా వేస్తే ఎంత బాగుండేది!' అనిపించింది. వివేకమనేది పొరపాటు చేశాక కాని కలుగదన్నాడు ఆస్కార్ వైల్డ్—నిజమే ననిపించింది. రైలుపట్టాలు పొడవుగా కదలిపోతున్నాయి. విభిన్న ఆదర్శాలకు మల్లే ఎక్కడా కలుసుకోకుండా, ఏదో రహస్యాన్ని చెవిలో వూదుతున్నట్లు భ్రమపెట్టాయి. రెండు సమాంతరరేఖలు అనంతంలో కలుసుకుంటాయని గణితశాస్త్రం చెబుతుంది. "అనంతమనేది ఎక్కడుంది? అదేదో కనిపించనంతవరకూ ఈ సిద్ధాంతాన్ని ఎందుకు నమ్మాలి?" అనెవరూ అడుగలేదని ఓ క్షణం వాపోయినమాట వాస్తవం.

ప్లాటుఫారంమీద ఆ చివరనుంచి ఈ చివరకు పచార్లుచేయ నారంభించాను. ఇద్దరు ముగ్గురు ప్రయాణీకులు తప్పించి మరెవరూ లేరు. అందులో ఒకతను నిశ్చింతగా వదులుతున్న చుట్టపొగ, మేఘాలలో ఆడుకోటానికి పయనమవుతోంది. ఇంతకూ ప్రకాశం వస్తాడో రాడో! 'అటు సూర్యుడు ఇటు పొడిచినా నేను రావటం తథ్యం' అన్నాడు వుత్తరంలో. అతను రాకపోతే సూర్యుడు పశ్చిమంలో వుదయించాడనుకోవాలి. ఏమిటో! ఇలా అర్థంతీస్తే సామెతలు తెల్లమొహం వేస్తాయి. కాని, ప్రకాశం ఇలా ఎన్నిసార్లు రాయలేదు! మాట నిలబెట్టుకోవాలన్న పట్టింపు అతనికి ఏకోశానా లేదు. సామానంతా సర్దుకుని ప్రకాశం దూరప్రయాణానికి సిద్ధమై టాక్సీలో అడుగుపెట్టబోతున్నాడనుకోండి. ఎవరైనా మిత్రులువచ్చి 'ప్రకాశం! అలెక్ గినెస్ చిత్రం వచ్చింది. పద!' అంటే చాలు—ప్రయాణం సంగతి గత యుగంలోకి విసిరేసి సినిమాకు వెళ్ళిపోతాడు. నిలకడలేని అలాంటి మనిషిని నమ్మటమెలా?

బి. ఏ. చదివేటప్పుడు మా మిత్రబృందంలో ముగ్గురు ప్రధానవ్యక్తులుండేవారు. మొదటివాడు ప్రకాశం—మాలో మాకు లక్షన్నర అభిప్రాయభేదాలు. ఒకరి అభిరుచులు మరొకరికి నచ్చవు. కాని కలిసిమెలిసి వుండేవాళ్ళం—జాగ్రత్తగా ఆలోచిస్తే ఈ విభిన్నాభిరుచులున్నవారే అన్యోన్యంగా, ఒకరినొకరు అర్థం చేసుకుని స్నేహంగా వుండగలరనుకుంటాను. ఒకే రకం మనస్తత్వాలున్న వ్యక్తులు ప్రతిదానికి అంగీకారంగా తలవూపేస్తారు. వాదనలకు—చర్చలకు తావుండదు. ఒకరి అభిప్రాయాన్ని మరొకరు ఎప్పుడు ఖండించి పోరాడదామా అన్న తహతహ వుండదు. కేవలం వుప్పులేని కూరలా వుంటుంది. మా మైత్రి జీవితాంతంవరకూ రాయిలా నిలిచిపోతుందని అప్పట్లో వెర్రి కలలు కంటూ, స్నేహితాన్ని మరింత దృఢతరం చేసుకోటానికి ప్రయత్నించినా, కాలక్రమంలో తలోమూలకు విసిరివేయబడ్డాం. ముళ్ళపొదల్లా ఎదురొచ్చే సమస్యల్ని తప్పించుకు తిరిగే నేర్పరితనం వుంటేనే జీవితంలో కొన్నిసార్లైనా తృప్తిగా నవ్వుకోవచ్చు. జీవితం సృష్టించే తుఫాను

లకు ధైర్యంగా నిలబడేందుకు చేసే ప్రయత్నంలో, ఒకరి కొకరు వుత్తరాలు గాసుకుంటంకూడా మానుకున్నాం.

ప్రకాశం తల్లిదండ్రులు విశాఖపట్నంలో వున్నారు. కాలేజీలో పని వేళప్పుడు చీకూ—చింతా లేకుండా కాలక్షేపం చేసేవాడు. హంసల్లా కదలిపోయే అమ్మాయిల అడుగుజాడలు (తారురోడ్డు కనక) వెదకటం అతని హాబీలలో ఒకటి. పరిస్థితులు శ్రీకృష్ణుడి చక్రాయుధంలాంటివి. మన కనుగుణంగా మార్చుకోవాలికాని చూసి జడుసుకోకూడదు. అదెలాగోమాత్రం చెప్పేవాడు కాడు. ప్రకాశం అందంగా వుంటాడు. "ఎలా?" అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పటం కష్టమేమో! ఏ అమ్మాయైనా అతని సౌందర్యాన్ని వర్ణించవలసి వుంటుంది. ప్రకాశం తృప్తిగా నవ్వినప్పుడు అతనిముఖం మెర్క్యురీలైటు హఠాత్తుగా వెలిగినట్టు తళుక్కుమనటం నాకళ్ళకీనాటికీ కనిపిస్తోంది. సముద్రపులోతుల్ని దాచుకుని గంభీరంగా నవ్వేకళ్ళు—నాల్గురకాల శోకాలు కలిస్తే 'హాస్యం' వుద్భవిస్తుందని హ్యూమ్స్ ప్రతిపాదించినట్టు, నాల్గురకాల వికారలు కలిస్తే సౌందర్యం పుట్టుతుందిగాబోలు! నుదుటి మీద జారిపడే జుత్తును అతనెన్నడూ వెనక్కి దువ్వకోడు. ఆపని 'ఎదురుగాలి' చేస్తుందంటాడు—'హైరోడ్ క్రాపింగు' వున్నవారికి దువ్వకునే బాధ లేదు గాబోలు!

అలాంటి చక్కదనంతో ఎందరో అమ్మాయిల్ని ఆకర్షించి ఏడిపించుకుతిన్నాడు. అతని నైతిక జీవితంలో నల్లమచ్చలు చాలా వున్నాయని అందరూ విమర్శిస్తారుకాని నేనుమాత్రం నమ్మను—ఎవరూ రుజువు చెయ్యలేదు కనక. అతని అభిప్రాయాలు, ప్రవర్తన అన్నీ తర్కబద్ధమైన సిద్ధాంతాలమీద ఆధారపడి క్రమంగా వేళ్లు పాతుకుపోయాయి. వాటినెవరూ కదల్చలేరు—అభిప్రాయాలు ఏనాడూ స్థిరమైనవి కావు. కనక, రుజువు దొరకగానే మార్చుకుంటాను.

గంటకొట్టారు. కాళ్ళ నొప్పిపుట్టటంవలన పిచ్చివాడిలా అటూయిటూ చాలాసార్లు తిరిగివుంటానని గ్రహించాను. ఆశ్చర్యపోతూ స్టేషనుమాస్టరుగది దగ్గరకు వచ్చేసరికి తొమ్మిదీ ఇరవై అయింది. అనుకున్న ప్రకారం బండి రెండుగంటలు లేటుకాదని, ముందుగానే వస్తోందని తెలుసుకునేలోగా బరువుగా నిట్టూరుస్తూ బండి వచ్చేసింది. ఇంజను దగ్గర్నుంచి జాగ్రత్తగా వెతుక్కుంటూ వెళ్ళాను. ప్రకాశం సెకండు క్లాసు కంపార్టుమెంటునుంచి దిగుతూ నాకేసి జేబురుమాలు వూపాడు. ఇద్దరం కలిసి సామాను దింపాం.

"థాంక్స్!...అసలు నావుత్తరం నీటిమూటగా జమకట్టి, గాలిమూటగా విసిరేసి, ఇసికమూటలా ఇంటి దగ్గరే వుండిపోయా వనుకున్నా." నవ్వొకటి తప్పింది కాదు.

బలిసినఎడ్లు వుత్సాహంతో పరుగులు తీస్తున్నాయి. బండి గతుకుల్లోపడ్డప్పుడుమాత్రం తల టప్పీమని పైదుగుకర్రకు కొట్టుకుంటోంది. బండివాడు ఏదో పాట మొదలుపెట్టాడు. దూరంగా గొర్రెకాపరులు పాడుతూన్న జానపదగీతాలు గాలిలో తేలుతూవచ్చి చెవులదగ్గర గిలిగింతలు పెట్టాయి. ఆ వాతావరణంలో ఏదో మహత్తరానందం అనుభవిస్తూ కళ్ళు మూసుకున్నా.

"అబ్బబ్బ!...మీవూరు ఇంత నాగరికంగా వుంటుందని ముందుగా తెలిస్తే అసలు రాకపోదును. ఇల్లు చేరుకునేసరికి నాపని సగం పూర్తయ్యేట్టుంది" అని విసుక్కున్నాడు ప్రకాశం. అంతేమరి హాయిగా పట్టుపాన్పుమీద పడుకున్నట్టు బస్సులో, ట్రాములో ప్రయాణం చేసిన వ్యక్తికి బాధగానే వుంటుంది.

"రవణా! నన్ను క్షమించాలి. నేను విశాఖపట్నం నుంచి నిన్ను చూద్దామనే రాలేదు. కొంత స్వార్థం కూడా వుంది. మీవూరికి దగ్గరలో "దమ్మిడీపాలెం" అని మరో వూరుంది కదూ! అక్కడ మా మావయ్య వున్నాడు. అతనేదో పెళ్ళిసంబంధం చూసివుంచాడట. ఆ మొక్కుబడి చెల్లించుకురమ్మని అమ్మ, నాన్న పీక్కుతింటే పోరుపడలేక పనిలోపనని బయలుదేరాను. నా మంచిచెడ్డలు, అవసరాలు నాకు తెలుసు. ఈ మనుష్యులతో ఇదే పేచీ. వీళ్ళేమో పెళ్ళిళ్ళు చేసుకుని పిల్లల్ని కని ఏంచేయడానికీ తోచక ఆకాశంకేసి చూస్తూ గుడ్లు తేలేస్తున్నారు. అంతటితో తృప్తిపడరు—ఇతరులుమాత్రం ఎందుకు సుఖంగా వుండాలని నిద్రాహారాలులేకుండా, ఆ వలలో పడేవరకూ, వేపుకు తింటారు."

"అయితే బాబయ్యా! బండి దమ్మిడీపాలేనికి మళ్ళించమంటారా? అడ్డదోవంట సులువుగా ఎల్లొచ్చు" అన్నాడు బండివాడు.

ప్రకాశం కళ్ళు ఓమాటు నవ్వి, వెంటనే కోపగించుకున్నాయి.

# గమ్యస్థానం

"రవణా! వట్టి బ్రూట్స్! అచ్చ తెలుగులో చెప్పినా అర్థం చేసుకోలేరు" బండివాడు సమాధానం కోసం ఎదురు చూడకుండా తిరిగి తన పాటలో మునిగి పోయాడు. ఊరు చేరుకోటానికి ఇంకా గంట ప్రయాణం చెయ్యాలి. ప్రకాశం 'మౌత్ ఆర్గన్' తీసి సరికొత్త హిందీ సినిమా పాటను పలికించసాగాడు. బండివాడు తనపాట ఆపుకున్నాడు. పాతకూ కొత్తకూ పోరాటం కావచ్చు—గెలిచేది ఏదో కాలక్రమంలో కాని తెలియదు. దూరంగా దమ్మిడీ కాలవ నిండిపారు తోంది. నురుగలు వేస్తూ ఎర్రటినీరు ఏమహత్తర కార్యాచరణకోసం పరుగులుతీస్తోందో మరి! గట్లమీది మొక్కలు దాని ఉద్వేగం చూసి గజగజ వణుకుతూ ఒక దాని చెవిలో మరొకటి ఏదో రహస్యంగా చెప్పుకుంటున్నాయి. ప్రకృతి పలికే రహస్యం మానవులకు అర్థంకాదుకనక ఆలోచనలు ఆగిపోయాయి.

"బాబయ్యా! నీరు లేకపోతే బండి కాలవ దాటేస్తది. ఇప్పుడు లాభంలేదు. ఎడంసేతివేపు మళ్ళించి చుట్టుదోవంట తోలతాను." అంటూ జాగ్రత్తగా మళ్ళించబోయాడు. ఒకచక్రం సగంవరకూ బురదలో దిగబడిపోయింది. ఆ బురదను తప్పించాలన్న అతని ప్రయత్నం విఫలమైంది.

ముగ్గురం దిగాం—చక్రాన్ని బయటకు తీయటానికి శాయశక్తులా ప్రయత్నించాం కాని ప్రయోజనం లేకపోయింది. కాలవమాత్రం మమ్మల్ని చూసి పెద్దగా నవ్వింది. ప్రకృతిశక్తులతో పోరాడి ఎవరూ గెలవలేరని దాని సారాంశం కావచ్చు.

"వట్టి జర్మన్‌ఫారెస్ట్!...ఇలాంటి ప్రదేశంలో నువ్వెల్లా వుండగలుగుతున్నావో నాకు తెలియదు. ఇదే టౌన్‌అయితే మరో టాక్సీలో పోవచ్చు. ఇంకా చూస్తావేం? సామానులు నెత్తిమీద పెట్టు."

ప్రకాశం కోపంతో వణికిపోతున్నాడు. అతనికి జరిగిన స్వాగతానికి నొచ్చుకున్నాను. ఏం చేయటానికి తోచక వెనక్కి తిరిగి చూసేసరికి గట్టుమ్మట నడిచి పోతున్న ఇద్దరు కుర్రాళ్ళు కనిపించారు. గుర్తుపట్టి చప్పట్లు చరచి పిలిచాను.

ఇద్దరూ పరుగెత్తుకొచ్చి "నమస్కారం మేస్టారూ" అన్నారు నవ్వుతూ. వాళ్ళకేసి జాలిగా చూసేసరికి పరిస్థితి నర్థంచేసుకుని బండివాడితో కలిసి చక్రానికి విముక్తి కలిగించారు. భుజబలంతోపాటు బుద్ధిబలంకూడా అవసర మనుకున్నాను.

"మేస్టారూ! రేపు జామెట్రీయేనాండి తెచ్చుకో వలసింది? నిన్న మేం స్కూలుకు రాలేదు" అన్నారు. అవునని తలూపాను. బండి కదిలింది.

"ఎవర్రా వాళ్ళిద్దరూ?...నీ విద్యార్థులను కుంటా—పాపం! వినయగుణసంపన్నులు—విశ్వాస పాత్రులు అని నువ్వు వర్ణించవచ్చు. నేనుమాత్రం అడవిజంతువులంటాను. పిలవగానే పరుగెత్తుకొచ్చారు. బొంబాయి కాన్వెంటులో నేనూ ఒకనాడు మేస్టరుగా వున్నా. ఎంత రిఫైన్డ్‌గా వుండేవారు! ఇలాంటి పనులకు పిలిస్తే వీపు పగలేస్తారు" ప్రకాశం కళ్ళు గర్వంతో కదిలాయి.

"ప్రకాశం! ఇంతవరకూ నీ అభిప్రాయాన్ని ఖండించకూడదని వూరుకున్నాను. నీ అభిప్రాయాలు నేను మార్చలేనని తెలుసు. ఈ ఒక్క విషయంలో మాత్రం మౌనంగా వుండలేను. మనిషికి కావలసింది ఒక్క నాగరికతే కాదు; మానవత్వంకూడా అవసరం—మానవత్వం అంటే ఏమిటని అడుగు చెప్తాను; నా వుద్దేశంలో ఎదుటివాడు కష్టపడుతుంటే, అర్థంచేసుకుని నీకు చేతనైనట్లు సాయంచేయి. అప్పుడు నీక్కలిగే తృప్తి, ఆత్మనికోసం ప్రపంచానికి సర్వాధికారివైనా కలగదు. అలా ప్రతివాడు చేయగలిగితే క్షామం—అహంకారం—కుళ్ళు—కుట్ర—ఇవేవీ ఉండవు. మానవులు ఒకరినొకరు ప్రేమించుకుంటారు. అర్థం లేని ఈ 'డిగ్నిటీ' నాకక్కర్లేదు. ఆ విద్యార్థులు చూటానికి నాజూగ్గా లేకపోవచ్చు. కాని ప్రతిఫలం ఆశించకుండా సాయం చేయలేదూ?" అన్నాను వుద్రేకంతో.

హృదయంనుండి వెలువడే సత్యాన్ని ఎవరూ ఎదిరించలేరు. ప్రకాశం నా మనస్థితిని అర్థంచేసుకుని వూరుకున్నాడు. పావుగంటవరకూ ఎవరూ మాట్లాడ లేదు.

"బాబయ్యా!...ఆ ముందర నడుస్తున్న అమ్మాయిని చూడండి—పాపం!...కాళ్ళకు ముల్లు, రాళ్ళు గుచ్చుకుంటున్నాయి గామోలు! అలవాటులేదు గామోలు! పట్నపోసపోళ్ళు" అంటూ సగం వెక్కిరింతగా, సగం జాలిగా బండివాడనేసరికి ఇద్దరం అటు చూశాం. అతను చెప్పింది నిజమే! చేతిలో ఎర్రటి శాండల్సు వున్నాయి—కావిడి మనిషి ముందు సామానుతీసికెళ్ళు తున్నాడు. గలగల మువ్వలచప్పుడు విని ఆమెకూడా వెనక్కి తిరిగి చూసింది.

"రవణా చంపావ్!...అది విజయభారతి! ఇక్కడి కెందుకొచ్చింది చెప్పు...నాతో అక్షరం ముక్కయినా చెప్పలేదేం?"

ఆశ్చర్యంలో మునిగిపోయాను — మా మిత్ర బృందంలో రెండో వ్యక్తి భారతి. బండి ఆగేలోగా ప్రకాశం క్రిందకు దూకి "భారతీ!" అంటూ ఆమెను ఆపివేశాడు.

"సహించి బాధపడింది చాలు—సాహసం చేయక బండెక్కు—మన రవణకూడా లోపలున్నాడు."

భారతి నమస్కరించి బండిలో కూర్చుంది. ఆమె సామానంతా ముందుకు సర్దాను.

"నేను చెప్పినట్టు ఉత్తరం రాశాను. బండి పంపమన్నాను. ఆ ఉత్తరం పెదనాన్నకు అందిందో లేదో మరి!" అంది భారతి.

"ఇలాంటి పల్లెటూళ్ళోవున్న మనుష్యులకు కనీసం ఒకదాని వెనక ఒకటిగా అరడజను టెలిగ్రాములివ్వాలి." అని ఎత్తిపొడిచాడు ప్రకాశం—ప్రయాణాల్లో వుండే కష్టాల్ని గురించి అతనేదో చెప్పబోయాడు. నేను మాత్రం ఆ సంభాషణకు దూరంగా వుండి భారతిని గురించి ఆలోచించసాగాను.

ఆమెకు 'షేక్స్పియర్' సాహిత్యమంటే తగని పిచ్చి. అతని నాటకాలు, వ్యాఖ్యానాలు, విమర్శలు కలుపుకుని ఆమె షెల్ఫులో కనీసం వంద పుస్తకాలైనా వుంటాయి. ఎరుపు రంగంటే భారతి కిష్టమున్న సంగతి జ్ఞప్తికొచ్చి ఆమెవంక చూశాను. పొడుగ్గా వున్న జడచివర ఎర్రరిబ్బను కట్టి వదిలేసింది. లేత గులాబీ రంగు చీర. ఎర్రటి పువ్వుల క్రేప్ జాకెట్టు— ఎర్రరాళ్ళ వుంగరం — కళ్ళజోడు ఫ్రేంమీద కూడా ఆ చివరనుండి, ఈ చివరదాకా ఎర్రగీత పొడుగ్గా సాగిపోయింది. అంతా అరుణమయం. ప్రకాశం, భారతి ఎంతో సన్నిహితంగా వుండటానికి వాళ్ళ అభిరుచులు వేరుకావటమేనని నేను వాదిస్తూ వచ్చినా ఎవరూ నమ్మేవారుకారు. 'అతను చిటికెన వేలుమీద ఆడించిన అమ్మాయిల్లో ఆమెకూడా ఒకతె' అన్నారు మిత్రులు.

"ఏమండోయ్! మీ యింటికి రావటం లేదని కోపమా? మీ రిక్కడుంటున్నట్టు ప్రకాశం నాతో ఎప్పుడూ చెప్పలేదు." రెండు చుక్కల తేనె చిలికినట్టు నవ్వింది. కళ్ళజోడు తీసి తుడుస్తుంటే ముఖం అమాయకంగా కనపడింది. ఒక్క కళ్ళజోడు మనిషి రూపాన్ని ఎలా మార్చగలుగుతుందో మాత్రం నాకర్థం కాలేదు. భారతి మళ్ళా కళ్ళజోడు పెట్టుకునేసరికి నిజానికీ, అబద్ధానికీ మధ్యవున్న వ్యత్యాసం బోధపడింది. భారతి తండ్రి గవర్నమెంటు ఆఫీసరు—ప్రస్తుతం అందరూ బొంబాయిలో వున్నారు. ఆమె లిటరేచర్ ఎం. ఏ. చదువుతోంది. ప్రకాశం పనిచేసే కార్యాలయం యూనివర్సిటీకి దగ్గరగా వుండి కనక ఇద్దరూ అప్పుడప్పుడు కలుసుకుంటూ వుండేవారట—

"అదేం కాదు భారతీ! ఏవో పాతజ్ఞాపకాలు వచ్చి" అని ఆపేశాను.

"వెల్ కమ్ గర్ల్" అన్నాడు ప్రకాశం.

పదకొండుగంటలకు ఇల్లు చేరుకున్నాం.

అమ్మా, చెల్లాయి నాకోసం ఎదురు చూస్తూ అరుగు మీదే కూర్చునివున్నారు. నాతోపాటు భారతి కూడా బండి దిగేసరికి కొంచెం ఆశ్చర్యపడక తప్పింది కాదు.

* * *

ప్రకాశం స్నానంచేసి, గ్లాస్కో పంచె గోచీ పోసి కట్టుకుని, పల్చటి లాల్చీతో తయారయ్యాడు. అతని అందచందాలు కొట్టొచ్చినట్లు కనిపించాయి. భారతికూడా స్నానంచేసి చివరిసారిగా మరికొంచెం 'గార్డ్ లీ' పౌడరు ముఖానికి అద్దుకుంది. ఇల్లంతా చూపించాను. చాలాచోట్ల మార్పులు చేయాలని భారతి హెచ్చరించింది. ఆ ఇల్లు పీకివారేసి రేడియో స్టేషన్లో ఓ బంగాళా కట్టాలన్నాడు ప్రకాశం. హాల్లో నాలుగు కుర్చీలు, టేబిలు వేశాను. ఎప్పుడో కొన్న టేబిలు క్లాతు పెట్టె అడుగునుండి తీశాను.

చెల్లాయి ఉప్మా, కాఫీ తీసుకొచ్చింది. కాఫీ గ్లాసులో పోస్తుంటే చెయ్యి వణికింది గామోలు! అంతా నేలపాలైంది. చెల్లాయి జాలిగా చూసింది.

"బాగానే వుందమ్మాయ్! నీ మొగుడిమీదకూడా ఇలా కాఫీ ఒలకబోశావంటే ఆ దవడ, ఈ దవడ వాయించేస్తాడు," అంది భారతి మందలింపుగా. ఆమె అమాయకత్వానికి నవ్వుకున్నాను. భారతికి జీవితానుభవం లేదు. భర్తల మనస్తత్వం గురించి ఆమె చేసే వూహాగానాలు సత్యానికి ఎంతో దూరంలో వుంటాయి. ఇంతటి చిన్న పొరపాటుకు ఏ మగవాడూ చెయ్యి చేసుకోడు. ఆమె దృష్టిలో భర్తలు రాక్షసులు-పెళ్ళాం చేసే ప్రతిపనినీ జాగ్రత్తగా పరిశీలించి, విమ

ర్శించి, శిక్షణ నే సి. ఐ. డి. లు. చెల్లాయి సిగ్గు పడుతూ ఆమె కొంగు రుగా కూర్చుంది.

"అయితే రవణా! నీ భావిజీవితం మాటేవిటి?" అనడిగాడు ప్రకాశం ఎటో చూస్తూ—ముఖంలోకి చూస్తూ అత నెప్పుడూ మాట్లాడడు.

"అది ఆయన జాతకంలో రాసి వుంటుంది లేక పోతే నుదుటిమీద వుంటుంది. అంతే కాని ముందెలా తెలుస్తుంది?" అని భారతి అడ్డుపడింది.

"అదేం ప్రశ్న? నా జీవితం ఏనాడో స్థిరపడి పోయింది," అన్నాను. ప్రకాశం పెద్దగా నవ్వాడు—అందులో వున్న వెక్కిరింత ఆ శబ్దంలో ప్రతి అణు వులోనూ ప్రతిధ్వనించింది.

"అంతే నంటావా? ప్రపంచానికి, నాగరికతకు దూరంగా, ఒకమూల కుగ్రామంలో ఒకేపంతులుగా నిరపకారమే నన్న మాట నీజీవితలక్ష్యం! ఛీ!... ఉన్నత స్థితికి రావాలన్న ఆకాంక్ష లేదూ నీకు? చేతిలో నయా పైస వుంచుకుని దానితో కలకాలం తృప్తిగా బతకవచ్చనుకోటం తెలివితక్కువ కాదూ? ... నీది చచ్చు ఫిలాసఫీ! ఏమంటావ్ భారతీ?" అన్నాడు గోడమీద బల్లి కేసి చూస్తూ—

"నా సంగతి అలావుంచు—ముందు నువ్వే ఘన కార్యం చేయదల్చుకున్నావో చెప్పు—వినాలని కుతూహలంగా వుంది!" అన్నాను.

ప్రకాశం మిగిలిన కాఫీని ఒక్క గుటకలో మింగేసి పెద్ద చప్పుడు చేస్తూ గ్లాసు టేబిలుమీదుంచి మొదలుపెట్టాడు.

"అలా అడుగు. చెప్తాను...ఏదీ సాధించ కుండా బతకటం నీచమానవుడి లక్షణం. నేను చెప్పే మాటలు నీకు రుచించకపోవచ్చు. ఆ భావన నువ్వు బహిర్గతం చేయకపోయినా, నేను అర్థం చేసుకోగలను. నాటికి అలవాటైపోయింది అతిపిచ్చెవ్వళ్ల సామాన్యజీవితం. నిత్యావసరాలు గడిచిపోటానికి ఏదో ఇంత రాబడి. మరీసుందరి కాని భార్య. అపురూప సుందరైతే ఎవ రైనా ఎత్తుకుపోవచ్చు...రక్షించుకునే సమర్థత లేదు కనక—సంసారపక్షానికి చెందిన స్త్రీ. సంఘంలో గౌరవం. అంటే, తింటూ, తిరుగుతూ పిల్లల్ని కని పారేసి ముసిలితనంలో వాళ్ళనూ, వీళ్ళనూ యాచిస్తూ కాలం గడిపి కన్నుమూయటం. ఆ తరువాతి నలు గురూ 'అహా! ఆయన కేముంది! నలుగురు కొడుకులు! ఏకాదశినాడు పోయాడు. సరాసరి స్వర్గం చేరు కుంటాడు. అని మె కర్థం. మనం బతికి వుంటు కోవాలి. ... మాత్రం అడుగకు. ... తరమైన వాంఛలాం భూతభవిష్యత్తులు— వుంది. ప్రపంచాన్ని స్తాను. ఏదో వొకర

వేదాం—ఈ అవకా శాచ్ఛరించింది. అంతు

మెరిసిపోతాను, అదే సంతోషక, ఆశయం - అప్పటి వరకూ నేను జీవించి వుంటాను!"

ఆశయాలకూ, ఆచరణకూ మధ్యవున్న వ్యత్యా సాన్ని గురించి ఆలోచిస్తూ భారతివంక చూశాను.

"ప్రకాశం చెప్పింది అక్షరాలానిజం—అంద రికి మల్లే వుండదల్చుకుంటే, నాన్నగారి మెప్పుకోస మైనా పెళ్ళిచేసుకుని నే నన్ని—అసలు నాకు వివా హంలో నమ్మకంలేదు. వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛను అమ్ముకోటం—అందుకే, ముందుగానే పథకం వేసు కున్నా. ఎం. ఏ. పూర్తికాగానే ఏ కాలేజీలోనైనా లెక్చరరుగా చేరి సాహిత్యరంగంలో కృషిచేసి..."

"నోబెల్ బహుమానం అందుకుంటావు, షేక్స పియర్ రచనలు అతని స్వంతం కావని సోదాహరణంగా రుజువుచేస్తావు. అంతేనా?" అని నవ్వేశాను. భారతి నొచ్చుకుని ముఖం చిన్నబుచ్చుకుంది.

"కాదు. మాకు ఆత్మవిశ్వాసం వుంది. అవకాశా లూ వున్నాయి. అనుకున్నవన్నీ సాధిస్తాం" అని ప్రకాశం ఆమెను బలపరిచాడు.

"భారతీ! అవన్నీ పగటికలలని నాకు తెలుసు. మీరుకూడా మున్ముందు గ్రహిస్తారు: ఆశావాదులుగా వుండటం తప్పనను. కాని అందుకు అవకాశాలు నిర్ణయిం చటం అత్యవసరం. వాస్తవికతను ఎదుర్కొనేవరకూ నేనూ ఎన్నో అనుకున్నాను. ఐ. ఏ. ఎస్. ఆఫీ సర్ని కావటమా? కాలేజీ ప్రొఫెసరుగా రాణించ టమా? రాజకీయవేత్తగా ప్రసిద్ధిపొందటమా?... కోరికలకు అంతులేదు. కాని సాధించగలిగానా? నేను వూహిస్తూ కూర్చున్నాను కాని ప్రయత్నించ లేదని మీరు ఆరోపించవచ్చు. అది మాత్రం నేను ఒప్పుకోను—దూరంనుండి చూస్తుంటే అన్నీ తళు క్కుమని మెరుస్తూ, ఆశల్ని రేపుతూ రమ్మని పిలు స్తాయి. దగ్గరకు వెడితే అన్నీ గాజుపెంకులు—మోస పోతావు. జీవితంలో రహస్యమే ఇది. పూర్తిగా ఓడి

"రవణా సంస్యం తెలిసిరాదు...అంతేకాదు. ఇక్కడి కొందుటున చేతిలో లేదు. పైనుంచి నడిపించే ముక్కుయిటున్నావన్న సంగతి మరచిపోకు..."

"ఏవడో వైన వున్నాడు?" అని గద్దించాడు ప్రకాశం. సరిగ్గా అదే సమయానికి అమ్మ దేవుడిపటం ముందు మల్లెపూలుంచి నమస్కరించింది. ఆ పని ఉదయం చేయవలసింది. పనితొందరలో మర్చిపోయింది గామోలు! చెల్లాయిముఖంలో భయం లతలా అల్లుకుపోయింది.

"కంటికి కనుగా వచ్చి కనపడమను—నా ప్రశ్నలకు జవాబు లిమ్మను. ఇంత లాజిక్ చదువుతున్న నువ్వుకూడా దీన్ని నమ్ముతున్నావా? మంచీ, చెడ్డా—అన్నింటినీ కలిపి, పాపం. ఆ నోరులేని దేవుడి నెత్తిమీద రుద్దటం—ఏదో ఏదో చేసేయటం—'అంతా వాడి చిద్విలాసం!' అనటం—డామిట్! అలా అర్థం కాని భావలో, సగం మనసుతో దేవుణ్ణి పూజించే దానికంటె అరటిజను సిగరెట్లు ఎక్కువ కాల్చటం మేలు" అంటూ చెప్పుకోపోయాడు.

"మనం ఆరాధించవలసింది అచేతన వస్తువుల్ని కాదు. కళను ఆరాధించు. చిత్రపటాలు గీయి. పద్యాలు రాయి. సౌల్లుసహితం తలవూచేట్టు సంగీతం పాడు. హృదయాన్ని పులకరింపచేసే నృత్యం చేయి. అదే జీవితం—మోక్షం. శాంతి—సృష్టి—అన్నీ!"

నేనేం జవాబు చెప్పక భారతి వంకచూశాను. సర్వశక్తిసంపన్నుడైన భగవంతుడు ఏమీ అనలేక మూగవాడిలా వూరుకున్నాడేమనిగామోలు చెల్లాయి నోరు తెరచి ఆశ్చర్యంతో వింటోంది.

ఇదంతా వింటున్నట్టు దూరంగా, అసంతృప్తితో ఆకాశం గర్జించింది. గుండె జల్లుమంది. దమ్మిడీ కాలవ గట్లు తెంచుకుని ఏక్షణంలోనైనా ఉరకటానికి సిద్ధంగావుంది. మళ్ళీవర్షం కురిస్తే నిప్పుకు గాలితోడై నట్టవుతుంది.

"భోజనానికి లేవండి! తరువాత వాదించుకోవచ్చు." అంది అమ్మ. ప్రకాశం వుత్సాహంతో టేబిలుమీదకు వంగి ప్రశ్నించాడు.

"చూడండి పిన్నిగారూ! మీ యబ్బాయి నిలా పల్లెటూళ్ళో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోనువక నాతో పంపండి. రాజాలాంటి వుద్యోగంలో చేర్పించి అభివృద్ధిలోకి తీసుకు వస్తాను."

"ఏమోనాయనా! ఎవరి అదృష్టం ఎలావుందో. అంతా విధి లిఖితం! దిక్కూ మొక్కూ లేకుండా వందల కొలది మైళ్ళదూరంలో వాడూ—ఇక్కడ నేనూ! ఎలా జరుగుతుంది? ఏదో యిలా కలిసి మెలిసి కలో గంజో తాగుతూవుంటే చాలు. తృప్తి అనేది మన కుండాలి కాని..."

పెద్ద వుపన్యాసం యివ్వటానికి సిద్ధపడ్డవాడిలా ప్రకాశం కనుబొమ లెగరేశాడు కాని, పానకంలో పుడకలా సంగీతం మేష్టారు ప్రవేశించారు.

"మేష్టారూ!...ఈ వేళ మా యిల్లంతా స్నేహితులతో కలకల్లాడుతూంది. ఈ వేళికి పాఠం మాను కుందాం" అన్నాను.

"అయితే మేష్టారూ! అమ్మాయిని చూసుకోటానికి ఎల్లుండేకదూ వస్తానన్నారు? వర్షం నమ్మ పొద్దున్న కనిపించాడు. అబ్బాయి ఇవేళ వస్తాడట—ఏముందిలెండి. ఆ మూడుముళ్ళూపడ్డాక సంగీతానికి ఫుల్ స్టాప్ — అమ్మాయికంఠం మధురమైంది — ఆమె కీర్తన్లు రాసిపెట్టింకో నుం. అమ్మాయిని సంగీతసరస్వతిగా మార్చవచ్చు. సెలవు" అంటూ ఆయన వెళ్ళిపోయాడు.

"ఈ రాసిపెట్టటం ప్రతివాగినోటంట వినిపిస్తోంది. భూతద్దం తీసుకుని ఎక్కడైనా పరీక్షిస్తే బాగుండును" అంది భారతి.

"మీరిద్దరూ ఒకర్నొకరు 'మేష్టారూ' అని సంబోధించుకోటం వినటానికెంతో యింపుగావుంది." అని ఎత్తిపొడిచాడు ప్రకాశం.

భారతి చదువుతున్న పుస్తకాన్ని బల్లమీదుంచి "ఏదీ! ఒక్కపాటపాడు!" అంది చెల్లాయి నుద్దేశించి.

చెల్లాయి సిగ్గుపడి "అంత బాగా పాడలేనండి." అంది. ఆమె సిగ్గుపడుతుంటే చేమంతిపువ్వు అందానికి, గులాబీపువ్వు అందం తోడైందనిగామోలు ప్రకాశం ఓ క్షణం రెప్పవాల్చకుండాచూసి "పరిపూర్ణజ్ఞానం వున్నవారెవరూ తాము గొప్పవాళ్ళమని చెప్పుకోరు. అదో ఆచారం. అంచాత పాడి తీరాల్సిందే! లేకపోతే ఇంటికొచ్చిన అతిథుల్ని అవమానం చేసినట్టవుతుంది." అన్నాడు కోపం నటిస్తూ.

నేను నవ్వటం అంగీకారంగా తీసుకుని "ఏలా నీ దయరాదు?" అఠాణాలో పాడింది. ప్రకాశం, కీర్తన ముగిసేవరకూ కాల్పనిక జగత్తులో రెక్కలు విచ్చిన విహంగంలా ఎగురుతూ, రసోత్పత్తిక్రమంలో

# గమ్యస్థానం

అలలుగా తేలుతూ, సంగీతంలోవుంటే అణువుల్ని చీల్చి అనుభవించాడని అతని ముఖభావనల్ని బట్టి గ్రహించాను.

"మీరు చేస్తున్నది పొరపాటు. రెండుమూడేళ్ళు సాధకంచేస్తే మీ చెల్లాయి నక్షత్రంలా మెరిసిపోతుంది. ఆమెకు పెళ్ళి చేసి సంసారకూపంలో తోయకండి. నేర్చుకున్నంతమాత్రాన వచ్చేదికాదు సంగీతం. ఆ అదృష్టం కొందరికే వుంటుంది. ఎన్నోసార్లు నేర్చుకోవాలని ప్రయత్నించి ఓడిపోయాను. ఆ అనుభవం మర్చిపోలేను." అంది వుద్రేకంలో భారతి.

చెల్లాయి నాకేసి దీనంగా చూసింది. నేను మాత్రం ఏం చేయగలను? భోజనాలయ్యాక అమ్మ రహస్యంగా నన్ను వంటింట్లోకి పిలిచింది.

"చూడు! ఆ యబ్బాయి ఊరూ, పేరు, కులం, గోత్రం అన్నీ కనుక్కొని వుండు. తెలివైనవాడు—మాట్లాడానికి మహారాజులా వున్నాడు. వీలవుతే అమ్మాయికి చూద్దాం."

ఆశ్చర్యంతో చెల్లాయికేసి చూశాను. వంటింట్లో ఏదో వెదుకుతున్నట్లు నటిస్తూ ఓరకంటితో నాకేసి చూసింది. నాకర్థమైంది.

తల్లీ కూతురూ కలిసి వేసుకున్న పథకమన్నమాట—అమ్మకు ప్రకాశం పుట్టుపూర్వోత్తరాలేవీ తెలియవు. రెండుగంటల కాలంలో అతన్ని అల్లుడిగా చేసుకోవాలన్న కోర్కె వుదయించింది! అతని వాక్చాతుర్యం—అందచందాలు ఆకర్షించివుంటాయి. దేవుని వునికిమీద పరిపూర్ణ విశ్వాసంవున్న అమ్మ నాస్తికప్రచారం చేస్తున్న ప్రకాశాన్ని ఎలా మెచ్చుకుందన్న ప్రశ్నకుమాత్రం జవాబు దొరకలేదు. వయసు ముదిరినవాళ్ళకు కొన్ని విచిత్రమైన అభిప్రాయాలుంటాయి. ప్రకాశంవంటి యువకులు ప్రతిపాదించే సిద్ధాంతాలు కేవలం తాత్కాలికమైనవని అమ్మ అభిప్రాయం కావచ్చు. లేక చెల్లాయి అతని మనసు మార్చగలుగుతుందన్న దృఢనిశ్చయం కావచ్చు. ఏదేలావున్నా ఒక్కవిషయంమాత్రం నిజం—ప్రకాశం ఎంత ఆవేశంతో, కచ్చితంగా మాట్లాడినా అందులో వున్న నిజాన్ని ఎవరూ గుర్తించరు, 'వెర్రివాగుడు' క్రింద జమకట్టి వూరుకుంటారు.

"అయితే మరి ఎల్లుండి దమ్మిడీపాలెంనుండి వస్తున్నారుకదా? దానిమాట?"

"అదెలాగో ఒకలాగ తప్పించేద్దాం—ఈ అవకాశాన్నిమాత్రం వదలుకోకు." అని హెచ్చరించింది. నవ్వుకుంటూ అరుగుమీదికొచ్చాను.

ఆకాశం మబ్బుల ముసుగు కప్పుకుంది. అంతులేని నిరాశలా చీకటి ఆవరించింది. మెరుపులు—ఉరుములు—కన్నసంతానాన్ని పోగొట్టుకున్న తల్లిలా వూగిసలాడుతున్న చెట్లు—దూరంగా కాలువ చేస్తున్న భయంకరధ్వని. దాని వుత్సాహం క్షణక్షణానికీ అధికమవుతూంది. కిటికీలన్నీ మూసేశాం.

"నేను వర్షంమూలంగా ఇక్కడ ఆగినట్టు మామయ్యకు కబురంపితే బాగుండును." అన్నాడు ప్రకాశం.

"ఈ వానలో ఆ వూరెవరూ వెళ్ళరు—కట్లన్నీ జారతాయి." అన్నాను. కుండపోతగా వర్షం కురవసాగింది.

"ఎల్లుండి కూడా ఇలా వర్షం కురిస్తే అసలు పెళ్ళిచూపులకు రానేరారు." అంది అమ్మ.

"మరీ మంచిది. ఆ బెడద కాస్తా వదలుతుంది." అని వూరడించాడు ప్రకాశం. ఎవరో తలుపుతట్టారు. చెల్లాయి తలుపు తీసేసరికి పెద్దసంచీ మోసుకుంటూ ఆచారి లోపల అడుగుపెట్టాడు.

"అరెరె!...నువ్వా?...భలే! భలే! మిత్రత్రయం మళ్ళీ కలుసుకున్నాం."అని అరిచింది చప్పట్లు చరుస్తూ భారతి.

మా మిత్రబృందంలో మూడోవ్యక్తి రంగాచారి. నాటికీ, నేటికీ అతనిలో మార్పులేదు. ఆచారికి మొండిపట్టుదల ఎక్కువ—ఎందరు ఆక్షేపించినాసరే, ఆచార ప్రకారం పిలక వుంచుకున్నాడు. నుదుటిమీద కొట్టొచ్చేట్టు నామాలుండేవి. చాలామంది విద్యార్థులు అతన్ని అసహ్యించుకున్నారు. అతనిమీద నాకు మాత్రం ప్రత్యేకగౌరవం వుండేది. అడవిజంతువుల మధ్య ఏకాకిగా నిలబడ్డ అతని మనస్థైర్యాన్ని అభినందించాను. ఆధ్యాత్మిక చింతకు మనసే ప్రధానంకాదు—బాహ్యచిహ్నాలుకూడా అవసరం—ఇది ఆచారి వాదన—వర్షంలో బాగా తడిశాడు—గడ్డం అసహ్యంగా పెరిగింది. ప్రకాశానికి అలాంటి వాళ్ళను చూస్తే అరికాలిమంట.

"అర్థణా కో బ్లేడు వస్తుంటే గీకి పారేయకూడదూ?" అంటాడు. రంగాచారి ఏదోకంపెనీలో గుమాస్తాగా వున్నాడు. అత్తవారిల్లు మా వూరికి దగ్గర

లోనే వుంది. అప్పుడప్పుడు వస్తుంటాడు. మా యింట్లో అతన్ని బాగా తెలుసు.

"అమ్మో! పూర్తిగా తడిసి ముద్దయిపోయావు. బట్టలు మార్చుకో—అమ్మాయ్! కాఫీ తీసుకురావే!" అని తొందరపెట్టింది అమ్మ.

"సరణా! ఆ సంచీలో పళ్ళున్నాయి. తీసి లోపలవుంచు." అన్నాడు. అతని ఆప్యాయతను హృదయంలో ఏమూల దాచుకుంటే భద్రంగా వుంటుందో తెలిసిందికాదు. ప్రకాశం కోరికమీద ఈ ఐదారేళ్ళలో ఆచారి జీవితంలో కలిగిన మార్పులు వివరించాను.

"బాగుందిరా! నీతిమ్మరుజే! ఇద్దర్ని పోలిస్తే నువ్వే కొంతనయం! ఆచారి పూర్తిగా అపనిజంతుడైపోయాడు!" అని విమర్శించాడు. మాధ్యాహ్నికం పూర్తిచేసికాని భోజనానికి రానని ఆచారి అనేసరికి, ప్రకాశం, భారతి గొల్లుమన్నారు.

*　　　*　　　*

రాత్రి ఎనిమిది—

మదించిన ఏనుగులా బయట ప్రకృతి ఘీంకరించి ఎవరిమీదో—ఎందుకో—అకారణంగా పగ సాధిస్తోంది. చెట్లన్నీ వేళ్ళతోసహా శూన్యంలోకి ఎగిరిపోయేటు వుద్ధృతంగా వీచే గాలి. దానివేగాన్ని ఆధునిక యంత్రాలు నిర్ణయించవలసివస్తే, అవికూడా ఎగిరెగిరి కొండలు, గుట్టలూ దాటి అదృశ్యమవుతాయి. ప్రకృతి ఒక్కసారిగా విజృంభిస్తే ఎవరూ ఎదుర్కోలేరు. ఎత్తు పల్లాలను సరిచేస్తూ, అహంకుల్ని భూమిలో అణచివేస్తూ చెలరేగుతుంది. రాత్రిభోజనాలయ్యాక దేవుడిపటంముందు నిలబడి ఏ ఆపదా రాకుండా వుండాలని నమస్కరించాను.

"ఏవిటిదంతా?" అనడిగాడు ప్రకాశం.

"కాదు ప్రకాశం! ఇది పరీక్షాసమయం! ఈ వర్షాలు మంచికోసం రాలేదు. ప్రజల్ని ఏడిపించుకు తినటానికే. బతకనివ్వదు; చావనివ్వదు." అతనికి నామాటలు బోధపడలేదనుకుంటాను. పేకాడుకుందికి రమ్మన్నాడు. మనసంతా చీకటితో నిండిపోయింది. దమ్మిడీ కాలవ ద్విగుణీకృతమైన ఉత్సాహంతో ఎగిరిపడుతోంది. చీకట్లో చూడలేకపోయినా, అదిచేసే భయంకరధ్వని, అట్టడుగున దాచుకున్న రహస్యాన్ని, బట్టబయలు చేసింది. ఇంట్లోంచి వీధిలోకి, వీధిలోంచి ఇంట్లోకి కాలుకాలిన పిల్లిలా ఎన్నిసార్లు నడిచి వుంటానో తెలీదు. ప్రకాశం, భారతి సెట్లు ఆడుకుని విసుగెత్తి మానుకున్నారు. రంగాచారికి వుదుప్లా, జ్వరం వచ్చింది. నా దగ్గరున్న మాత్ర లేవో ఇచ్చాను. అమ్మ మిరియాలకషాయం కాచి ఇచ్చింది.

"అన్నయ్యా! ఎంతసేపు ఇలా తిరుగుతావు? కాళ్ళు నొప్పి పెట్టవూ?" అని చెల్లాయి బాధపడింది.

ప్రకాశం పడుకునేందుకు మేడెక్కాడు.

"ప్రకాశం! ఇది ఇక్ష్వాకులనాటి యిల్లు—ఒంటరిగా మేడమీద ఎందుకు పడుకోటం?" అని అడ్డుపడ్డాను. అతను నిర్లక్ష్యంగా నవ్వేసి వెళ్ళిపోయాడు.

రాత్రి పన్నెండుగంటలకు మెలకువ వచ్చింది.

కళ్ళు తెరచిచూశాను. అందరూ నిద్రపోతున్నారు. మనసంతా ఆందోళనతో నిండిపోయింది. లేచికూర్చున్నాను. ఎవరో తలుపుతడుతున్న చప్పుడు. మొదట భ్రమేమో ననుకున్నాను. రెండోసారి కొంచెం గట్టిగా వినిపించేసరికి వెళ్ళి తలుపు తీశాను. చీకట్లో ఏమీ కనిపించక టార్చిలైటు వేశాను.

"నేనండి! సీతారాముణ్ణి బాబుగారూ! కాలవగట్టు తెగి గూడెంలోకి వచ్చేసింది. అందరం సస్తున్నాం. తమరు ఎంటనే రావాలి." అన్నాడు గజగజ వణుకుతూ. వాడి ఒంటిమీద చిన్నతువ్వాలు తప్పించి, గుడ్డముక్కలేదు. కళ్ళు ఎర్రగా వున్నాయి. చిన్న చింకిచాప నెత్తిమీద గొడుగులా వుంచుకున్నాడు. అది తన్ని రక్షిస్తుంది గామోలు—అతన్ని చూడగానే గట్టిగా ఏడవాలనిపించింది. నా ఒక్కడివలన అయ్యేదేమీలేదు. సీతారాముణ్ణి ఇంట్లోకి రమ్మని తలుపు వేశాను. ప్రకాశాన్ని లేపుదామని మేడమీదకు వెళ్ళాను.

అతను గురకపెట్టి నిద్రపోతున్నాడు. తియ్యటి కలలు కంటున్నాడుగామోలు! గబగబ మేడమెట్లు దిగివచ్చి, గొడుగు, చేతికర్ర తీసుకున్నాను. భారతి కళ్ళు నలుపుకుంటూ లేచింది. సీతారాముడికి ఒపాత దుప్పటిచ్చాను. రంగాచారి మేల్కొన్నాడు. అమ్మ, చెల్లాయి భయం గూడుకట్టుకున్న కళ్ళతో అర్థరహితంగా చూస్తున్నారు. ప్రకాశం మేడదిగి వచ్చాడు. అందరికీ పరిస్థితి అర్థమైంది.

"ప్రకాశం! నువ్వుకూడా వస్తే ఎంతో బాగుంటుంది! బయలుదేరు." అన్నాను. అతను ఎగిరిగంతు లేస్తూ, తన ఆశయసిద్ధికి అవకాశం లభించినందుకు

సంబరంతో వస్తాననుకున్నాను. కాని ఆ నమ్మిక ఒక్క క్షణం మాత్రమే నిల్చింది.

"సారీ! రమణా! నీకైనా, నాకూ అసలు పడదు. అయినా ఈపాటికి అందరూ సురక్షితప్రదేశానికి చేరుకునే వుంటారు. మనం వెళ్ళి చేసే దేమీ వుండదు. ఆ ప్రవాహానికి ఎదురీదలేం—"

అగ్నిపర్వతం బద్దలై, ఎన్ని అగ్నికణాలు రాలుతాయో, అన్ని మాటలందామనుకున్నాను. కాని అవధులుదాటిన వుద్రేకం నన్ను మాట్లాడనివ్వలేదు. మొదటిసారిగా ప్రకాశంమీద వెగటు కలిగింది. ఎందుకో, అతను వెంటనే వెళ్ళిపోతే బాగుండు ననిపించింది.

రంగాచారి మూలుగుతూ లేచి దుప్పటికప్పుకుని "మరో గొడుగు వుందా?" అనడిగాడు.

"ఎందుకు!" అనడిగాను ఆశ్చర్యపోతూ—అతను ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పకుండా, గదంతా, పరీక్షగా చూసి గోడమూలనున్న గొడుగు తీసుకుని "పద" అన్నాడు.

"ఆచారీ! నీకేమైనా మతిపోయిందా? ఈ వానలో తడిస్తే ఏమవుతుందో తెలుసా? ఏ నిమోనియా అయినా వస్తే?"

"వస్తాను. అంతేనా? నా బాధ్యత నాకు తెలుసు. ఆలస్యం చేయకు." అన్నాడు. అతని తత్వం నాకు బాగా తెలుసు—ఏదైనా చేయదలిస్తే వట్టి ఆవేశంతో మొదలు పెడతాడు.

ముగ్గురం బయలుదేరాం.

"మాతా భారతీ! మానవజాతి క్షేమంకోసం సర్వస్వమూ ధారపోసే పుత్రులు" అన్న ప్రకాశం మాటలు చెవులదగ్గర్నుంచి దూసుకుపోయాయి.

మేం వెళ్ళేసరికి నీరు మోకాలిదాకా వచ్చేసింది. అందరూ గగ్గోలుపడుతూ హాహాకారాలు చేస్తున్నారు. చలినుండి రక్షించుకోటానికి ఎలాంటి ఆధారమూ లేదు. వాళ్ళకున్న ఆస్తిపాస్తులు—కుండలు—సీమవెండిగిన్నెలు—అన్నీ స్వాతంత్ర్యం ప్రకటించి ప్రవాహంతో కలిసిపోయాయి. ఊళ్ళో పెద్దలు కొంతమంది వచ్చారు. అందరం కలిసి ఆ జనాన్ని మెరక ప్రదేశానికి చేర్చాం—హైస్కూలు గదులన్నీ తెరచి అందులో వుండటానికి తగిన ఏర్పాట్లు చేశాం—ఈ అనుభవం కొత్తదికాదు. అయిదారేళ్ళకొక్కసారి దమ్మిడీ కాలవ ఇలాగే విజృంభించి, తనలో అంతర్గతమైవున్న శక్తిని చూపించింది. మరోగంటలో ఆ గుడిసెలన్నీ సగంవరకూ నీటిలో మునిగిపోయాయి. క్రితంసారి ఈ విపత్సంభవం జరిగినప్పుడు అందరం కలిసి, మున్ముందు ఇలాంటి ఆపదలు రాకుండా వుండేందుకు ఏదైనా చర్య తీసుకోమని ప్రభుత్వానికి అర్జీ పంపుకున్నాం. కాని బ్రహ్మాండమైన ప్రణాళికలతో సతమతమవుతూన్న ప్రభుత్వానికి ఇలాంటి అల్పవిషయాలు గమనించడానికి తీరికవుండకపోవచ్చు—సగం దారిలో ఆచారి కళ్ళుతిరిగి పడిపోతే సీతారాముడు అతన్ని భుజంమీద మోసుకొచ్చాడు.

ఇల్లు చేరుకునేసరికి మూడుగంటలైంది. ప్రకాశం నిద్రపోతున్నాడో లేదో చూద్దామని మేడమెట్లు దాకా వెళ్ళి తిరిగి వచ్చేశాను. ఆచారి ఎవరికీ నిద్రాభంగం కలగకుండా వుండేందుకు మూలుగును అణచిపెట్టటానికి యత్నించాడు.

ఎప్పుడు నిద్రపోయానో తెలియదు.

ఏదో బ్రహ్మాండమైన చప్పుడు—ఆ వెనువెంటనే దిక్కుల్ని చీలుస్తూ ఆర్తనాదం పెనుగాలిలా, నిశ్శబ్దాన్ని వణికిస్తూ వ్యాపించింది. ఉలిక్కిపడి మంచం మీదనుండి క్రిందకురికాను. వంటిమీదంతా జల్లుపడుతోంది. అందరూ మేలుకున్నారు.

"అన్నయ్యా!" అరిచింది చెల్లాయి మేడవంక వేలెట్టి చూపిస్తూ—అవును... మేడ కూలిపోయింది. అయ్యో! ప్రకాశం?...

ఓ నిముషం ఏం తోచలేదు—రంగాచారి గబగబ మెట్లెక్కాడు. ఆ గదినిండా మట్టిబెడ్డలూ, పెంకులూ, వాసాలూ—అంతా కలిసి శిథిలాల మధ్య నరకబాధ ననుభవిస్తున్న ప్రకాశాన్ని బయటకు తీసుకువచ్చాం. ఆ దృశ్యం గుండెల్ని చీల్చివేసింది. సీతారాముడు అతని పక్కనే కూర్చున్నాడు. చీకటిని, వర్షాన్ని లెక్కచేయకుండా డాక్టర్ని తీసుకువచ్చాను—గాయాలకు కట్లు కట్టాడు. ఇంజక్షనిచ్చాడు. కాని ఎంతకూ ఆగని రక్తప్రవాహం! ఆశయాలతో, ఆదర్శాలతో, అందనిపండును అందుకోవాలన్న ఆకాంక్షతో పొంగిపొరలుతూన్న ఆ యువకరక్తం దారి కనపడగానే బయటకు దుముకుతోందిగామోలు! ప్రకాశం కళ్ళు తెరచి అందరివేపూ చూశాడు.

"రమణా! మేడమీద పడుకోవద్దని ముందే చెప్పావు—విన్నాను కాను—అబ్బ!...మరణ బాధ

ఎంత ఘోరమైంది!...పాపం! వాళ్ళుకూడా ఇలాగే బాధపడివుండాలి; అటు చూడు! నేను బతికేవుండగానే ఆచారి ఏవో మంత్రాలు చదువుతున్నాడు! వెర్రిమనుష్యులు—నే నిలాగే చచ్చిపోతాను—నా కోరికలు నన్ను సమాధిచేసి కడసారి గానం చేస్తాయి."

"అలాగనకండి బాబయ్యా!...చివరి కేమీ అవదు. అంతా నయమవుతుంది." అన్నాడు సీతారాముడు... అంతేకాదు. సీతారాముడు ప్రకాశంకోసం ఏడుస్తున్నాడు!!

"రమణా! ఓ సంగతి చెప్తాను. విన్నాక ఆశ్చర్య పోతావు. మొదట్లో అనుకోలేదుకాని, ఇక్కడికొచ్చాక నిన్ను ఒప్పించి నీ చెల్లెల్ని పెళ్ళిచేసుకుందా మనుకున్నాను సుమా!..."

ఆ తరువాత అతను మాట్లాడలేదు. ఉదయం ఐదుగంటలకు వెర్రిగా నవ్వి కన్నుమూశాడు. అప్పుడుదా మనుకున్నా కన్నీరు ఆగలేదు. టెలిగ్రాం ఇద్దామంటే అతని తలిదండ్రుల ఎడ్రసు తెలియదు. భారతి పర్సులోంచి ఎడ్రసు తీసిచ్చింది. సీతారాముణ్ణి ఎలాగైనా టౌనుకు వెళ్ళి టెలిగ్రాం యిమ్మని పంపాను.

ప్రకాశం ముఖం ఇంకా ప్రపంచం వేపు ఆశగా చూస్తోంది. ఎన్నో పథకాలు వేసుకున్నాడు. అతన్నీ ఆచరణలో పెట్టే శక్తి సామర్థ్యాలున్నాయి. కాని జీవితం అతన్ని మోసగించింది. "అమ్మో! అతను గొప్పవాడైపోతాడు. నే నెలా సహించగలను?" అన్న అసూయతో, సిగ్గుతో తలెత్తుతూన్న మొక్కను మొదలంట తుంచివేసి వికటాట్టహాసం చేసిందా. ఏ ఆశయాలూ లేకుండా, కుక్కిన పేనులావున్న నాబోటివ్యక్తుల్ని అదేం చేయదు.

"వాడో వెర్రివాడు! పోనిద్దూ!" అంటుంది గామోలు! అవును మరి—మాంసాహారికి బలిసిన శరీరం కావాలికాని కుక్కశరీరం దేనికి?

ప్రకాశం మృతశరీరంతో దమ్మిడీ పాలెం చేరుకునేసరికి పదకొండుగంటలైంది. పావుగంట ప్రయాసపడి అతని యిల్లు కనుక్కునేసరికి శరీరంలో ప్రతి అణువూ గజగజ వణికిపోయింది.

ప్రకాశంమరణ్యా సంగతి తెలుసుకున్నారు.

అంతే—రోదనలు—ఆవేశాలు-శాపనార్థాలు.

భారతి తన ఇంటికి వెళుతూ "నా అభిప్రాయాలు కొన్ని మార్చుకుంటున్నా—పొరపాటుగా, అసందర్భంగా మాట్లాడాను—క్షమించండి" అంది. అదంతా విని జీర్ణించుకునే పరిస్థితిలో నేను లేను.

ఇంటికి తిరిగొచ్చి స్నానం చేశాను. అమ్మ భోజనానికి రమ్మంటే ఆకలి లేదన్నాను. రంగాచారి గోడకానుకుని కూర్చున్నాడు.

"అమ్మా!" అని పిలిచాను.

"ఏం నాయనా?" అంది దిగులుగా. చెల్లాయి కూడా అక్కడే వుంది.

"ప్రకాశం ఎవరో తెలుసా? ఎల్లుండి చెల్లాయిని చూసుకోటానికి రావలసిన పెళ్ళికొడుకు. అతని మామయ్యపేరు మనం అడగలేదు. ఇంతకూ విధి లిఖితం!"

అమ్మ జవాబు చెప్పలేదు.

గోడమీదున్న దేవుడి పటానికి నమస్కరిస్తూ "నిన్ను నమ్మి చెడినవారులేరు రామచంద్రమూర్తీ!" అంది గద్గదకంఠంతో.

చెల్లాయి నాకేసి భయంభయంగా చూసింది. ఆచారి ఓమూల దగ్గి విషాదంగా నవ్వుకున్నాడు. సీతారాముడు టౌనునుండి తిరిగివచ్చి మోకాలుమీద తల ఆన్చి కూర్చున్నాడు—అతన్ని చూసి అనుకున్నాను:

"సుహృదయుంకల ప్రతిమనిషీ దైవంతో సమానమైనవాడు."

# రాయల గయశాసనము జయశాసనమే

## శ్రీ నేలటూరు వేంకటరమణయ్య

గయ శాసనవిషయమై ఇంతకుముందు కొంత చర్చ సాగియున్నది. దీనిని శ్రీ క. వి. హెచ్. శర్మ గారు మొట్టమొదట ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 47 వ సంపుటము 2, 3 సంచికలలో (పుటలు 185-90) "ముక్కతిమ్మన గయాశాసనము" అను శీర్షిక క్రింద ప్రకటించిరి. దానికి ప్రవేశికగ వారు విరచించిన సంపాదకీయ వ్యాసములో సదరు శాసనగ్రంథమున "కృష్ణదేవమహారాయలు వేయించిన విజయశాసనము" అని స్పష్టముగ జెప్పియుండినను అది "యాత్రావిజయమే గాని విజయయాత్ర కానేరదు" అని తీర్మానించినారు. 'యాత్రావిజయ'మన నేమియో నాకింతవరకును బోధపడలేదు. శ్రీ శర్మగారు ప్రకటించిన శాసనగ్రంథమును పరికించిచూడగా ముక్కతిమ్మన సదరు శాసనగ్రంథరచయిత కాని శాసనప్రతిష్ఠాపకుడు గాడనియు, నందు ప్రకటించియుండునట్లు అది కృష్ణదేవరాయల దిగ్విజయమును వర్ణించు విజయశాసనమే యగునవియు దోచినది. ఈ నా యభిప్రాయమును దెల్పుచు గత ఫిబ్రవరి భారతిలో నొకవ్యాసము వ్రాసి ప్రకటించితిని. అందుకు జవాబుగ శ్రీ శర్మగారు "రాయల గయాశాసనము జయశాసనమా?" అను శీర్షికతో ఆగస్టు భారతిలో నొకవ్యాసమును ప్రకటించిరి. ఈ వ్యాసమునందు శ్రీ శర్మగారు అపరిచిత నూతనచరిత్రాంశములను గొన్ని పరిశోధన రంగస్థలమున ప్రవేశపెట్టి చరిత్ర పరిశోధకుల కృతజ్ఞతకెంతయు పాత్రులయినారు. కాని వారు వెలువఱిచిన నూతన చరిత్రాంశములు వారు కృష్ణదేవరాయల గయాశాసనమునుగూర్చి ప్రతిపాదించిన సిద్ధాంతమును నెలకొల్పజాలవు. వారు పొందుపఱచిన నూతన చరిత్రాంశములను మొదట నమూదుచేసి తరువాత నవి యెట్లు వారి వాదమున కనుకూలింపవో వివరించుచున్నాడను.

శ్రీ శర్మగారు ఇట్లనుచున్నారు:—

"గయయందలి ప్రసిద్ధమైన విష్ణుపాదాలయావరణములో నే పది, పదిహేను శాసనములు గలవు. వానిలో నాలుగుశాసనములు మాత్రము మిక్కిలి ముఖ్యమైనవి.

(i) సంస్కృతభాషలో నాగరలిపిలో కాకతి మొదటి ప్రతాపరుద్రుని పేర్కొనుచున్నది.

(ii) కన్నడభాషలో హొయసళ వీరనరసింహుని దెల్పుచున్నది.

(iii) తెలుగులో విజయనగర శ్రీ కృష్ణదేవ రాయల శాసనము.

(iv) తెలుగులో విజయనగర అచ్యుతదేవరాయల శాసనము.

ఈశాసనములలో గల కాలములు కూడ సరిగా ఆయా రాజుల కాలములకు సరిపోవుచున్నవి. కాలమునకు తగినట్లే లిపి భాషగూడ నున్నవి. ఈ నాలుగుశాసనములును విష్ణుపాదాలయావరణలోనే గలవు."

I "కాకతి మొదటి ప్రతాపరుద్రుని కాలమునాటి శాసనములో నాతని గురువులగు మల్లికార్జున సూరి భార్య గౌరియనునామె తన బంధువులకు భర్తకుగూడ గయాశ్రాద్ధమును నిర్విఘ్నముగా జరిపించెనని కలదు.

"శ్రీమన్నిఖిల భూపాలమౌళి రత్నలసత్పదః,
అస్తి ప్రతాపరుద్రాఖ్యో రాజరాజశిరోమణిః.

* * *

తస్య త్రిభువన విద్యా చక్రవర్తీతి విశ్రుతాః,
గురవః సన్తి లోకేఽస్మిన్మల్లికార్జునసూరయః.

* * *

గౌరీ గుణవతీ తస్య విద్వజ్జన వినోదినః,
ధర్మపత్నీ గయాశ్రాద్ధం వీతవిఘ్న మకారయత్."

II హొయసళ వీరనరసింహుని పద్మనాభభట్టోపాధ్యాయుని కొడుకు అప్పణ్ణ గయయందొక మఠమును గట్టించి దేవ పితృ మనుష్య ఋణములను దీర్చికొనెను.

"శ్రీ హొయసణ వీరనారసింగన దేవర
ద ఆచార్య పద్మనాభ భటోపాధ్యాయర
మగమప్పణ్ణను గయాత్రజన.మఠవ
మాడి దేవరిణ పితృగిణ మనుష్యరిణ వను
కళెదను"—

III 'శ్రీకృష్ణదేవరాయల శాసనము'. శ్రీ శర్మగారు వారి వ్యాసమున ఈ శాసనపాఠమును, ప్రతిబింబమును పూర్వప్రకరణమునం దుదాహరించియుండుట వల్ల నిచ్చట శాసనగ్రంథమును మరల నుటంకించలేదు. పాఠకుల సౌకర్యార్థము దాని భాగము నిచ్చట పొందుపఱచుచున్నాను.

"శ్రీమన్మహారాజాధిరాజ రాజ
పరమేశ్వర వీరప్రతాప వీర
కృష్ణదేవమహారాయలు
వే ఇంచిన విజయ శాసన
ము॥...............
"యీ శాసనము
ముక్క
తిమ్మయ
వ్రాసెను."

IV "విజయనగర శ్రీ అచ్యుత దేవరాయల శాసనము. ఇందు తిమ్మణాంక విజయనగర సింహాసన కర్తలను గయా ముక్తి చేసెనని కలదు. శాసనములో తిమ్మయ, ఈశ్వర నారసింహ అని పేర్లున్నవి.

శ్రీమన్మహారాజాధిరాజ రా
జపరమేశ్వర శ్రీ వీరప్రతాప హిం
దూరాజ్య స్థాపనాచార్యాన్వ య
దుకులతిలక తిమ్మయ ఈ
శ్వరనారసింహ నుంపలే
శ్వర శ్రీ వీర అచ్యుతరాయ మ
హారాయల ధర్మశాసనం। తిం
మ్మణాంక విజయనగర సింహా
సన కర్తల గయా ముక్తం చేసెను"

ఈ శాసనముల నాధారపఱచుకొని "హైందవ సంప్రదాయానుసారము మాతాపితృల సుకృతార్థము గయకు పంపుటలోగల ఆశ్చర్యమేమి?" అని ప్రశ్నించినారు శ్రీ శర్మగారు. అనగా హిందూ సంప్రదాయము ననుసరించి శ్రీ కృష్ణదేవరాయలు నిజమాతాపితల సుకృతార్థము గయకు ముక్క తిమ్మన నంపెనని వీరి యభిప్రాయము. వీరికి ఒత్తాసియై శ్రీ సుబ్బరామప్ప యను నొకానొక పండితవర్యులు "పై శాసనములను వాని పాఠములను బరికించినచో ఆయా రాజులు వారి ప్రతినిధులను ఆచార ప్రకారము పంపించి గయా క్షేత్రమున శ్రాద్ధాదికములను చేయించిన పిమ్మట వేయించిన శాసనములనియే తెలియుచున్నవి" అని యుద్ఘాటించి, "డాక్టర్ నేలటూరివా రన్నట్లు కృష్ణదేవరాయల గయా శాసనము ఆ సార్వభౌముని విజయమునే చాటినట్లయిన పైని దెల్పిన కాకతి ప్రతాపరుద్రుడు హొయిసళ నరసింహుడు, అచ్యుతరాయలు కూడా గయను జయించినట్లే కదా!" అని యొక విసరు విసరినారు. 'శ్రీకృష్ణదేవరాయలు గానీ మరి పైని దెల్పిన రాజులు గానీ గయవరకు విజయయాత్రలు చేసినట్లు ప్రసిద్ధ చరిత్రకారు లెవ్వరును వ్రాయలేదు.... కావున శ్రీకృష్ణదేవరాయల తరఫున ముక్క తిమ్మన వేయించిన శాసనము ఆ సార్వభౌముని విజయము నెంతమాత్రమును చాటుటలేదు. అది కేవలము శ్రాద్ధాది కర్మలను వాడుక ప్రకారము చేయుటను చాటును. రాజమర్యాదలను సూచించునట్లు అందలి వాక్యములు పదములు రచియింపబడినవే కాని అవి విజయమును చాటునట్లు తోచదు' అని తమ యమూల్యమైన యభిప్రాయమును వెలిబుచ్చిరి.

ఇట్లు శాసనపరిశోధకు లొకప్రక్కను, నాంధ్ర భాషాకోవిదులు మఱియొకప్రక్కను ఉద్ఘోషించుచున్నను వారి సిద్ధాంతము సమంజసము కాదనియు, వాస్తవదూరమనియు దోచుచున్నది. శ్రీ శర్మగారు కృష్ణదేవమహారాయల శాసనముతోపాటు పిష్టపాదాలంకారవర్ణనములోనున్న మఱి మూడు శాసనములను పేర్కొనియున్నారుకదా—అందలి మొదటి రెండును శ్రీ శర్మగారి వాదమును బ్రోత్సహించజాలవు. అవి యందు పేర్కొనబడియుండు రాజులు గాని, వారు తమకు బదులుగ యాత్రార్థము పంపినవారి ప్రతినిధులు గాని వేయించిన శాసనములు గావు. అవి శాసనపరిశోధకుల పరిభాషలో "పైరిచేటు" శాసనములనబడును. మొదటిది కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునకు జెందినది. అది రాయ మహారాజు గారి కుమార్తెన మల్లికార్జున సూరియొక్క ధర్మపత్నియైన గౌరి యను నామె తన బంధువులకు ధర్తకురాలై గయా శ్రాద్ధమును నిర్విఘ్నముగా జరిపించినది అని శ్రీ శర్మగారే నుడువుచున్నారు. ఉదాహృత శాసనశ్లోకములలో బంధువుల ప్రస్తావము లేకున్నను శ్రీ శర్మగారి మాటలను నవ మంగీకరింపనగును. శాసనము వేయించినప్పటికి గౌరి విధవరాలు—ఆమెను రాజు పంపలేదు. తన్ను రాజు పంపినట్లు ఉదాహృత శాసనగ్రంథభాగమునం దెచ్చటను చెప్పియుండలేదు. రాజు తన పితృకు గయా శ్రాద్ధము సేయుటకు గురుపత్నియయ్యైనను

# రాయల గయశాసనము జయశాసనమే

స్త్రీని నియోగి చేయుంచెనుగదా — ఆమెకు పుత్రసంతతి యుండెనట్లగపడదు. భర్త గతించినవెనుక ఋణములు గలుగునని జంకక అతనికి శ్రాద్ధక్రియ జరుపుటకు గయకు బయలుదేరినది. తన కష్టను నెరవేర్చుకొనినది; భర్తకును ఆయనతోపాటు బంధువులకును గయాశ్రాద్ధముజేసి శాసన మెత్తించినది. అంతియ — రాజ కుటుంబ ప్రశంసయే లేదు.

రెండవశాసనము హొయసళ వీరనారసింగ దేవుని నాటిది. ఆ మహారాజుయొక్క దేవాలయ పూజారి కుమారుడు అప్పణ్ణ గయకుబోయి మానము గట్టి తన ఋణత్రయము నీగికొనెను. సామాన్యముగ నివి దేవఋణము, పితృఋణము, ఋషిఋణము అను మూడు తరగతులుగ విభజింపబడుచున్నను మనుష్య ఋణమను మఱియొక విధమైన ఋణముకూడ నుండును. "దేవానాంచ పితౄణాంచ ఋషీణాంచ తథా నరః - ఋణవాన్ జాయతే" అను మహాభారత శ్లోకము వల్ల తెలియవచ్చుచున్నది. అప్పణ్ణ తాను వ్రాయించిన శాసనమున ఋషిఋణమును వదలిపెట్టి దానికి బదులు మనుష్య ఋణమును చేర్చుకొనినాడు. ఈ శాసనమునం దప్పణ్ణ తాను హొయసళ వీరనరసింగదేవుని పంపున గయకు బోయినట్లుగాని, యాతని పితరుల విముక్తికొఱకు శ్రాద్ధాదికర్మలను జేసినట్లుగాని వచించి యుండలేదు. మానము గట్టి తన ఋణత్రయమును తుడిచివేసికొంటినని మాత్రము చెప్పుకొనెను. కావున ఈ శాసనసాక్ష్యముగూడ నిచ్చట ప్రస్తావనకు తేదగినది కాదు.

ఇక మిగిలియుండునది అచ్యుతరాయలది - ఇది ధర్మశాసనమని యందే స్పష్టముగ గలదు. ధర్మశాసన మనగా మఠమునకు సంబంధించినది. ఈ శాసనము నెత్తించినవాడు తిమ్మణ్ణ — అతడు గయయందు చేసిన కార్యమేదియో వివరించియుండలేదుగాని 'విజయనగర సింహాసనకర్తల గయాముక్తం చేసెను' అని యున్నది.[1] శ్రీ శర్మగారు నమూదుచేసిన క్రొత్త శాసనములు మూడింట నిది యొక్కటియే వారు చెప్పినట్లు రాజుచే దనకు ప్రత్యామ్నాయముగ యాత్రార్థ మంపబడిన యతని ప్రతినిధి వ్రాయించినది. కాని కృష్ణదేవరాయల గయశాసన మట్టిది కాదు. అచ్యుతరాయల శాసనము ధర్మశాసనము. కృష్ణరాయలు వేయించినది విజయశాసనము అని యందు స్పష్టముగ జెప్పియున్నది. శాసనమున నిట్లు విజయశాసనమని విశదీకరింపబడియున్నను కృష్ణదేవరాయలు తన తలిదండ్రులకు శ్రాద్ధకర్మను జరుపుటకొఱకు తనకు బదులు తన యాస్థానకవులలో నొకడైన ముక్కు తిమ్మనను గయకంపెననియు, నతడు తన్ను రాయలు గయకంపిన వాస్తవకారణము దెల్పక రాయలకీర్తిని ప్రకటించుటకొఱకు అచట నొక కల్లబొల్లి విజయశాసనమును వ్రాయించెననియు, సదరు శాసనము రాయలయాత్ర విజయమును సూచించుననియు, విజయయాత్ర నెంతమాత్రము దెల్పదనియు శ్రీ శర్మగారు వాదించుచున్నారు. ఇది కేవలము శ్రీ శర్మగారి యూహాజన్యమైన కట్టుకథ. "ఈ శాసనము ముక్కు తిమ్మయ వ్రాసెను" అనుశాసనవాక్యము నాధారము చేసుకొని యింత గ్రంథమును పెంచినారు. కృష్ణరాయలు తిమ్మనను గయకంపెననుటకు శాసనమునం దెట్టి యాధారమును లేదు. మఱియు నందితిమ్మన నియోగియని శ్రీ శర్మగారే చెప్పియున్నారు. అతడు మహాకవి. శ్రాద్ధాది కర్మలను చేయించుటగాని, యజమానులకు ప్రత్యామ్నాయముగ చేయుటగాని రాజపురోహితుని నియమిత కృత్యము. కావున శ్రీ కృష్ణదేవరాయలు తన పితౄలకు గయాశ్రాద్ధము జరుపవలెనని యుద్దేశపడియుండిన నిజపురోహితుడైన రంగనాథదీక్షితులనో లేక మఱియొక వైదికునో పంపక నియోగిని నంపియుండడు.

---

1. ఇందు పేర్కొనబడిన విజయనగర సింహాసనకర్తలెవ్వరో విచారించవలసియున్నది. శాసనములో తిమ్మయ ఈశ్వర నారసింహ అని పేర్లున్నవి. వీరు అచ్యుతరాయల పితృపితామహులు అని శ్రీ శర్మగారు నుడివిరి. పితృపితామహ ప్రపితామహులని యుండిన పై మూడు పేరులును కలసి వచ్చియుండెడివి. ఈ సందర్భమున శ్రీ శర్మగారు తమ మనస్సును విప్పి చెప్పకున్నను వారి ధోరణినిబట్టి చూడగా పైచేర్కొనిన తిమ్మయ ఈశ్వర నారసింహులే తిమ్మణ్ణచే గయాముక్తులుగ జేయబడిన విజయనగర సింహాసనకర్తలని వారి యభిప్రాయమైయుండునని తోచుచున్నది. సింహాసనకర్త యనగా సింహాసనాధిపతియని యర్థము. తిమ్మయ ఈశ్వర నారసింహులయందెవ్వరును విజయనగరసింహాసనము నధిష్ఠించియుండలేదు. కావున తిమ్మణ్ణచే గయాముక్తులు గావింపబడిన విజయనగర సింహాసనకర్తలు వారయియుండరాయని సంశయము గలుగుచున్నది.

తిమ్మనయు వట్లు పోయియుండవలెను. కావున కృష్ణరాయల విజయశాసనమును ధర్మశాసనముగ మార్చవలయునని శ్రీ శర్మగారుచేసిన ప్రయత్నము మామోదింపదగినది కాదు. పైగా. అందు పితృస్మరణయే లేదు. మఱియు కృష్ణరాయల గయాశాసనము విజయశాసనమే గాని యన్యము గాదని నిరూపించగల ప్రబలసాక్ష్యము శాసనమందే కానవచ్చుచున్నది. శాసనముయొక్క చివరిభాగము రెండుచీలికలుగ విభజింపబడియున్నది. ఎడమప్రక్క చీలకయందు "వరనందన బాసదప్పె వరగండ్డాంక" యను పద్యపాదము లైదు చిన్న పంక్తులుగ నొకదానిక్రింద మఱియొకటి చెక్కబడెను. కుడిప్రక్క "యీ శాసనము ముక్కతిమ్మయ్య వ్రాసెను" అను వాక్యము యెడమప్రక్క చీలికవలె యైదుపంక్తులుగ జెక్కబడియున్నది. ఈ రెండు చీలికల నడుమ ఆయుధపాణులయిన పురుషులు మువ్వురు నిలిచియుండునట్లు చెక్కబడియుండు శిల్పమొక్కటి కానవచ్చుచున్నది. ఆ మువ్వురిలోను మధ్య నిలిచియున్న పురుషుడు దీర్ఘకాయుడు. ఖడ్గముతోడి దక్షిణహస్తమును శిరస్సుపైకెత్తి కట్టెగుట తన కభిముఖుడై నిలిచి యాయుధపాణియై యెదిరించుచున్న ప్రతివీరు నొక్కని వ్రేయ నుంకించుచున్నాడు. తక్కిన వారు మధ్య నిలిచియుండు నా యోధుని పిరుద వానికి బాసటగ కుడిచేత ఖడ్గమునో లేక యట్టి యాయుధమునో పూని నిలిచియున్నారు. ఈ శిల్పము మనపూర్వికులు యుద్ధక్షేత్రములందు నెలకొల్పు వీరశిలాఫలకముల వంటిది. ఇది కృష్ణరాయల గయశాసనాంతర్భాగమున జెక్కబడియుండుటచేత నిది యీ శాసనోక్త విజయమునకు సంబంధించినదని తెల్లమగుచున్నది. విజయశాసనమున నిట్టిశాసనముండుట యుక్తమేకదా; కాని శ్రీ శర్మగారు 'యీశిల్పము మహిషాసురమర్దని వలె కాన్పించుచున్నది' అని తమ యభిప్రాయమును వెలిబుచ్చినారు. అట్లయినను అది రాయల చైత్రయాత్రను సూచించునే కాని తీర్థయాత్రను సూచింపదు. దుర్గాదేవి యుద్ధమున కధిదేవత—పూర్వము విజయనగర చక్రవర్తులేమి తక్కిన హిందూభూపాలురేమి శరన్నవరాత్రోత్సవములు జరిపి యుద్ధయాత్రలు వెడలువారు. మఱియు నాకాలపు హిందువులు మహమ్మదీయుల నసురాంశసంభూతులుగా బరిగణింపుచు వచ్చిరి. కావున ప్రస్తుతశిల్పము మహిషాసురమర్దని యైనను నది రాయల సంగ్రామ విజయమునే ప్రకటించును. తీర్థయాత్రాత్మక శాసనమున నీశిల్పముయొక్క యౌచిత్యము గానరాదు. శ్రీ శర్మగారు వాదించునట్లు మాతాపితల సుకృతార్థము చేసిన తీర్థయాత్రను ప్రకటించుటయే ఈ శాసనోద్దేశమైన నంగు కత్తులు



కటార్లతో యుద్ధముసేయు యోధుల శిల్పముతో నేమి పని? కావున సదరుశిల్పము శ్రీ కృష్ణదేవరాయల గయ శాసనము జయశాసనమేయని ఘంటాపథముగ జాటుచున్నది.

## 2

ఇంతవఱకు కృష్ణదేవరాయల గయశాసనము అందు విస్పష్టముగ బ్రకటింపబడియుండునట్లు విజయ శాసనమే యనియు, నది శ్రీ శర్మగారు చెప్పినట్లు రాయలకు బ్రతిగ ముక్కతిమ్మన గయకు తీర్థయాత్ర చేసి యచ్చట రాయల తలిదండ్రులకు శ్రాద్ధాదికర్మలను జరిపి పిండము వేసియు నా విషయమునే స్మరింపక రాయలపేర వ్రాయించిన యబద్ధపు విజయశాసనము గాదనియు, మఱియు కృష్ణదేవరాయులశాసనము శ్రీ శర్మగారు తమవాదమును నెగ్గించుకొనుటకు ఉదాహరించిన కాకతి ప్రతాపరుద్ర హొయ్సళ వీరనరసింహ విజయనగరాచ్యుతదేవరాయల శాసనముల వంటిది కాదనియు, నవి కేవల మతసంబంధ ధర్మశాసనములనియు, కృష్ణదేవమహారాయలది యతని యుత్తరాశాదిగ్విజయమును బ్రకటించుటకొఱకె కత్తించిన విజయశాసనమనియు వివరించితిని. ఇక నీ చైత్రయాత్రయందు కృష్ణరాయలచే బరాభూతుడైన ప్రభు వెవ్వడో కనుగొనవలసియున్నది. అతని పేరుగాని

యతడు పాలించుచుండిన రాజ్యము పేరుగాని శాసనమునందు చెప్పియుండలేదు. కాని శాసనకాలమును బట్టియు నది నెలకొల్పబడియుండు స్థలమునుబట్టియు నూహించుట కవకాశము కలదు. శాసనకాలము శకాబ్దము 1444 అగు నేటి వృష సంవత్సర ఆషాఢ బహుళ 13 వ (అనగా క్రీ. శ 1521 జూలై 2వ తేది మంగళవారము) నాడు వేయించినదని యందే కలదు; మఱియు నది నెలకొల్పబడియున్న గయ యప్పటి పఠాను సామ్రాజ్యములోని కనుకవనియే లోడివంశమునకు జెందిన ఇబ్రాహీమ్‌లోడీ యను మహమ్మదీయ ప్రభువుపాలన క్రింద నుండెనని మహమ్మదీయ చరిత్రలవలన తెలియుచున్నది; కావున కృష్ణదేవరాయలచే నతని యుత్తరాశాదిగ్విజయ సందర్భమున గయాప్రాంత దేశమున పరాజయమునందినాతడీ ఇబ్రాహీము లోడియే యని మన మనుకొనవచ్చును. దక్షిణభారతావనీపాలకుడైన కృష్ణదేవరాయలు తన రాజ్యమునకు బహుదూరమునందుండు గంగాతీరభూముల జయించుట సాధ్యమా యను సంశయము పెక్కండ్రను పీడించుచున్నది. అట్టి సంశయమున కెడము లేదనియు కృష్ణదేవరాయలు ఉత్తరాపథము దండయాత్రలు సేయువాడనియు తెల్పుచు నల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రలోని

'నానాసపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖురలిరాసి
యాపంచగౌడధాత్రీపసం బెవ్వాని
కసివాలుగా నేగుపట్టె బయలు.'

అను సీసపాదము లానిశ్చయమును నిరూపించుచున్నవి అని ఫిబ్రవరి భారతిలో నేను వ్రాయుగా శ్రీ శర్మగారును, సుబ్బరామప్ప యను పండితులొక్కరును పెద్దనార్యుని వాక్యము లతిశయోక్తు లనియు సత్యోక్తులు గావనియు వాని సాక్ష్యము నంగీకరించుటకు వలనుపడదనియు వక్కాణించిరి; కవుల వాక్యములలో నతిశయోక్తు లుండవచ్చును; అంతమాత్రమున వారు చెప్పిన వన్నియు నతిశయోక్తులని త్రోసిపుచ్చుట పాడియా? పెద్దనార్యుని వాక్యము లతిశయోక్తులని త్రోసిపుచ్చుటకు వీరు చూపిన ముఖ్యకారణ మేమనగా కృష్ణరాయలు ఉత్తరాపథముపై నెత్తిపోయినట్లు సాక్ష్యము మఱియొండును గానరాకపోవుట. దీనినే ఆంగ్లములో 'ఆర్గ్యుమెంటు ఫ్రాం సైలెన్స్' అందురు. పరిశోధకులు లీవాదము నంత ప్రబలమైన దానినిగ గ్రహింపరు. ఈ సందర్భమున మన దేశముయొక్క ప్రాచీన చరిత్రనుగూర్చి యెల్లరును జ్ఞప్తియందుంచుకొనదగిన విషయ మొక్కటి కలదు. మన పూర్వులెవ్వరును మన దేశచరిత్రాత్మకగ్రంథములను రచించియుండలేదు. బ్రిటిషుయుగమున ఆంగ్లేయులతోడి సంపర్కమువల్లను నాంగ్లవిద్యాభ్యాసమువల్లను భారతీయులకు-ముఖ్యముగ హిందువులకు చారిత్రక జ్ఞానోదయమైన పిమ్మట క్రీ. శ. 19 వ శతాబ్దము తుదను 20 వ శతాబ్ద ప్రారంభమునను నిజదేశ పూర్వచరిత్ర నెరుకగా నప్పుడు తన్విషయగ్రంథముల యభావము వారికి తెలియబడెను. ఇట్టి పూర్వచరిత్రగ్రంథములు లేకపోయినను ప్రాచీన చరిత్రరచన కనుకూలములగు శాసనాద్యాధారములు త్రవ్వితండములుగ దేశమునందెల్లయెడలను గలవనియు తెలియవచ్చెను. అంతట చరిత్రసాధన సంపాదనకు యత్నములు ప్రారంభమైనవి. ఇండియా గవర్నమెంటువారు లార్డు కర్జనుగారి ప్రేరణవలన ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటును స్థాపించిరి. పాశ్చాత్య పరిశోధక మహాశయులనేకులు లభ్యమైన సామగ్రి నాధారముగ జేసికొని మన పూర్వచరిత్ర రచనమునకు మేలుబంతు లిడిరి. వారి ననుసరించి విద్యావంతులైన భారతీయులు చరిత్రగ్రంథములు వ్రాయనారంభించిరి. కాని సాధన సేకరణము సంపూర్తి కాలేదు. నిరంతరము సాగుచున్నది. క్రమక్రమముగా నూతనమైనవి తత్పూర్వ మెఱుగబడని చరిత్రాంశము లెన్నియో వెలువడుచున్నవి. సాధన సేకరణము ముగియుచుండగ చరిత్ర పరిశోధకు లూరకుండక లభించిన చరిత్రాధారములను పరిశీలించి వానిమూలమున నెంత తెలియవచ్చునో యంతవఱకు దేశచరిత్రరచన సేయుచు వచ్చిరి. కాని యిట్లుగ లభ్యమైన సాధనసామగ్రి యాధారమున వ్రాసిన చరిత్రలును, చేసిన సిద్ధాంతములును తాత్కాలికముగ నంగీకార్యములే యైనను స్థిరస్థాపితములని యెంచుటకు వీలుకాదు. అప్పటప్పటికి వెలువడు నూతన చరిత్రాంశముల ననుసరించి మార్పుజెందవలసియుండును. ఇదియొక కృష్ణదేవరాయల చరిత్ర పట్లనే కాక సమస్తమైన పూర్వహిందూరాజుల యెడను, రాజ్యములయెడను చెల్లగల సత్యము. కృష్ణరాయల యాస్థానకవియు నతనితో పెక్కుదండయాత్రలకు బోయినవాడును నగు పెద్దనార్యుడు అతడా పంచగౌడధాత్రిమీదికి దండెత్తిపోయెనని విస్పష్ట

వాక్కుల బల్కుచుండగా సాక్ష్యాంతరము లేదని కారణము చెప్పుచు నని యబద్ధప్రాతయని త్రోసిపుచ్చుట సమంజసమా? పంచగౌడధాత్రీపదాంతర్గతమైన రాయల గయ విజయశాసనము వెలువడినప్పుడు గూడ నది విజయశాసనము గాదు యాత్రాశాసనమని వాదించుట సత్యమును గప్పివేయుటయే యగునుగదా.

కృష్ణరాయలు ముక్కుతిమ్మనను దనకు బదులు గయకు తీర్థయాత్ర సేయ నంపెనని తమ వాదము రుజువు సేయుటకు శ్రీ శాస్త్రిగారు మఱియొకమార్గము నవలంబించినారు. "కృష్ణదేవరాయలు గొప్పదైవభక్తుడు... శ్రీ వెంకటేశ్వరుడాతని యిష్టదైవము...అతని తీర్థయాత్రాభిలాష, ఆగమోక్త కర్మలయందాదరము అతని శాసనములలో గల యీశ్లోకమే చాటుచున్నది" అని చెప్పి తుళువవంశజుల శాసనములలో పెక్కింటియందు గానవచ్చు 'కాంచీ శ్రీశైల శోణాచల కనకసభా' యిత్యాదిశ్లోకము నుదాహరించి, "రాయలు తల్లిదండ్రులగు నాగమాంబా నరసానాయకుల పేర ననేకధర్మములు చేసిన వితరణశాలి హైందవసంప్రదాయానుసారము మాతాపితల సుకృతార్థము తిమ్మకవిని గయకు పంపుటలో గల యాశ్చర్యమేమి?" అని యభ్యంతరము నభినయించినారు. కృష్ణరాయలు పెద్దదైవభక్తుడే - శ్రీ వెంకటేశ్వరు డాతని యిష్టదైవమే - తీర్థయాత్రాపరాయణుడే — వితరణశాలియే — కాదన్నవా రెవ్వరు? కాని యిది యప్రస్తుత ప్రశంస. శ్రీ శాస్త్రిగారనుకొనునట్లు కృష్ణరాయలు ముక్కుతిమ్మనను తన మాతాపితలసుకృతార్థము గయకు తీర్థార్థము పంపె ననువిషయమును సాధించుటకిది సాక్ష్యము కాజాలదు. అట్లని నిరూపింపదగిన యాధారమెందును లేదుగాన నిరాధారమైన పట్టికథ నొకదానిని కల్పనసేయుటవలన గలుగు ప్రయోజనమేమి?

కృష్ణరాయల గయాశాసనము పెద్దనార్యోక్త ఆ పంచగౌడధాత్రీపదమునిది ధాటి యతిశయోక్తి కాదనియు, సత్యాత్మకమనియు రుజువుచేయుచున్నది. ఎవ్వరెన్ని వ్యాఖ్యానముల జేసిన నేమి, రాయలు స్వయముగ వేయించిన శాసన మది "విజయశాసన"మని యుద్ఘోషించుచున్నది. ఇక ఆపంచగౌడధాత్రీపదదండయాత్రతోపాటు పెద్దనార్యుడు వర్ణించిన చరిత్రాంశములు అతిశయోక్తులుగ నేము కనుగొందము. మొట్టమొదట వతకు 'ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమారునకు క్రౌంచాచల రాజయ్యె'నని వక్కాణించినాడు. ఈ యుదయాచలేంద్రము నెల్లూరి జిల్లాలోని యుదయగిరి. ఇది కృష్ణదేవరాయల రాజ్యారంభకాలమున కళింగగజపతుల యధీనమునం దుండెను. క్రీ. శ. 1513లో కృష్ణదేవరాయ లా దుర్గమును ముట్టడించి యొకటిన్నర సంవత్సరము పర్యంతము కోటలోని గజపతిరాజ్యముతో బోరాడి దానిని సాధించినాడు. దేవసేనాధిపతియైన కుమారస్వామి క్రౌంచపర్వతమునువలె రాయలు ఉదయగిరిని అక్షరాల భేదించి కైకొనెను. మానుజు సమకాలిక పాశ్చాత్యచరిత్రకారుడైన న్యూని జేమి చెప్పుచున్నాడో:

"And the king (Krishnadevaraya) laid seige to it (Udayagiri) for a year and a half, in which time he made many paths across rocky hills, breaking up many great boulders in order to make a road for his soldiers to approach the towers of the fortress. The place at this time was so strong that they could not approach it except by one way which was so narrow that men could pass along it one at a time and in this place he made a broad road and many others also, so that he could come close to the fortress."[2]

ఇందు పెద్దనార్యుడు పల్కిన యతిశయోక్తు లెవ్వియు లేవుగదా. ఇక 'నానాహయపతి శంకరసింధురాధ్యక్షుల' విషయము విచారింతము. మొట్టమొదట సింధురాధ్యక్షుని గూర్చి:- సింధురాధ్యక్షుడు కటక రాజ్యపాలకుడైన గజపతియని యందరంగీకరించిన విషయమే. అతనిని కృష్ణరాయ లోడించి యాతని రాజ్యమును హరించెనని యుదయగిరినుండి శ్రీకూర్మముపర్యంతము గానవచ్చు విజయనగరశాసనములె చాటుచున్నవి. రాయల దండయాత్ర కటకము దాక సాగినట్లు రాయవాచకము తెల్పుచున్నది. 'కటకమును గాల్చె' నని పెద్దన చెప్పుచున్నాడు. రాయ లది సత్యమని యంగీకరించినాడు. ఒకానొకప్పుడు కీ॥ శే॥ డాక్టర్ యస్. కృష్ణస్వామి అయ్యంగారు, నేడు రాయలగయశాసనము విజయశాసనము గాదని శ్రీ శాస్త్రిగారు వాదించునట్లు రాయలు దండయాత్ర సింహాద్రిని దాటలేదు; అతడు కటకమును గాల్పలేదు. అది కేవల ముత్ప్రేక్షకొఱకు చెప్పిన యతిశయోక్తి యని వాదించిరి. కాని యిటీవల గానవచ్చిన సాక్ష్యమువల్ల రాయలు వాస్తవముగ కటకము దాక దండుచేసినట్లు తెల్లమైనది. యుద్ధసందర్భమున శత్రుస్థానముల దగులబెట్టుట సహజమే; కావున పెద్దనార్యుడు చెప్పిన రాయలంగీకరించిన కటక

2. Forgotten Empire pp 816-17.

దహన వృత్తాంతము సత్యాత్మకమని పరిశోధకు లొప్పుకొనుచున్నారు.

సింధురాష్ట్రమునిపై విజయము సత్యమైనప్పుడాతనితో జోడింపబడిన నావాసపతి శకంధరుల మీద విజయము బద్ధమగునా? నావాసపతి యెవ్వరైనదియు నింతవరకు తేలలేదు. ఇతనిని గుర్తించుటకు సాధ్యము కాకయున్నది. వసుచరిత్రకారుడైన రామరాజభూషణుడు కూడ నావాసపతిని పేర్కొనియున్నాడు. అతడు కటకేంద్రుడైన గజపతికిని, హయపతికిని, పాండ్యరాజునకును సమానస్కంధుడు. గజపతి గజములను హయపతి హయములను పాండ్యరాజు భర్మమును జీర్ణకర్ణాటసామ్రాజ్య పునరుద్ధారకుడైన తిరుమలరాజునకు కానుక పెట్టిన ట్లాతడు అమూల్యములైన కటకాభరణములను సమర్పించినట్లు రామరాజభూషణుడు వర్ణించియున్నాడు. రామరాజభూషణుని రచన భావగర్భితమైనది. కటకేశుడు గజపతి; అతడు గంధసింధురములను, హయపతి యశ్వములను కానుక పెట్టుట సహజమే. అట్లే పాండ్యేశ నావాసపతులు పంపిన కానుకలు వారి రాజ్యజన్యములని యెంచుట యొప్పగును. పాండ్యుని గుర్తించుట సులభము. అతని రాజ్యమున ముత్యము లుత్పత్తిల్లును; కాని రామరాజ భూషణుడు ముత్యములను పేర్కొనక పాండ్యదేశమున గానరాని భర్మము నేల చెప్పెనో తెలియదు. నావాసదేశము కటకనిర్మాణమునకు ప్రసిద్ధమైనదేమో. అటులైనను తన్మూలమున నా దేశమును గుర్తించుటకు వలనుపడదు.

శకంధరుని గూర్చి గతించిన యేబది సంవత్సరముల నుండియు చర్చ సాగుచునేయున్నది. 'శకంధర' శబ్దము 'శికందర్' అను పారసీక నామమునకు సంస్కృతీకరణమని గుర్తించి కీ. శే. లక్ష్మణరావు పంతులవారు చరిత్రపరిశోధకులదృష్టిని కృష్ణదేవరాయల సమకాలికులైన మహమ్మదీయ ప్రభువుల వంకకు మరల్చుటయే కాక పెద్దనార్యుని శకంధరుడు క్రీ. శ 1526 లో మూడు నెలల కాలము గుజరాతు దేశమును పాలించిన శికందర్ సుల్తానగుననియు గుర్తించిరి. కృష్ణరాయలు జయించిన యీ పంచగౌడధాత్రీపదము వారనుకొనినట్లు గుజరాతు కాదనియు, అది మనవ్యాఖ్యాతలు వివరించినట్లు కన్నోజీలు మొదలయినవారి ఉత్తరదేశమే యనియు, నీ నిర్వచనము సత్యమని కృష్ణరాయల గయవిజయ శాసనము రుజువుసేయుచున్నదనియు, పెద్దనార్యుడు పేర్కొనిన శకంధరుడు ఢిల్లీపాలకుడైన శికందర్ లోడి యనుసుల్తాను అగుననియు ఫిబ్రవరి భారతిలో వ్రాసియుంటిని. అది శ్రీ శర్మగారికి నచ్చలేదు. నేను చెప్పినది సరికాదని కొన్ని కారణములను చూపి తీర్మానించినారు. (1) "కృష్ణదేవరాయలంతటి గొప్పవాడు కాకపోయినను సికందరులోడి సామాన్యుడుమాత్రము కాడు. ఇంచుమించుగా నుత్తరదేశమున కంతకును సార్వభౌముడు." అని చెప్పి దీని కాధారముగ 'అడ్వాన్స్‌డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా' అను గ్రంథమునుండి యొక ప్యాసేజ్ నుదహరించినారు. శికందర్ లోడి శర్మగారు చెప్పినట్లు శూరాగ్రేసరుడే. పెక్కురు రాజులను జమీందారులను జయించినమాటయు వాస్తవమే. కాని పై యంశము లాతడు కృష్ణరాయలచే పరాభూతుడు కాడని యెట్లు నిరూపింపగలవు? ఒకచో జయమందినాతడు మఱియొకతావునను, ఒక సమయమున జయమందినవాడు మఱియొక సమయమునను పరాజయమును పొందియుండకూడదా? హనిబాలు కెన్నీ రణరంగమునను, నెపోలియన్ వాటర్లూ సంగ్రామమునను, హిట్లరు స్టాలిన్‌గ్రాడ్ ముట్టడిసందర్భమునను పరాజయమును పొందియుండలేదా? కావున యెంత మగటిమిగల శూరుడైనను సికందర్‌లోడి యోటమి నందుట యసంభవము కాజాలదు. ఈ సందర్భమున శ్రీ శర్మగారు మఱియొక ప్రశ్న వేయుచున్నారు. "అట్టి శికందరు దిగ్విజయమును ఆవగింజంతయున్నదానిని గుమ్మడికాయంత చేసి వర్ణించు మన ప్రబంధకవులు చిన్నసీసపాదార్థములో చేర్చి వేయుటలోగల సారస్యమేమి?" కవులు నిరంకుశులు. వారి చిత్తవృత్తి నిర్ణిబంధమైనది. రాయచూరుయుద్ధమున ఆదిల్‌శాహుపై కృష్ణరాయలకఖండవిజయము చేకూరినది కదా. పాశ్చాత్యుడైన న్యూనిజ్ ఆ విజయమును విపులముగ వర్ణించియుండగా రాయలయాస్థానకవు లెవ్వరును దానినేల స్మరింపలేదో శ్రీ శర్మగారు చెప్పగలరా?

కృష్ణరాయల చేతులోడిన శకంధరుడు సికందర్ లోడి కాదనుటకు శ్రీ శర్మగారు చూపిన కారణములలో మఱియొకటి "శికందర్ నామధేయు లింక కొంతమంది గలరు. వారిలో రాయల సమకాలికుడైనవాడైనను పెద్దన పేర్కొనిన శకంధరుడు కావచ్చును?" కృష్ణరాయల సమకాలికులలో శికందర్ నామధారులైన ప్రభువులు కలరని నిరూపించుటకై 'ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర హిస్టరీ' అను గ్రంథము నుండి సాక్ష్యమును సంగ్రహించి శ్రీ శర్మగారిట్లు వ్రాసియున్నారు. "పై చర్చా విషయమును గూర్చి డాక్టరు రమణయ్యగారే యిట్లు వ్రాసిరి.

"It is interesting to note that a Sikandar is mentioned as one of the adversaries of the Gajapati Prataparudra in a Sanskrit drama called Jagannatha Vallabha natakam (M.G.O. M. Library R. No. 4198).

The Velicherla grant of Prataparudra Gajapati refers to him as Pancha-gaud-adhinayaka (JAHRS ix P. 56). The apancha gauda-dhatripada of Peddana perhars refers to the dominio1s of the Gajapati which Krishnarava invaded"

'ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర హిస్టరీ' 1946 లో ముద్రితమైనది. తత్పూర్వమే యిదారంభింప నాకు వ్రాయబడినది. శ్రీ శర్మగారీ సంవత్సరము ఫిబ్రవరిలో పరిషత్పత్రికయందు ప్రకటించునంతవఱకును యీయందు కృష్ణరాయల విజయశాసనమున్నదని యెవ్వరును ఎఱుగరు. క్రొత్త చరిత్రాంశములు వెలువడినపుడు తత్పూర్వము గోచరించిన సాక్ష్యము నాధారపఱచుకొని చేసిన సిద్ధాంతములు తాత్కాలికముగ నంగీకార్యములైనను మార్పుకోన వలసిన యావశ్యకత నింతకుముందే వివరించియున్నాను. కావున 1940 ప్రాంతమున నేను చేసిన సిద్ధాంతమిప్పటి నా యభిప్రాయమునకు బంధకము గాజాలదు. జగన్నాథవల్లభనాటక విజయమునందు ప్రతాపరుద్రగజపతియొక్క ప్రతిపక్షిగ చేర్కొనబడిన సికందర్ ఎవ్వడో కాదు; అతడు ఢిల్లీశ్వరుడైన శికందరులోడియే. అతడు యమునాపురాధినాథుడైన హుసేన్‌షా షార్కీని ఓడించి యతని రాజ్యమును హరించెను. హుసేన్‌షా ప్రతాపరుద్ర గజపతి నాశ్రయించెను. ఈ కారణముచేతనే ప్రతాపరుద్ర గజపతి సికందర్ లోడి నెదిర్చి యుద్ధముజేసి విజయము జేకొనెను. ఆ విజయకారణముననే ప్రతాపరుద్ర గజపతి 'పంచగౌడాధినాయక' యను బిరుదు ధరించినది. ఈ పట్టున నీక్రింది యంశములను స్మరణకు దెచ్చుకొనుట యుక్తము:-(1) కృష్ణరాయలకాలమున పంచగౌడధాత్రి కంతటికి గాకపోయినను నందు చాల భాగమునకు సికందర్ అను మహమ్మదీయ ప్రభువు అధిపతియై యుండెను. (2) అతడు ప్రతాపరుద్ర గజపతితో యుద్ధముజేసి యోడిపోయెను. (3) కృష్ణదేవరాయలు పంచగౌడధాత్రీపదముపై దండువిడలేదు. (4) అతడొక శకంధరు (శికంధర్)ను జయించి యరిగాపుగ జేసికొనెను. క్రీ. శ. 1517 వఱకు ఢిల్లీ పఠానురాజ్యమును పాలించిన శికందర్ లోడి యొక్కడును, 1526 లో మూడుమాసములకాలము గుజరాతును పాలించిన శికందర్ షా యొక్కడునుదప్ప రాయల సమకాలికులైన భారతీయ మహమ్మదీయ ప్రభువులలో శికందర్ నామధారులు మఱియెవ్వరును గానరారు. కలరేని వారిని శ్రీ శర్మగారు పేర్కొందురుగాక.

ప్రబంధములలోని పద్యములనుబట్టి చరిత్రాంశముల సిద్ధాంతీకరించుట గూడ ప్రమాదము అని శ్రీ శర్మగారు హెచ్చరిక సేయుచున్నారు. ఇది చరిత్ర పరిశోధకులందఱును గమనము నందుంచుకొని మననము జేయదగిన సంగతి. ప్రమాదమెట్లు కలుగునో తార్కాణించుటకొఱకు మనుచరిత్రలోని 'కుకుర కాశ కురు కరూశ' అను వాక్యాంతపద్యమును గొని, "దీనినిబట్టి కుకుర, కాశ, కురు, కరూశ, కోశల, ఆంధ్ర, సింధు, బాహ్లిక, అంగ, వంగ, సింహళ దేశాధిపుల రాజకుమారైలు కృష్ణరాయల కూడిగము సేయుట యెంత యథార్థమో పై సీస పద్యములలోని నావాడపతి శకంధర సింధురాశ్యక్షులరిగాపులగుటకూడ నట్టిదే కావచ్చును" అని వారు వ్యాఖ్యానము జేసినారు. అనగా రెండును అబద్ధములే యని వారి యభిప్రాయము. శ్రీ శర్మగారంతటి పరిశోధకులుగూడ యతిశయోక్తులనుండి వాస్తవ చరిత్రాంశములను వేర్పఱుపజాలక పోవుట శోచనీయము. శ్రీ శర్మగారు ఉదాహరించిన 'కుకుర, కాశ, కురు, కరూశ' అను పద్యమున పెద్దనగారు వర్ణింపదొడగినది చరిత్రాంశములు గావు. కృష్ణదేవరాయల సార్వభౌమత్వమును చాటించుటయే యతని యుద్దేశము — పెద్దన చరిత్రకారుడు గాడు; మహాకవి—కావున నతడు పరంపరాగతమై వచ్చు కవి సంప్రదాయము ననుసరించి నానాదేశాధిపతులును రాయల యాధిపత్యము నంగీకరించి తత్పాదములగ దమ పుత్రికల నాతని కూడిగముసేయ నంపిరని తెల్పినాడు. ఈపట్టున శకమహీశ్వరుని గురించి యతని రాయబారి విక్రమార్కుని పేరోలగమున జెప్పినట్లు బల్కిన 'కన్యల నొసగి కానుక గానిచ్చి మనిరి కాశ కరూశ మద్రపతులు' అను సీసపాదమును స్మరింపవలసియున్నది. నావాడపతి శకంధర సింధురాశ్యక్షులు కృష్ణదేవరాయల కరిగాపులగుట గూడ అబద్ధమని వ్రాసిరి గదా శ్రీ శర్మగారు. నావాడపతి శకంధరుల మాట యటుండనిండు—వీరిలో ప్రథముల వివరము మజ్ఞాతము; ద్వితీయులది వివాదగ్రస్తము; కాని సింధురాశ్యక్షుడు అనగా గజపతి కృష్ణరాయల కరిగాపగుట యథార్థము గాకపోవుట యెట్లో నిరూపించవలసిన బాధ్యత శ్రీ శర్మగారిమీద నున్నది. మఱి పై సీసపద్య ప్రథమపాదమున జెప్పిన యుదయగిరి విజయముగూడ పెద్దనార్యుని కల్పనమే యగునా? ఉదయగిరి మొదలు శ్రీకూర్మమువఱకు దేశము పొడుగునను చెక్కుతావులందు గానవచ్చు కృష్ణరాయలయొక్కయు, నతని దండనాయకులయొక్కయు శిలాశాసనముల కేమి జవాబు? రాయల సమకాలిక పాశ్చాత్య చరిత్రకారుడైన న్యూనిజ్ వర్ణించిన కళింగజైత్రయాత్రా గ్రంథమున కేమి జవాబు? అన్నియు నబద్ధకల్పనలని త్రోసిపుచ్చవలసినదేనా?

## 3

కృష్ణరాయలు జైత్రయాత్ర నడపిన ఆపంచగౌడధాత్రీపదము మనుచరిత్రటీకాకారులు చెప్పినట్లు

# రాయల గయశాసనము జయశాసనమే

కనోజి మొదలయిన గంగాతీర దేశములయందు నతనిచే పరాభూతుడై యాతని కరిగాపైన శకంధరుడు ఢిల్లీ పఠాను సామ్రాజ్యాధిపతియైన సికందర్ లోడీయే యనియు వచించితిని. ఈ యభిప్రాయము సమంజసము గాదని కృష్ణరాయలు పంచగౌడధాత్రిపై గయవిజయ శాసనకాలము (క్రీ. శ. 1521 జూలై 2వ తేది మంగళ వారము)నకు ముందొకసారి దండుచేసినట్లు చెప్పగలసి యున్నది. ఏలనగా గయవిజయ శాసనము వేయించి నప్పుడు పంచ గౌడధాత్రిని పాలించుచుండినవాడు ఇబ్రాహీమ్ లోడీ. ఇతడు సికందర్ లోడీ పుత్రులలో జ్యేష్ఠుడు—క్రీ. శ. 1517 వఱకు రాజ్యముచేసి తండ్రి పరలోకగతుడైన ఇతడు పిత్ర్యమైన సింహాసనము నధిష్ఠించెను. కావున నేననుకొనునట్లు కృష్ణరాయలకోడి యతని కరిగాపైన శకంధరుడే ఇబ్రాహీమ్ తండ్రియైన సికందర్ లోడియైన పక్షమున, కృష్ణరాయల దండయాత్రయు శకంధరుని యోటమియు సికందర్ లోడీ రాజ్యకాలమున నే - అనగా క్రీ. శ 1517 నకుముందే జరిగియుండవలయును. కృష్ణదేవరాయలు క్రీ.శ 1509 జూలై యాగస్టులలో వజ్రసింహాసనాధిపతియై పట్టాభిషిక్తుడాయెను; కావున కృష్ణరాయల పంచగౌడధాత్రిపై దండయాత్రయు, సికందర్ లోడీ పరాజయమును క్రీ. శ 1509-1517 ల మధ్యకాలమున జరిగియుండవలయును. కృష్ణరాయలు ఉత్తరాశా దిగ్విజయ మొనర్చినట్లు ఆముక్తమాల్యదలో చెప్పుకొనియున్నారు.

అలుక ఘోటకఘట్టికా ఖురపుటీ
    హాళ్య స్థురాపాసిపు
న్నలు వో దున్ని చలచ్చమూగజమదా
    సారప్లుతి నీరిపు
ష్కలసస్యంబికి యేకధాటి ఖిలగా
    కట్టించితౌ దృష్టి కే
దుఃఖాన్ క్రకపాల మర్దిపహరి
    ద్భూభుజాంగల శ్రేణికిన్.

ఈ పద్యముయొక్క చతుర్థపాదమున చేర్కొన బడిన ఏదులఖానుడు విజాపురపాలకుడయిన యూసుఫ్ ఆదిల్ ఖానుడే యని శ్రీ. శే. కే. వి. లక్ష్మణరావుగారు నిరూపించియున్నారు. ఈ యూసుఫ్ ఆదిల్ ఖానుడు క్రీ. శ. 1510 లో మృతిపొందినట్లు ఫెరిస్తా చెప్పుచున్నాడు. అతని మరణము కోవిలకొండకడ సంభవించెనని బుర్హాన్ - ఇ - మాఆసిర్, తరీఖ్ -ఇ- ముహమ్మద్ కుతుబ్‌షాహి యను మహమ్మదీయ చరిత్రల వలన తెలియుచున్నది. కావున ఆముక్తమాల్యదలో చేర్కొనబడిన కృష్ణరాయల యుద్ధపహారిజైత్రయాత్ర క్రీ. శ. 1510 లో నడచెనని నిశ్చయింపవచ్చును. ఈ యుద్ధపహారిజైత్రయాత్ర పంచగౌడధాత్రిపై సాగిన దేమొ! మఱియు కృష్ణరాయలకు యవనరాజ్యస్థాపనాచార్యకను బిరుదొకటి కలదు. ఇది క్రీ.శ 1513 నుండి యాతనిశాసనములలో గలుగుటవలన తత్పూర్వమే యాత డెవ్వడో యొకమహమ్మదీయ ప్రభువును అతనిరాజ్యమున సుప్రతిష్ఠితుని గావించెననుట తెల్లము. అత డెవ్వడగునో!

కృష్ణదేవరాయలు పంచగౌడధాత్రీపతిపై నేల దండు వెడలవలసివచ్చెనో తెలియదు. కేవల కీర్తి లాలసతయే యగునా? లేక యంతకంటె ప్రబలకారణ మెద్దియేనియు నుండియుండునా? ప్రస్తుతము మనకు గల చరిత్రజ్ఞానమును బట్టి యీ ప్రశ్నలకు తగిన సమాధానము చెప్పుటకు వీలుపడదు; కాని యావి యుత్తరాపథమున హిందూ మహమ్మదీయ మతముల సంఘర్షణ తీవ్రమై జరుగుచుండినరోజులు. మహమ్మదీయ ప్రభువులు హిందూధర్మమును నిర్మూలము సేయ నిశ్చయించి తమ సంకల్పము నెఱవేర్చుకొనుటకు నిరంతరము కృషి సల్పుచుండిరి. సికందర్ లోడీ స్వమతాభిమాని, పరమత ద్వేషి. నిజమతమందలి దురభిమానము పెంపున హిందువుల నతిదారుణముగ పీడించెను. హిందూ దేవాలయములను విఱుగగొట్టించి వాని స్థానమున మసీదులను గట్టించెను. విగ్రహములను తునియలు గావించి యా తునకలను మాంసవిక్రయమునందు కసాయివారిచే తూకరాళ్లుగ వాడుకొన నియోగించెను. తీర్థములలో గ్రుంకరాదని శాసించి దేశాంతరాగతులయిన యాత్రికులను ఘోరముగ బాధించెను. స్వమతాభిమానులైన హిందువుల ననేకులను జంపించెను.3

హిందూధర్మసంరక్షకుడైన కృష్ణరాయలు సికందర్ లోడీ కృత్యములను సహింపక యతనిపై దండువెడలియుండవచ్చును. ఈ దండయాత్ర విజయవంతముగ కొనసాగెనని పెద్దనార్యుని వాక్యములవలన విదితమగుచున్నది. యుద్ధమున సికందర్ లోడీ పరాభూతుడయి హిందూమతాచారవ్యవహారాదులను దన రాజ్యమున నిరవధికముగ సాగనిచ్చుట కొడంబడి సంధి చేసికొని యుండవచ్చును. సికందర్ లోడీ గతించిన వెనుక అతని పుత్రుడు ఇబ్రాహీము పూర్వము తన తండ్రి రాయలతో జేసికొనియుండిన యొడంబడిక నుల్లంఘించి హిందువులను మరల పీడించుట కారంభింపగా కృష్ణదేవరాయలు మరల పంచగౌడధాత్రిపై దండుచేసి ఇబ్రాహీమ్‌ను యుద్ధమున పరాజితుని గావించి గయయందు విజయశాసన మెత్తించియుండును.

భారతీయ ప్రాచీన చరిత్రను గూర్చి మనకు తెలిసిన విషయ మల్పము. తత్పూర్వ మపరిచితమైన చరిత్రాంశమేదైన బయలుపడినపుడు మన యసమగ్రమైన జ్ఞానము నాధారము చేసికొని యవి యసద్ధములని చెప్పి వానికపార్థమును గల్పించుట పాడిగాదు. భావి పరిశోధన వాని సత్యాసత్యములను వెల్లడిచేయగలదు.

3. History of Medieval India.

# మన శైశవము

శ్రీ సి. నారాయణరెడ్డి

లోకవృత్త మాధ్వీక లోలుపము; తామ
సైక వాసనా దృష్టము; సమ్మద ద్వి
రేఫరూపాంతరమ్ము నా హృదయ; మిందు
చిత్రముగ నేడు శిశుత రసీభవించె.

ఇది నా గుండియ గూడున పొదిగికొనిన నూతనానుభూతి; పసగలొ
తుద రెక్కలపై బడి రాత్రి దినమ్ములు మంచుబొట్ల తిరుగజారెన్.

నాలో మయూరపింఛమ్ము చవుకళించె గగనాన మబ్బుతునకయును లేదు
నేను మిన్నంటు వెన్నెలపుల్గునైపోతి శారద శర్వరీ ఛాయ లేదు
నాలోన పద్మగంధమ్ము వాకలుగట్టె పొదుపు గుబ్బలిని కొంబూతలేదు
నేను కోకిల కుహూస్వానమ్మునైపోతి గున్నమామిడి పూతగొనగ లేదు
సృష్టినియమ తిరిక్తమై భిన్న భిన్న వాసనా ప్రగ్రహమ్ములు భాసమాన
నవ్యలోకావృతమ్ములు నాయెడంద శైశవానందపీఠసంస్థాయి యయ్యె.

ఒక కొంతసేపు సద్యోదళన్మందారములతోడ దాగుడుమూతలాడి
ఒకకొంతసేపు వాయుగుత్తులూది పట్టికొని వ్రేలుచు పల్లటీలు గొట్టి
ఒక కొంతసేపు నింగికి లేచి సురచాప ఖండమ్ముపై 'జారుబండ' లాడి
ఒక కొంతసేపు చంద్రకరండమందు వెల్గెడి వత్తికోసమై కేలుసాచి
ఇష్టఖేలా విలాస సంతుష్టభావనా తరంగిత స్వాంత సుందరుడనౌచు
జగతి నొకమల్లెపూల చెండుగ మలంచి కదలితిని శైశవామ్నాతఘటికలోన.

ఎందెగిరిన్ పూలమందలే కనిపించు లేవు మొగమ్ము చిట్లించు మ్రోల్లు
ఎటుచూచినన్ పూర్ణిమేందువుల్ రవణించు కస్సుబుస్సాడు చీకట్లు లేవు
ఎటు విన్న మత్తకేంకృతులే ప్రతినదించు లేవు పుచ్ఛములు వాల్చెడు నెమళ్లు
ఎటుగన్న చిరునవ్వులే ఇవతాళించు మనుజరూపభుజంగములు లేవు
ఒక శరత్తొక వర్షర్తువొక వసంత మను వివేచనీయావస్థ నతిగమించు
శబలిత మృదూహా సంపుటి శైశవమ్ము నను రసైకదృశాభిరామ్యునిగ జేసె.

ఏపూర్వ జనుః పుణ్య ప
రీపాక మ్మిటుల అంకురించెనొ శిశుతా
రూపకమై నా యెదలో;
ఆ పుణ్యమె నాదు జీవితాశయ మగుతన్!

# సోవియట్ రష్యాలో ఆర్థికప్రణాళికలు

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

విదేశీయ పరిపాలన ఫలితంగా కాని, నిరంతర యుద్ధాలమూలంగా కాని ఆర్థిక పురోగమనం తర తరాలుగా కుంటుపడిన అనంతరం, విముక్తి లభించిన అనేక నూతన స్వతంత్ర దేశాలకు కేవలం మూడు నాలుగు దశాబ్దాల అల్పకాలంలోనే మహత్తరార్థికాభివృద్ధిని సాధించ కలిగిన సోవియట్ రష్యా ఆర్థిక ప్రణాళికలు ఆదర్శప్రాయాలుగా నిలిచాయి. ఇండియా, చైనా మొదలైన దేశాలలో ఆ ప్రణాళికల అనుకరణానికి ప్రభుత్వాలు కృషి ప్రారంభించాయి. ఈ పరిస్థితి ఆయా దేశాలలో రెండు విభిన్నాభిప్రాయాలకు దారి తీసింది. ఒక్కటి: రష్యా ప్రణాళికల అనుకరణాన్ని బలపరచేది. మరొకటి: ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశాలలోని పెట్టుబడిదారీ విధానాన్ని బలపరచేది. మొదటి అభిప్రాయాన్ని బలపరచేవారు రష్యా, చైనాలను, రెండవ అభిప్రాయాన్ని బలపరచేవారు అమెరికా, ఇంగ్లండు దేశాలను భూతల స్వర్గాలుగా చిత్రించడం జరుగుతున్నది. ఈ సందర్భంలో ఏదో ఒక పద్ధతిని అంధానుకరణం చేసేకన్న, రెండింటి మంచి చెడ్డలను జాగ్రత్తగా పరిశీలించి, ఒక సమన్వయ మార్గాన్ని ఎన్నుకోవడం ఉత్తమం. రష్యా ప్రణాళికలను, అభివృద్ధిని, బాగోగులను స్థూలంగా పరికిద్దాం.

బోల్షివిక్ విప్లవానికి పూర్వం, జార్ చక్రవర్తుల కాలపు రష్యాలో ఆర్థిక పురోగమనానికి ఒక కార్యక్రమం, ప్రణాళిక, అంటూ ఏమీ ఉండేది కాదు. కమ్యూనిస్టు విజయానంతరం దేశానికి ఒక ఆర్థిక పురోగమన పథకం అంటూ ఏర్పడింది. మొదట్నుంచీ, జాతి ఆర్థిక శ్రేయస్సుకు మూల సూత్రం భారీ పరిశ్రమల తీవ్ర పురోగమనమని రష్యా ఆర్థిక శాస్త్ర నిపుణుల ప్రబల విశ్వాసం. రష్యా ప్రణాళికలన్నీ ఈ విశ్వాసాన్ని పురస్కరించుకొనే రచింపబడ్డాయి. వ్యవసాయంకన్నా, గ్రామీణ, లఘు పరిశ్రమల కన్నా జాతీయార్థిక పటిష్ఠత్వానికి భారీ పరిశ్రమలకే ప్రాధాన్యం ఇవ్వబడింది. ఇదొక పెద్ద వివాదగ్రస్తమైన విషయం.

ఈ మూల సూత్రం నుంచి, సోవియట్ రష్యా ప్రణాళికలను పరిశీలించే ముందు వారి ఆర్థిక రాజకీయ తత్త్వాన్ని మనసులో ఉంచుకోవాలి. వారి ప్రభుత్వానికి సర్వంసహాధికారం, ఆర్థిక రంగంలో అన్ని విషయాలపైనా, ఉంటుంది. ఉత్పాదక శక్తులన్నీ ప్రభుత్వ వశంలోనే ఉంటాయి. ఈ కారణం వలన పరిశ్రమను నడిపించడంలో ప్రభుత్వ రంగం, పెట్టుబడిదారుల రంగం, వాటి మధ్య సంఘర్షణ, ఇత్యాది విషయాలకే ప్రసక్తి ఉండదు. ఉండేదంతా ప్రభుత్వ రంగమే. అందువలన ఒక పారిశ్రామిక సంస్థకు, మరొక పారిశ్రామిక సంస్థకు స్పర్థ సంభవించడం, ఒకటి అంతరించి, రెండవది పైకి రావడం అనేది ఉండదు. పరిశ్రమల వృద్ధి ప్రభుత్వం ఎలా కావాలంటే అలా జరుగుతుంది. పెట్టుబడిదారీ దేశాలలోవలె ధరలు ఒక్కమాటుగా పెరిగిపోవడం, పాటుపోట్లు రావడం, ఈ కమ్యూనిస్టు దేశాలలో ఉండదు. తరువాత, ప్రభుత్వానికి, ప్రజలవలె లాభేచ్ఛ పరిశ్రమల స్థాపనకు ప్రధానాశయం కాదు కనుక, దీర్ఘకాలికంగా దేశానికి ప్రయోజనకరమైన పరిశ్రమల స్థాపనలో ప్రభుత్వ కృషి సాధ్యమౌతుంది. మరొక సౌలభ్య మేమంటే, పరిశ్రమలలో లభించే "మిగులు" అంతా ప్రభుత్వానికే లభ్యం కావడం వలన నూతన పరిశ్రమలను స్థాపించడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. మన దేశంలోవలె పారిశ్రామిక లాభాలపై 'పన్నులు' విధించడం ఉండదు.

రష్యా ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1927 వ సంవత్సరంలో ప్రారంభమై 1932 తో అంతమైంది. దీని తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక 1937 లో అంతమైంది. తృతీయ ప్రణాళికలో మూడవ సంవత్సరంలో రష్యా ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో మునిగిపోయింది. సమరం ముగియగానే 1946 లో చతుర్థ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమై 1951 తో అంతమైంది. 1956 తో పంచమ పంచవర్ష ప్రణాళిక ఆఖరైంది. 1959 నుండి 1966 వరకూ ప్రారంభమైన సప్తవర్ష ప్రణాళిక అమలుకు తీవ్రకృషి జరుగుతోంది.

ఈ ప్రణాళికలను గురించి మనకు విపులమైన వివరాలు లభ్యం కాక పోయినప్పటికీ, రష్యా నాయకులు చెప్పుతూన్న దాన్ని బట్టి చూస్తే ప్రణాళికలు చాలా భారీవనీ, అన్నీ అఖండమైన విజయాన్ని సంపాదించాయని గ్రహించాలి. మొదటి పంచవర్ష ప్రణాళికలోనే భారీ పరిశ్రమల స్థాపనకు అమితమైన పెట్టుబడిని ప్రభుత్వం వ్యయం చేసింది. సూక్ష్మంలో చెప్పాలంటే, మొదటి పంచవర్ష ప్రణాళిక రష్యా భవిష్యత్పారిశ్రామిక వైభవానికి పునాది అని చెప్పాలి. ఇది కేవలం పారిశ్రామిక ప్రణాళిక. ఈ ప్రణాళికా వ్యవధానికి సోవియట్ రష్యా సంపూర్ణంగా స్వదేశీయ ద్రవ్యంపైననే ఆధారపడవలసి వచ్చింది 1923-1932 అనగా, 1928 మొదలు, ప్రథమ పంచవర్ష ప్రణాళి కాంతానికి ప్రభుత్వం పెట్టిన పెట్టుబడి 112.5 వేల మిలియన్ల రూబుళ్లు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో పారిశ్రామిక అభివృద్ధికి 26.3 వేల మిలియన్ల రూబుళ్లను వ్యయపరచారు. దీనిలో 20.0 వేల మిలియన్ల రూబుళ్లు భారీ పరిశ్రమల స్థాపనకు వినియోగించారు. ఈ ప్రణాళికలో ఇనుము-ఉక్కు-బొగ్గు-విద్యుచ్ఛక్తి మొదలైన మూలపదార్థాల ఉత్పాదక పరిశ్రమలకు ప్రాధాన్యం ఇవ్వబడింది. ఈ ప్రణాళి కాంతానికి క్రొత్తగా ఒకొక్క ట్రాక్టర్ల ఉత్పత్తి అయాయి పరిశ్రమల అభివృద్ధికి కేటాయించిన సొమ్ముతో పోలిస్తే, వ్యవసాయాభివృద్ధికి కేటాయించినది బాగా స్వల్పమని చెప్పాలి. 1927-1932 లో పరిశ్రమలకు 26.3 వేల మిలియన్ల రూబుళ్ళు కేటాయించగా, 1926-1932 లో వ్యవసాయానికి, 6.8 వేల మిలియన్ల రూబుళ్ళను మాత్రం కేటాయించారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమలకు 55.9 వేల మిలియన్ల రూబుళ్లను, సాదా పరిశ్రమలకు 19.5 వేల మిలియన్ల రూబుళ్ళను కేటాయించి, వ్యవసాయానికి కేవలం సుమారు 31 వేల మిలియన్ల రూబుళ్ళను కేటాయించారు. దీనితో పారిశ్రామిక పురోభివృద్ధి స్థిరపడిందని చెప్పవచ్చును. తృతీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమల వృద్ధికి ఇంకా పెద్దమొత్తాలను కేటాయించారు. 1938-41 వరకూ, భారీ పరిశ్రమలపై 54.6 వేల మిలియన్ల రూబుళ్ళు, సాదా పరిశ్రమలపై 28.7 వేల మిలియన్ల రూబుళ్ళు వ్యయపరచారు. వ్యవసాయానికి కూడా ఎక్కువే కేటాయించినప్పటికీ, పరిశ్రమలకు కేటాయించిన దానిమీద తక్కువగానే ఉంటుంది. ఈ మూడు సంవత్సరాలకు వ్యవసాయానికి కేటాయించిన మొత్తం 36.9 వేల మిలియన్ల రూబుళ్ళు. పారిశ్రామిక రంగంలో క్రమంగా మోటార్లు, రైలింజనులు, ఓడలు, విమానాలు, మిల్లుయంత్రాలు, రసాయన ద్రవ్యాలు ఉత్పత్తిచేసే పరిశ్రమలు స్థాపింపబడి ముందంజ వేశాయి. చమురు పరిశ్రమ, శక్త్యుత్పత్తి కేంద్రాలు విస్తారంగా వృద్ధి పొందాయి. ఈ మూడు ప్రణాళికలలోను పారిశ్రామిక రంగంలో చేసిన కృషి ఫలితంగా 1940 వ సంవత్సరానికి, సోవియట్ రష్యా ప్రపంచంలో పారిశ్రామికోత్పత్తిలో ద్వితీయ స్థానాన్ని ఆక్రమింప కలిగింది. ఆరోగ్యాభివృద్ధి కూడా క్రమంగా ఎక్కువ కొనసాగింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం మూలంగా, 1940 తో మూడవ ప్రణాళికను నిలిపివేయవలసి వచ్చింది. అయితే, సోవియట్ అధికారుల లెక్కల ప్రకారం, యుద్ధ సమయంలో సహితం, మొత్తం 140 వేల మిలియన్ల రూబుళ్ళు పరిశ్రమల అభివృద్ధికి వ్యయం చేయబడినాయి. దీనిలో 120 వేల మిలియన్ల రూబుళ్ళు భారీ పరిశ్రమకు కేటాయింపబడినాయి. యుద్ధానంతరం పునర్నిర్మాణ కార్యక్రమం అతి త్వరంగా కొనసాగింది. 1946 లో చతుర్థ పంచవర్ష ప్రణాళిక అమలులోనికి వచ్చింది. దీనిలో 411.5 వేల మిలియన్ల రూబుళ్ళకు పారిశ్రామిక వ్యయం పెరిగింది! పంచమ పంచవర్ష ప్రణాళికలో ఈ సంఖ్య 454.4 వేల మిలియన్ల రూబుళ్ళకు మించింది. ఈ పది సంవత్సరాలలోను, పారిశ్రామికాభివృద్ధికి ఖర్చు చేసిన సొమ్ము, సంగ్రామానికి పూర్వం (1940 1946) చేసిన సొమ్ము కన్న అయిదు రెట్లు ఎక్కువ! ఓల్గా, నీపర్, కామా, ఇర్టిష్, అంగారా నదులమీద బ్రహ్మాండమైన జల విద్యుదుత్పాదక కేంద్రాలు నిర్మితమై, పరిశ్రమలకు కావలసిన శక్తిని సరఫరా చేయసాగాయి. ఈ నూతన నిర్మాణం ఫలితంగా, 1956 నాటికి 82 మిలియన్ల కిలోవాట్ల శక్తి ఉత్పత్తిఅయింది.

ఈ పంచవర్ష ప్రణాళికల మూలంగా పారిశ్రామిక రంగంలో రష్యా ప్రపంచంలో ఒక ఉన్నత స్థాయికి రాగలిగింది. ఉక్కు ఉత్పత్తి 1918-1950లో అయిదున్నర రెట్లు పెరిగింది. బట్టల ఉత్పత్తి 85%; జాతీయాదాయం కూడా బాగా పెరిగింది. 1940 లో జాతీయాదాయం 100 అనుకుంటే 1950 లో అది 164 కు, 1957 లో 384 కు, 1958 లో 860 కి పెరి

గింది. అదేవిధంగా పారిశ్రామికోత్పత్తి కూడా అత్యల్పకాలంలో ఉన్నత శిఖరాలను స్పృశించింది. పారిశ్రామికోత్పత్తి 100 అయితే, 1950 లో 178కు, 1957 లో 889 కి, 1958 లో 420 కి పెరిగింది. అంటే ఈ యెనిమిది సంవత్సరాల కాలంలో 4.2 రెట్లు పెరిగిందన్నమాట. 1917 వ సంవత్సరంలో ప్రపంచానికంతకూ కలిసి మొత్తం పారిశ్రామికోత్పత్తి 100 అయితే అందులో రష్యా ఉత్పత్తి కేవలం 23 మాత్రమే! అయితే, ఈ నాడు సోవియట్ రష్యా ఉత్పత్తి 20 పాళ్లకు పెరిగింది. పారిశ్రామికోత్పత్తి విషయంలో యిరోపా ఖండంలో ప్రథమ స్థానాన్ని, ప్రపంచంలో ద్వితీయ స్థానాన్ని రష్యా అలంకరించ కలిగింది.

రష్యా ఆర్థిక ప్రణాళికలలో 1958 వరకూ అమలు జరిగిన పంచవర్ష ప్రణాళికలన్నీ ఒక ఎత్తు, 1958-1965 వరకు జరుగనున్న సప్తవర్ష ప్రణాళిక ఒక ఎత్తు అని చెప్పవచ్చును. ఇంత ఘనలక్ష్యంతో కూడుకొన్న బ్రహ్మాండమైన ప్రణాళిక ఏ ఇతర దేశంలోనూ, ఎన్నడూ సిద్ధపరచబడలేదు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 21 వ సమావేశంలో ప్రధాని కృశ్చేవ్ ఈ బృహత్ప్రణాళికా స్వరూపాన్ని సూచించారు. పారిశ్రామికరంగంలో పాశ్చాత్యదేశాల నన్నింటిని అధిగమించి, రష్యా ప్రజల జీవన ప్రమాణాలను అత్యున్నతస్థాయికి పెంపొందింప చేయడమే ఈ ప్రణాళిక ఆశయం. 1958 వ సంవత్సరపు పారిశ్రామికోత్పత్తి కన్న ఈ సప్తవర్ష ప్రణాళికాంతానికి నూటికి 80-85 పాళ్ళు పెరుగుతుందని అంచనా వేశారు. అలాగే నిత్యావసరాల ఉత్పత్తి 60-65 పాళ్లు పెరగగలదు. ఇనుము ఉత్పత్తి 70 మిలియన్ల టన్నులకు, ఉక్కు ఉత్పత్తి 91 మిలియన్ల టన్నులకు ప్రణాళికాంతానికి పెరుగుతాయి. రసాయనిక ద్రవ్యాల ఉత్పత్తి ఈ ఏడు సంవత్సరాలలోను మూడు రెట్లకు పైగా పెంపొందుతుంది. చమురు ఉత్పత్తి మూడు రెట్లు పెరిగి, బొగ్గు అవసరాన్ని తగ్గించి వేస్తుంది. అణు యంత్రాంగం నెలకొల్పబడి, విద్యుచ్ఛక్తి రెట్టింపవుతుంది. వ్యవసాయోత్పత్తి నూటికి 70 పాళ్ళు పెరుగుతుంది. ఒక లక్ష ట్రాక్టర్లు అదనంగా ఉత్పత్తి అవుతాయి. పశుసంపద పెంపొంది మాంసం, పాలు, గ్రుడ్లు అన్నీ విరివిగా ప్రజలకు లభ్యమౌతాయి. రవాణా సౌకర్యాలు కూడా చాలా వృద్ధి అవుతాయి. మరొక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, ఇంత భారీ కార్యక్రమం జరుగుతూన్నా కూడా పన్నుల భారం బాగా తగ్గేటందుకు కృషి జరుగుతుందట!

1928 నుండి ఇంత బృహత్ప్రణాళికా కార్యక్రమం అమలులో పెట్టి, సోవియట్ రష్యా కొన్ని రంగాలలో ఆశ్చర్యకరమైన అభివృద్ధిని సాధించకలిగిన మాట వాస్తవమే అయినా, ఈ ప్రణాళికలు అనేక విధాలుగా విమర్శింపబడ్డాయి.

మొట్టమొదట గణింపదగిన విమర్శ, - రష్యాలో పారిశ్రామికాభివృద్ధి, వ్యవసాయాన్ని నిర్లక్ష్యంచేసి, ఆహార ధాన్యాలను ఎగుమతిచేసి ప్రజలను కష్టనష్టాలకు గురిచేయడం ద్వారా సాధ్యమైనదని. 1913-1950 మధ్య కాలంలో పారిశ్రామికోత్పత్తి 5½ రెట్లు పెరిగినప్పటికి గోధుమ ఉత్పత్తి కేవలం 16% మాత్రమే పెరిగినది. రష్యాలో 1931-1932 మధ్యకాలంలో ఆహారోత్పత్తి తగ్గిపోయి, క్షామం సంభవించినప్పుడు కూడా, ప్రభుత్వంచేసిన ఎగుమతులలో అత్యధిక భాగం ఆహార ధాన్యాలేనని ఆర్థిక శాస్త్రవేత్త ఎ. బైకోవ్ "సోవియట్ ఆర్థిక వ్యవస్థ" అన్న గ్రంథంలో పేర్కొన్నారు. రష్యాలో జరిగిన భారీ పారిశ్రామిక వ్యవస్థా నిర్మితికి అమిత వ్యయకరమైన విదేశీయ యంత్రాంగం కావలసివచ్చింది. దీనికొరకు రష్యా ఎగుమతి చేయగలిగినవి ఆహార ధాన్యాలు మాత్రమే కాబట్టి, పరిశ్రమలను ఏదోవిధంగా పెంపొందించాలనే తహతహలో రష్యా నాయకులు ఆహార ధాన్యాలను విరివిగా ఎగుమతిచేశారు. ఆ ఎగుమతి చేయడంలో కూడా, దేశంలో ఆహార సమస్య విషమంగా ఉన్న సమయంలో చేయడం తీవ్ర విమర్శలకు గురైనది. ఇంకొక విషయమేమంటే, పారిశ్రామిక వ్యవస్థా నిర్మాణానికై ఈ వ్యవసాయరంగంపై ఆధారపడడమే కాక, దానిని నిర్లక్ష్యం చేయడం కూడా జరిగింది. పండిన పంట ఎగుమతిచేయడం, ఎక్కువపంట పండేట్లు చేయడానికి కృషిచేయకపోవడం జరిగింది. ఈ నిర్లక్ష్యాన్ని మొదటినుండీ వ్యవసాయరంగానికి కేటాయించిన తక్కువ మొత్తాలు రుజువుచేస్తాయి.

నిత్యజీవితంలో మానవుని జీవనప్రమాణాలను పెంపొందించే వస్తుజాలాన్ని ఉత్పత్తిచేయడానికి మారుగా, కేవలం భారీ యంత్రాంగాన్ని తయారుచేయడానికే రష్యాప్రభుత్వం సర్వశక్తులను కేంద్రీకరించినదని మరొక విమర్శ. అనగా, ఇనుము, ఉక్కు తయారు చేయడంలో ప్రభుత్వం చూపిన శ్రద్ధ, జోళ్ళు, బట్టలు గృహాలు, కాగితాలు, సైకిళ్ళు, మొదలైన నిత్యావసరాలను ఉత్పత్తిచేయడంలో చూపలేదని విమర్శ జరిగింది.

ఇక మూడవ విమర్శ పారిశ్రామికోత్పత్తికి సంబంధించినది. పారిశ్రామికోత్పత్తిలోని అభివృద్ధి

కూడా రష్యా చెప్పుకుంటున్నంత అధికంగా లేవని అంకెలూ, వాస్తవ పురోగమనానికి తారతమ్యం చాలా ఉన్నదనీ, ఈ విమర్శ. సోవియట్ రష్యాలో 1918 నాటికి పారిశ్రామికోత్పత్తి బాగా అల్పమైనది. దానితో పోల్చిచూచినట్లైతే ఏ కొద్ది అభివృద్ధి అయినా రెండు రెట్లు, మూడు రెట్లు అధికంగా కనబడుతుందని ఈ విమర్శ సారాంశము. ఇది ఎలాగంటే, 1918 లో 100 సైకిలింజన్లను తయారుచేసి, 1940 లో 200 ను తయారుచేస్తే ఉత్పత్తి వాస్తవికంగా బాగా తక్కువే అయినా రెట్టింపు వృద్ధి కనబడుతుంది. ఈ విమర్శలో కొంత సత్యం ఉంది.

సోవియట్ రష్యా పారిశ్రామికోత్పత్తి విషయంలో ప్రపంచంలో ద్వితీయస్థానాన్ని ఆక్రమింప కలిగినప్పటికీ, ప్రజల జీవనప్రమాణాల విషయాలలో చాలా తక్కువ స్థానాన్ని పొందుతుందని మరొక తీవ్ర విమర్శ. ఈ విమర్శ మొదటి రెండు విమర్శలకు సంబంధించినదే. వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడం వలన, పారిశ్రామికోత్పత్తి కొరకు వ్యవసాయధాన్యాలను ఎగుమతి చేయడంవలన, నిత్యావసరవస్తుజాలాన్ని తయారుచేసే బట్టలు, ఉక్కు, బొగ్గు, ఇనుము మొదలైన వాటిపై దేశీయార్థిక విధానాన్ని కేంద్రీకరించడంవలన, ప్రజలకు, ఉద్యోగం అధికంగా దొరికినప్పటికీ, జీతం లభిస్తూన్నప్పటికీ వస్తువులు కరువవడంవలన జీవన ప్రమాణాలు పెంపొందడానికి అవకాశం లేకపోయింది. ఈ విధంగా, 1913-1950 లో ప్రత్తి బట్ట ఉత్పత్తిలో 75%, ఉన్ని వస్త్రాల ఉత్పత్తిలో 80%, ఆహారధాన్యాలఉత్పత్తిలో 56% మాత్రం అభివృద్ధి కలిగింది. అయితే ఈ కాలంలో జనాభివృద్ధిని కూడా మనం లెక్కకు తీసుకొంటే, పెరుగుదల అంతగా కనపడదు. ఈ కాలంలో జనాభావృద్ధి 40% పైగ ఉందని అంచనా వేశారు. అంతేకాక ద్వితీయ ప్రపంచయుద్ధ ఫలితంగా పరిస్థితి మరింత అధ్వాన్నమై, 1952 వరకు యుద్ధ పూర్వస్థితికి కోలుకోవడానికి ఎంతో కృషి అవసరమైంది. అందువలన అభివృద్ధి కుంటుపడడం కూడా జరిగింది.

మరొక విమర్శ ఏమంటే, పరిశ్రమలఅభివృద్ధి విషయంలో సోవియట్ రష్యా, బ్రిటన్, హాలెండు, నార్వే, డెన్మార్కు, స్వీడెన్ మున్నగు దేశాలతో పోల్చడం అసహజంగా వుందని. రష్యా వంటి విస్తృతమైన దేశంలో, సహజసంపదలతో తులతూగే దేశంలో అంత అభివృద్ధి జరగడం ఒక ఘనకార్యం కాదని, మనం చూడవలసినది, మనిషి ఒక్కొంటికి లభించే ఉత్పత్తి కాని, దేశానికంతకూ అయే ఉత్పత్తి కాదని, ఈ విమర్శ తాత్పర్యం.

ఈ విమర్శలను అటుంచితే, మొత్తం మీద సోవియట్ రష్యా ఆర్థిక ప్రణాళికలు ఘనమైన విజయాన్నే చూరగొన్నాయని చెప్పవచ్చును. కొన్ని రంగాలలో అభివృద్ధి లోపించిన మాట వాస్తవమే అయినప్పటికీ, ఆర్థిక విధానంలో లోటుపాట్లు కలిగినప్పటికీ, ఏ ఆశయాలతో సోవియట్ రష్యా నాయకులు ప్రణాళికలు ప్రారంభించినారో, ఆ ఆశయాల నెరవేరాయి. విశేషమైన భారీపరిశ్రమల స్థాపన ద్వారా, రష్యా ఆర్థికస్థితిని మహోన్నత స్థాయికి తేవడం వారి ఆశయం. ఈ పద్ధతిలో, వ్యవసాయరంగం కొంత కుంటుపడిన మాట నిజమే అయినా, దీర్ఘకాలికంగా విజయం సంప్రాప్తించింది.

సోవియట్ యూనియన్‌లో అంత మహత్తర విజయాన్ని సాధించిన ఆర్థిక ప్రణాళికలు, మన దేశంలో యథాతథంగా అనుకరించడం సాధ్యపడదు. రాజకీయ కారణాలను, సాంస్కృతిక కారణాలను అటుంచినప్పటికీ, ఆర్థిక దృష్ట్యాకూడా, ఆ విధమైన ప్రణాళికలు మనకు ఆచరణ సాధ్యాలు కావు. మొట్టమొదటి కారణం: మనం వ్యవసాయరంగాన్ని ఎంత మాత్రం నిర్లక్ష్యం చేయలేము. మనం వాంఛించేది వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో సమమైన అభివృద్ధి. రెండవ కారణం: మనదేశంలో పూర్తిగా ప్రభుత్వరంగం, ప్రభుత్వయాజమాన్యం కుదరదు. ఒక వంక ప్రభుత్వ రంగం, ఒక వంక పెట్టుబడిదారుల రంగం, దేశశ్రేయస్సుకు వృద్ధిఅవుతూనే ఉంటాయి. కాబట్టి, స్పర్థ, ధరల పెరుగుదల, ఆర్థికంగా పాటుపోట్లు, సంభవిస్తూంటాయి. సోవియట్ యూనియన్‌లో ఇట్లు కాక ఆర్థిక విధానం అంతా బలవత్తరమైన ప్రభుత్వ హస్తాలందే ఇమిడి ఉండడంవలన వారిష్టమొచ్చిన రీతిగా పరిశ్రమలను వృద్ధిచేయవచ్చును. మన దేశంలో అనేక సమస్యలను పరిష్కరించుకొంటూ ముందుకు పోవాలి. సోవియట్ రష్యాలో సమస్యలు ప్రక్కకు నెట్టబడి పురోగమనం జరుగుతుంది. మన ఆశయం ప్రజల జీవన ప్రమాణాల హెచ్చింపు. వారి ప్రధానాశయం పారిశ్రామికోత్పత్తి హెచ్చింపు. జనాభావృద్ధి మనదేశంలో ప్రధాన సమస్య. వారికీ సమస్య లేదు.

అందువలన వారి ఆశయాలు, వారి సమస్యలు, వారి దేశ ఆర్థికస్థితిగతులు, వారి ఆర్థిక విధానపు తత్త్వము, మనవాటికి పూర్ణంగా భిన్నమైనవి. కాబట్టి ఒక నిర్ణీత పథకంద్వారా దేశీయార్థికాభివృద్ధి జరగాలన్న భావాన్ని మాత్రం వారినుంచి మనం అలవరచుకొనడానికి వీలైనదే కాని, వారి ప్రణాళికల అంధానుసరణం మనకు తగదు. మన ప్రణాళికలు సమగ్రమైనవి, ప్రజల ఆమోదముద్రను పొందినవి అయియుండాలి. ప్రణాళికలో ప్రతి చిన్న అంశం ప్రజల ఇష్టానికి వ్యతిరేకంగా ఉండరాదు.

# ఆంధ్రప్రదేశ్ లో -

కృష్ణా బ్యారేజి, తుంగభద్ర దిగువ కాలువ, ఎగువ పెన్నా ప్రాజెక్టు, రాంపేరు స్కీము, రాళ్ళపాడు ప్రాజెక్టువంటి ఎన్నో ప్రాజెక్టుల నిర్మాణం పూర్తిఅయింది. వాటి వల్ల కొత్తగా అనేక ప్రాంతాలు ప్రయోజనం పొందుతున్నవి...

ప్రతియేటా కొత్తగా నాలుగువందల గ్రామాలకు విద్యుద్దీపాలు పెట్టబడుతున్నాయి...

నేలబొగ్గు ఉత్పత్తి 1956 లో 17 లక్షల టన్నులు. కాగా ఇప్పుడు 21 లక్షల టన్నులు దాటిపోయింది...

రాష్ట్రంలో కొత్తగా నాలుగు వైద్యకళాశాలలు, రెండు ఇంజనీరింగు కళాశాలలు, అనేక సాంకేతిక విద్యాసంస్థలు స్థాపించబడ్డవి...

సామాజికాభివృద్ధి ఉద్యమం మారుమూల గ్రామాలకు కూడా విస్తరించి దిన దినాభివృద్ధి గాంచుతూ దేశ విదేశ ప్రముఖులు ప్రశంసలను పొందుతూ వుంది...

# "ఆంధ్రప్రదేశ్" పత్రికలో -

ఈ సర్వతోముఖాభివృద్ధి కార్యక్రమం విశేషాలను సమగ్ర వ్యాసాలద్వారా, ఛాయాచిత్రాలద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకోవచ్చు. ఈ మాసపత్రిక విడి ప్రతి వెల 18 నయాపైసాలు. సంవత్సర చందా 2 రూ. లు 16 నయాపైసాలు. పత్రిక ప్రతులను ఏజెంట్లవద్దనుంచిగాని, లేదా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధాల శాఖ డైరెక్టరు కార్యాలయం, హైదరాబాదునుంచిగాని పొందవచ్చును...

ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రచురణార్థమై సాహిత్య, సాంస్కృతిక, చారిత్రక, అభివృద్ధి విషయాలను గూర్చి రచయితలు వ్యాసములను, కవితలను, కథానికలను, నాటికలను తదితర రచనలను పంపవచ్చు.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధములశాఖ,
## హైదరాబాదు

# శ్రావణాభ్రము

శ్రీ బొడ్డు బాపిరాజు

నీలాల నీటి మబ్బులు
వ్రేలిన వందాల తెనుగు వినువీథులలో
లీలాగళిత శ్రావణ
బాలా కమనీయ కైశ్యబంధము లగుచున్.

ప్రత్యూషకింశుకప్రభల కాదంబినుల్
కంజాతవనమత్త కుంజరములు
మధ్యందినాతపాంబర వలాహక పంక్తి
గంగావిహార నౌకాదళమ్ము
సాంధ్యరాగచ్ఛటా శబలితాభ్రమ్ములు
జ్వలదగ్నిహుత వీర వెలమసతులు
సాంద్రచంద్రాతపశ్యామలాంబుధరమ్ము
క్షీరాబ్ధి పర్యంక శేషశాయి
గగనమందిర కుడ్య భాగమ్ములందు
శ్రావణశుభాంగి వ్రాయు చిత్రము లనంగ
ప్రావృడంభోధర శ్రేణి పరిఢవిల్లె
భావనా రమ్యములు నభఃప్రాంగణముల.

నింగి నీలంపు మొగసాల నింద్రచాప
మేడు వన్నెల వెలిగె; మిన్నేటిపైన
దేవతాస్థాన శిల్పులు తీర్చికట్టి
నట్టి రత్నాల వంతెన యగునో ఏమొ!

మండుటెండల దగ్రమింగి మబ్బుక్రమ్మ
మబ్బులను చీల్చుకొని ఎండ మాడ్చివేసె
దాని గవ్వించి వచ్చెను వానజల్లు
ఆకసమ్ము దాగుడుమూత లాడుకొనెను.

# శ్రావణాభ్రము

అమరకన్యలు మిన్నేటి యలలఁ గోలి
మబ్బు తునకల నవరించి మడతపెట్టి
పడవలనుజేసి ఆటగా విడిచినట్లు
సాగె నొయ్యారముగ మింట జలధరములు.

వెడలె ప్రస్థాన పర్జన్యభేరి మ్రోయ
బారులందీర్చి మబ్బుల ఫౌజు మొదట
మెరపు జవరాండ్ర వాల్జూపు విరుల సరుల
తరలె పరుగుంచు చైత్రయాత్రకును మింట.

తొలుతన్ చల్లనిగాలితో చినుకు చిందుల్ విందుగా పూల వా
నలు చిల్కించిన మబ్బులే తుదకు మందల్ వందలై ముంచి తె
ప్పల తేలించె జగమ్ములెల్ల తలవంపన్; మానవుం డెంత! యం
తల యాకాశమె యాగ్రహింప నెవ రున్నారేమి గావింపగా ?

అలిగి మార్మోమువెట్టు గయ్యాళివోలె
బిగిలిపోయి అనావృష్టి బెదడవెట్టి
అలపెఱుంగని వెలయాలి వలపువోలె
ముంచివేయుచు నతివృష్టి ముప్పుతెచ్చి
కలతపెట్టకు శ్రావణ గగనలక్ష్మి!

తల పెఱుంగు పతివ్రతా తరుణివగుచు
పిలిచినంతన సమవృష్టి నిలిచి, నిన్ను
నమ్మిన తెనుంగురైతుల నెమ్మి గనుము
పంటకళ్ళమ్ము బంగారు పాదుచేసి!

# ధ్వని: వర్ణం

శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి

ఒక వ్యక్తి మాట్లాడేటప్పుడు అతనుద్దేశించింది 'ఇది', 'అదికాదు' అని ఆ భాషావ్యవహర్తల కెలా తెలుసున్నది? ఈ ప్రశ్నను గురించి నిశితంగా ఆలోచిస్తే వ్యవహర్తల జ్ఞానంలో భాషాధ్వనులకు ఒక విలక్షణమైన కట్టుబాటున్నట్లు కనిపిస్తుంది. ఉదాహరణకు 'ఉన్నావ్ఁ' 'ఉన్నావ్' అనే రెండు చిన్న వాక్యాలు తీసుకుందాం. ఈ రెండిటి మధ్య ఉన్న అర్థభేదం తెలుగువాళ్ళు ఎలా గుర్తిస్తున్నారు? రెండు వాక్యాల్లోనూ 'ఉన్నా' వరకు సమానంగానే ఉంది. అంటే ఈ భాగంవల్ల ఆ రెండిటి మధ్య ఉన్న భేదం స్ఫురించటం లేదన్నమాట. ఒక వాక్యం చివర 'వ్ఁ' అంటంవల్ల రెండో వాక్యం చివర 'వ్' అంటంవల్లనే—ఈ రెండూ ప్రత్యేక వాక్యాలని శ్రోత గుర్తిస్తాడు. ఇంకా వివరిస్తే 'ఉన్నావ్ఁ' 'ఉన్నావ్' అనే వాక్యాల మధ్య అర్థభేదం 'వఁ-వ'* ల ఉచ్చారణ భేదాన్ని గుర్తించటంవల్ల ఏర్పడ్డదని చెప్పవచ్చు. కాని 'ఉన్నావ్ఁ' అనే బదులు ఎవరన్నా 'ఉన్నామ్' అన్నారనుకోండి; రాయలసీమ వ్యవహర్తలు చాలామంది సర్కార్లల్లో 'వఁ' అనేచోట 'మ' అనే ఉచ్చరిస్తారు. ఇక్కడ 'వ' బదులు 'మ' ఉంచటం వల్ల అర్థభేదం రావటం లేదు. అంటే 'వఁ-వ'ల భేదంలాగా 'వఁ-మ'ల భేదం తెలుగులో ఏ మాండలికంలోను అర్థభేదకం కాదన్నమాట. మరి కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాలం-గాలం, చేలు-జేలు, టోకు-డోకు, తగ్గు-దగ్గు, పాట-బాట; వీటిలో ఇంత తక్కువ ఉచ్చారణభేదంతోనే అర్థభేదాన్ని కలిగించే ఇలాటి మాటల జంటల్ని పరిశీలిస్తే, ఆయా ఉచ్చారణ భేదాలు తెలుగు వ్యవహారంలో అర్థ భేదన సమర్థాలని తెలుస్తుంది. అంటే క-గ, చ-జ, ట-డ, త-ద, ప-బ ల మధ్య ఉన్న ఉచ్చారణ భేదమే (పరుష-సరళ భేదం) పైమాటల్లో భిన్నార్థ స్ఫూర్తిని కలిగింపగలది. తెలుగు మాతృభాషగా మాట్లాడేవాళ్ళందరికీ ఈ ధ్వనుల మధ్య ఉన్న భేదం గుర్తించే శక్తి వ్యవహారశిక్షణలో చిన్నప్పట్నించి సహజంగానే ప్రవర్తిస్తుంది. అలా ప్రవర్తించకపోతే ఒక అర్థం ఉద్దేశించినప్పుడు మరొకటి రాకుండా నివారించటం వీలుగాక వ్యవహారం కష్టమౌతుంది.

భాషలో ఉచ్చరించే ధ్వనులు నియత సంఖ్యాగానే ఉంటాయి. కాని అన్నిటి మధ్యా పై చెప్పినటువంటి భేదమే — అంటే భిన్నార్థస్ఫోరకమైన భేదం — ఉండి తీరాలన్న నియమమేమీ లేదు. ఇంతకుముందు చెప్పినట్లు 'వఁ—మ' ల భేదం ఇలాటిది గాదు. ఈ తరగతికి చెందిన మరికొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాళీ - ఖాళీ, కారం - ఖారం, జాజి-ఝాజి, ఈ జంటల్లోని మాటల మధ్యకూడా ఉచ్చారణ భేదం (ధ్వని భేదం) ఉంది. భౌతికంగా క-గ, చ-జల మధ్య ఉన్నది ఎలా భేదమనిపించుకుంటుందో, అదే విధంగా క-ఖ, జ-ఝ ల మధ్యది కూడా ఉచ్చారణ భేదమనే చెప్పాలి. కాని ఈ భేదం భిన్నార్థస్ఫూర్తిని కలిగించటం లేదు. అంటే క-ఖ, జ-ఝ ల భేదం, క-గ, చ-జ ల భేదంలాగా మన వ్యవహారంలో ప్రవర్తించటం లేదు. కాని సంస్కృతంలో కల-ఖల, కగ - ఖగ మొదలగుచోట్ల క-గ ల భేదం లాగానే క-ఖ ల భేదం కూడా ఆవశ్యకమైంది. ప్రాచీన తమిళంలో క-గ ల భేదం తెలుగులో లాగా భిన్నార్థస్ఫోరకం గాదు. నేటి తెలుగులో చాలామంది వ్యవహారంలో పదాది గకారానికీ, పదంమధ్య అద్విరుక్తంగా వచ్చే గకారానికీ ఉచ్చారణలో తేడా ఉంది, ఉదా. గాలి, గుర్రం, పగలు, మొగుడు. పదాది గకారాన్ని బరువుగాను, పదమధ్యంలో వచ్చే గకారాన్ని తేలిగ్గాను ఉచ్చరిస్తాం. ధ్వనిశాస్త్రపరిభాషలో మొదటిరకం 'గ'ను కంఠ్యస్పర్శం అనీ, రెండో రకం 'గ'ను కంఠ్యో

---

* ఈ విధంగా ఉదాహరించిన చోట్ల ధ్వనులు కేవల హల్మాత్రలుగానే గ్రహించాలి. 'మ' అంటే కేవల వ్యంజనం 'మ్' అనే గ్రాహ్యం. అకార సంయోజనం ఉచ్చారణకోసం మాత్రమే.

వ్యం అనీ అంటారు (చూ. అనుబంధం). ఎవరన్నా పై పదాల్లో ఉచ్చారణను తారుమారుచేసి 'గ̣'బదులు 'గ'కారం ఉచ్చరించినా అర్థసందిగ్ధత గాని, భేదం గాని ఏర్పడదు. అంటే 'గ-గ̣'ల భేదంకూడా 'వఁ-మ' 'క-ఖ'ల భేదంవంటిదే గాని 'క-గ'ల భేదంవంటిది గాదని తెలుస్తున్నది. పై చర్చ సారాంశం: ప్రతి భాషా వ్యవహారంలోని ధ్వనులన్నిటి మధ్యా ఉచ్చారణ భేదాలుంటాయి. ఈభేదాల్లో కొన్ని అర్థభేదన సమర్థాలు, కొన్ని అర్థభేదన అసమర్థాలు. భాషలో మొదటి రకం భేదాలు ప్రధానమైనవి. రెండో రకం అప్రధానమైనవి. ప్రధాన భేదాలనే వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్రధాన భేదాలు సామాన్యంగా ఉన్నట్టు కూడా వక్తలు, శ్రోతలు గుర్తించరు.

అప్రధాన భేదంగల ధ్వనులమధ్య సంబంధం భాషలో నియతంగా ఉంటుంది. ఇక్కడ 'నియతం' అంటే ఆయాధ్వనుల మధ్య ఉన్న ఉచ్చారణభేదం ఏయే పరిస్థితుల్లో ప్రవర్తిస్తుందో సూత్రీకరించి చెప్పవచ్చు. ఇంతకుముందు చెప్పిన ఉదాహరణల్లో 'వఁ-మ', 'క-ఖ' 'గ-గ̣' మొదలైనవాటిమధ్య ఉన్నది అప్రధాన భేదం అని చెప్పాం. ఈ అప్రధాన భేదం రెండు విధాలుగా ఉంటుంది.

ఒకటి, స్థానభేదాన్నిబట్టి నిర్ణయింపదగినది. నేటి తెలుగులో ముఖ్యంగా సర్కారు ప్రాంత వ్యవహారంలో వినబడే 'మ-వఁ' 'గ-గ̣'ల భేదం ఇలాంటిది. పదాదిని, ద్విత్వమైనప్పుడు, ఓష్ఠ్యవర్ణాల ముందు 'మ్-' అనే ఉచ్చారణ వినబడుతుంది. ఉదా. మాట, అమ్మ, గమ్మ, అమ్బలి; పదమధ్యంలో (అచ్చులమధ్య) అద్విరుక్తంగా వచ్చినప్పుడు, పదాంతంలోను, సంయోగంలో 'వ, స, హ'లు పరంగా ఉన్నప్పుడు, 'వ్ఁ' అనే ఉచ్చారణ వినబడుతున్నది, ఉదా. మావఁ (మామ), పుస్తకవ్ఁ (పుస్తకం). సవ్ఁవత్సరవ్ఁ (సంవత్సరం), మావ్ఁసవ్ఁ (మాంసం), సివ్ఁహవ్ఁ (సింహం). అలానే 'గ-గ̣'ల భేదం కూడా స్థానాన్నిబట్టి నిర్ణయింపవచ్చు. పదాదిని, ద్విరుక్తమైనప్పుడు, గకారోచ్చారణం, ఉదా. గాలి. దగ్గు, మొ.; అపదాదిని, అద్విరుక్తంగా వచ్చినప్పుడల్లా 'గ̣'కారోచ్చారణం, ఉదా. తగాదా, పగలు, మొగుడు. మొ. నియతంగా వినిపిస్తుంది. తెలుగులో ౘ-చ, ౙ-జల భేదం కూడా ఇటువంటిదే. తాలవ్యాచ్చులైన ఇ, ఈ, ఎ, ఏ, ఎ, ఏ లకు ముందు, చ-జలు గాను, కంఠ్యాచ్చులైన అ, ఆ, ఉ, ఊ, ఒ ఓ ల ముందు ౘ-ౙలు గాను పలుకుతుంటాం. ఉదా. చిలుక, చీర, చెంబు, చేను, కుంచె, చేప, ౘదువు, ౘాప, ౘుక్క, ౘూపు, ౘొప్ప, ౘోటు.

పైన ఉదాహరించిన 'మ-వఁ'ల జంటలో, 'మ' వచ్చేచోట 'వఁ' గాని, 'వఁ' వచ్చేచోట 'మ' గాని ఉచ్చరించం. అలాగే 'గ-గ̣'లు, 'చ-ౘ'లు, 'జ-ౙ'లు పరస్పర భిన్న పరిసరాల్లోనే ఉచ్చరిస్తాం. ఆ పరిసరాలను నియమితంగా నిరూపించవచ్చు. కాని ప్రధాన భేదంకల క-గ, చ-జ మొదలయిన ధ్వనులజంటలు పరిశీలిస్తే వాటిమధ్య ఇలాంటి నియతసంబంధం కనిపించదు. పదం మొదట, మధ్య, ద్విరుక్తమైనప్పుడు, అద్విరుక్తమైనప్పుడు కూడా 'క-గ'లు వ్యవహారంలో ఉన్నాయి, ఉదా; కాలం - గాలం, నకలు-నగలు, దక్కు-దగ్గు, 'మ-వఁ' మొ. వాటిలాగా పరస్పర భిన్న పరిసరాల్లో గాక 'క-గ'లు సమాన పరిసరాల్లోనే రావటంవల్ల వాటి సంబంధం నియతం అని చెప్పటానికి వీల్లేదు.

రెండో రకమయిన అప్రధానభేదం. పదంలో ఒకేస్థానంలో (పరిసరంలో) రెండు ధ్వనుల్లో ఏ ఒక్కధ్వని ఉచ్చరించినా అర్థభేదం లేకపోతే, ఆ రెండింటిమధ్య సంబంధం కూడా అప్రధానమైందే. ఉదా. కాళీ-ఖాళీ, కారం - ఖారం మొదలైన చోట్ల, 'క' కారం ఉచ్చరించినా, 'ఖ' కారం ఉచ్చరించినా అర్థబోధకతలో సందిగ్ధత గాని, మార్పు గాని లేదు. ఈవిధమైనఅప్రధాన భేదంలో 'క ఖ'లు 'మ-వఁ'ల లాగా పరస్పర విభిన్నస్థానికాలు గాక, ఏకస్థానికాలు గానే ఉన్నాయి. 'కాలం-గాలం'లో కూడా క-గలు ఏకస్థానంలో మారుతున్న ధ్వనులైనా ఆ మార్పువల్ల అర్థభేదం ఏర్పడుతున్నది గాబట్టి, ఆభేదం ప్రధానమైనది. ఆ భేదంవల్ల 'కాలం-గాలం' రెండు భిన్నపదాలుగా గుర్తిస్తున్నాం. 'క-ఖ'ల భేదంవల్ల అర్థభేదం రావటంలేదు, కాబట్టి 'కాళీ-ఖాళీ' ఏక పదంగానే గుర్తిస్తాం.

ఇకముందు ప్రధాన భేదాన్నే 'భేదం' అని వ్యవహరిద్దాం. ఇప్పుడు వర్ణస్వరూపాన్ని రెండు మూడు పద్ధతుల్లో నిర్వచించవచ్చు. వాగ్వ్యవహారంలో అర్థ భేదనసమర్థమైన కనిష్ఠాంశాన్ని

'వర్ణం' అనవచ్చు. క, గ, చ, జ మొదలైనవి వర్ణాలు. ఇవి ఎలా అర్థభేదక సమర్థాలో ఇదివరకు చూపించేం. కనిష్ఠాంశం అనటంవల్ల 'క' అన్నదానిలోని ఏకదేశానికి భాషలో అర్థభేదాన్ని కలిగించే శక్తి లేదు. అంటే దాన్లో ఏకదేశం ఎలా ఉంటుందనవచ్చు 'క' అన్న ఉచ్చారణ, జిహ్వామూలం, మృదుతాలువును తాకి లోపలినించి వచ్చే శ్వాసను క్షణకాలం నిరోధించి విడవటంవల్ల నిష్పన్నమవుతున్నది. ధ్వనిశాస్త్ర పరిభాషలో స్థానకరణాలను బట్టి దీన్ని 'కంఠ్యం' లేక 'జిహ్వామూలీయం' అనీ, ప్రయత్న భేదాన్ని బట్టి 'అఘోష (పరుష) స్పర్శ'మనీ అంటారు. పైన నిరూపించిన అన్నప్రయత్న సర్వస్వంవల్ల 'క' కారోచ్చారణం నిష్పన్నమవుతున్నా ఆ ప్రయత్నభాగాలకు (ఏకదేశ మాత్రాలకు) వ్యష్టిగా భాషలో అస్తిత్వం లేదు. అందుకనే 'క' కారం భాషలో కనిష్ఠ భేదకాంశం అన్నాం. తార్కిక భాషలో ప్రతి భేదకాంశమూ తానొక భేదమవుతుంది కాబట్టి, వర్ణం భాషలో 'కనిష్ఠ భేదం' అని ఇంకా సంగ్రహించి చెప్పవచ్చు. మిగిలినవాటన్నిటికంటే భిన్నమైనది భేదం. భాషలోని ప్రతివర్ణమూ, మిగిలిన వర్ణాలన్నిటినించి వర్తించటానికి ప్రత్యేకంగా ఉండాలని తాత్పర్యం అయితే అప్రధానమైన భేదం కల ధ్వనులను ఈ నిర్వచనలోకి ఎలా సరిపెట్టడం అనే ప్రశ్న వస్తుంది. అన్యోన్య ప్రధానభేదం లేని ధ్వనులన్నీ కలిసి ఏకైక భేదంగానే భాషలో ప్రవర్తిస్తాయి. పైన నిరూపించిన 'మ-వఁ', 'గ-గ' 'చ-చ' మొదలైన జంటల్లో ఒక్కొక్కటి ఒక్కొక్క వర్ణం. దీన్ని బట్టి వర్ణం అంటే ఉచ్చరితధ్వని మాత్రమే కాదని విశదమౌతుంది. అందుకనే కనిష్ఠభేదం అన్నాం. ఉచ్చరించిన ధ్వని ప్రతిదీ ఏదో ఒక వర్ణానికి చెందుతుంది గాని, ప్రతివర్ణమూ ఒక్కొక్క ధ్వని మాత్రానికి గ్రాహకం కాదు. ఇప్పుడు 'వర్ణం' అన్న పదానికి నిర్వచనం మరికొంత ప్రపంచించవచ్చు. అప్రధాన భేదం కలిగి, అర్థబోధనలో ఏకైక కనిష్ఠ భేదంగా వర్తించే ధ్వనుల సమూహం వర్ణం అనవచ్చు. ఒకే వర్ణానికి చెందిన ధ్వనులను, కొంతవరకు ప్రాచీనుల పరిభాషను బట్టి 'సవర్ణా'లని చెప్పవచ్చు. నేటి తెలుగులో 'మ-వఁ' 'గ-గ', 'చ-చ' మొదలైనవి సవర్ణాలు. సవర్ణాలమధ్య ఉచ్చారణ సాదృశ్యం ఉండాలి. అవి భిన్న పరిసరాల్లో వచ్చేవిగా నైనా ఉండాలి, లేక ఒకే పరిసరంలో పర్యాయవృత్తిగా వచ్చినా అర్థభేదకాలు గాకుండా (స్వతంత్ర పరివర్తనీయాలుగా) నైనా ఉండాలి.

రెండువర్ణాల మధ్య మనం గుర్తించే భేదం – అంటే రెండు సవర్ణసమూహాలమధ్యనుండే భేదం – ఉచ్చారణధర్మాల్లోని భేదంవల్ల నేర్పడుతున్నది. ఉదా. సవర్ణాలైన 'చ-చ' లు ఒక వర్ణం, 'జ-జ'లు మరొక వర్ణం (చూ. వెనుకటి పేరా). 'చ-చ' ల మధ్య ఉచ్చారణలో కొన్ని పోలికలున్నాయి; రెండూ స్పృష్టాలు, రెండూ శ్వాసవద్ధ్వనులు, స్థానకరణాల్లో మాత్రం చిన్న తేడా ఉంది. 'చ' కు స్థానం దంతమూలం, కరణం నాలుక కొన; 'చ' కు స్థానం కఠిన తాలువు, కరణం జిహ్వామధ్యం; అలాగానే 'జ జ'లు కూడా స్పృష్టాలు, కాని ఈ రెండూ నాదవద్ధ్వనులు, చకు లాగానే జకు, 'చ' కు లాగానే 'జ' కు స్థానకరణాలుంటాయి. 'చ-చ' లకు 'జ జ' లకు సాదృశ్యం, స్థానకరణాల్లో ఉంది. భేదం, మొదటి జంట శ్వాసవంతం, రెండో జంట నాదవంతం; ఈ రెండు జంటల్ని రెండు భిన్నవర్ణాలుగా గుర్తింపజేసే ధర్మం – శ్వాసనాదభేదం. 'చ-చ' ల మధ్యనూ స్థానకరణాల్లో భేదం ఉన్నా అవి భిన్నవర్ణాలు కావటం లేదు; చ-జ-ల మధ్య స్థానకరణాల్లో సమానత్వం ఉన్నా అవి ఒకేవర్ణంలో భాగాలు కావటం లేదు. అంటే రెండు జంటలకూ భిన్న వర్ణత్వం ఆరోపించే ఉచ్చారణ ధర్మం, శ్వాస నాద భేదం కాని, దంతమూలీయ తాలవ్యభేదం కాదు. 'చెల్లు-జల్లు' అన్నప్పుడు ఇవి రెండూ భిన్న శబ్దాలు కావటం 'చ-జ'ల భేదాన్ని బట్టే. అలాగే 'చీడ-జీడి' అన్నప్పుడూ. 'చ-చ' ల మధ్య ఉన్న స్థానకరణభేదం అప్రధానం కాబట్టే ఎవరన్నా 'చ' అనవలసినచోట, పొరపాటువల్లనో, బుద్ధిపూర్వకంగానో 'చ' అన్నా అర్థసందిగ్ధత ఏర్పడదు, 'మాడు' అన్నది 'మాడు' అంటే ఏదో వింతగా అనిపించవచ్చుగాని అర్థభేదం కలగదు. అందువల్ల వర్ణాలకు భిన్నత్వం చేకూర్చే ఉచ్చారణ ధర్మాలు, ఏ రెండు వర్ణాలమధ్య కనీసం ఒకటైనా ఉంటుంది. సవర్ణాలమధ్యనుండే

ఉచ్చారణ భేదాలు భాషలో అప్రధానాలు. భిన్న వర్ణాల (సవర్ణసమూహాల) మధ్యనుండే ఉచ్చారణ భేదాలు ప్రధానాలు. తెలుగులో శ్వాసనాదభేదం ప్రధానమైంది. అందువల్లనే, క-గ, చ-జ, ట-డ, త-ద, ప-బ మొదలైనవి భిన్నవర్ణాలుగా గుర్తిస్తాం. కాని స్పర్శోష్మ భేదం 'గ-ఖ', 'X-గ'ల మధ్య నున్నది అప్రధానం. 'క-గ'లు రెండూ కంఠ్యాలు, రెండూ స్పర్శలు, కాని ఒకటి శ్వాసవంతం (అఘోషం), రెండోది నాదవంతం(ఘోషం, లేక సరళం). శ్వాసనాద భేదం, ఈ రెంటిమధ్యా కనిష్ఠం. 'క ప'లు కూడా భిన్నవర్ణాలు. ఇవి రెండూ, స్పర్శలు పరుషాలు. కాని ఒకటి కంఠ్యం, మరొకటి ఓష్ఠ్యం. ఇక్కడ వర్ణ భేదకత ఉచ్చారణస్థానకరణాల్లోని భేదాన్ని బట్టి వచ్చింది. ఓష్ఠ్యత్వం, కంఠ్యత్వా వర్ణభేదక ధర్మాలన్నమాట. 'క-స'లు కూడా భిన్నవర్ణాలే. రెంటికి మధ్య ఉన్న ఉచ్చారణ భేదం ఇక్కడ గరిష్ఠం. 'క'- స్పర్శం, కంఠ్యం, శ్వాసవంతం. 'ర'-దంతమూలీయం. రేఫ (కంపితం) నాదవంతం. ఈ విధంగా వర్ణాలను పృథక్కరించి గుర్తింపజేసే ఉచ్చారణ విశేషాలను (వర్ణ) భేదక లక్షణాలని చెప్పవచ్చు. వీటినే ఇంగ్లంలో Distinctive features అంటారు. ప్రతివర్ణాన్నీ మిగిలిన వర్ణాల నుంచి వేరుచేసే భేదక లక్షణం-ఒకటిగాని అంతకంటె ఎక్కువగాని ఉండవచ్చు. అటువంటివి స్థానకరణ ప్రయత్నాలను బట్టి ప్రతి భాషలోను నియతిసంఖ్యాకంగా నిరూపించవచ్చు. ఈ విభజన ప్రకారం కొన్ని భేదక లక్షణాలసమూహం వర్ణం అని నిర్వచించవచ్చు. వర్ణాలను వేరుచేసేవే భేదకలక్షణాలుగాని సవర్ణాల మధ్యనున్న ఉచ్చారణ భేదాలు భేదక లక్షణాలనిపించుకోవు. నేటి తెలుగులో శ్వాసవత్త్వం నాదవత్త్వం, అనునాసిక్యం, స్పర్శత్వం, రేఫత్వం మొదలగువి కొన్ని ప్రయత్నాల్లో భేదకలక్షణాలు. స్థానకరణాల్లో, ఓష్ఠ్యత్వం, దంత్యత్వం, మూర్ధన్యత్వం, కంఠ్యత్వం మొ.వి కొన్ని భేదకలక్షణాలు. అచ్చుల్లో సంవర వివారాలు, కంఠ్య తాలు స్థానాలు కొన్ని భేదకలక్షణాలు. కాని తెలుగులో అచ్చుల్లో 'అనునాసిక్యం' భేదకలక్షణం గాదు. ఫ్రెంచి భాషలో సానునాసిక నిరనునాసిక స్వరభేదం అర్థభేదసమర్థమౌతుంది. తెలుగులో అలా లేదు. సంస్కృతంలో అల్పప్రాణ మహాప్రాణాలు భేదకలక్షణాలు. అందుకనే, క, ఖ, ప, ఫ మొదలైనవి భిన్నవర్ణాలు. ఇంగ్లంలో అల్పప్రాణ మహాప్రాణ ధ్వనులు సవర్ణాలు, పదాదివ p, t, k వర్ణాలు, pin, kin, tin, మొ. చోట్ల ph-, kh , th-, గాను, 's' వర్ణానికి పరంగా వచ్చినప్పుడు spin, skin, sting, మొ. చోట్ల అల్పప్రాణాలు గాను ఉచ్చరిస్తారు. ఈ భేదం పరసవర్ణ భేదాన్ని బట్టి నిర్ణయింపదగినది గాబట్టి అప్రధానమైనది.

ఒక భాషలోని వర్ణసమామ్నాయం, ఆ భాషలోని కనిష్ఠ భేదాల మొత్తం. భాషావ్యవహారంలో వైవిధ్యం ఈ భేదాల వివిధ సంయోజన పద్ధతులవల్లనే ఏర్పడుతున్నది. రెండు అభిప్రాయాల భేదం-ఏకైక భేదంవల్లగాని, అనేక వర్ణభేదంవల్లగాని ఏర్పడవచ్చు. ఈ వర్ణభేదాలు 'కాలం-గాలం,' మొ. వాటిల్లోలాగా పదాదినేగాక భిన్నస్థానాల్లో కూడా ఉండవచ్చు. ఉదా: కాడి-గాడి, కాడి-కడి, కాడి-కాని, కాడి-కాడు. ఈ నాలుగు జతల్లోనూ వర్ణభేదాల స్థానం క్రమంగా మార్పటంవల్ల భిన్నశబ్దాలేర్పడ్డాయి. మొదటి జతలో 'క-గ'ల భేదంవల్ల, రెండో జతలో 'ఆ-అ'ల భేదంవల్ల, మూడో జతలో 'డ-న'ల భేదం వల్ల, నాల్గో జతలో 'ఇ-ఉ'ల భేదంవల్ల ఆయా శబ్దాల మధ్య భిన్నార్థస్ఫూరత ఏర్పడుతున్నది. పై ఉదాహరణలన్నిటిలోను ఏకైక వర్ణభేదం వల్లనే అర్థభేదం ఏర్పడ్డది. కాని రెండు శబ్దాల మధ్య భేదం, అనేక వర్ణకల్పితంగా కూడా ఉండవచ్చు, ఉదా:- కాడి-మేడి, కాడి-జోలి, కాడి-మేకు; ఈ జంటల్లో రెండు, మూడు, నాలుగు వర్ణాలు క్రమంగా భేదించటంవల్ల భిన్న శబ్దాలు ఏర్పడుతున్నాయి.

వర్ణాలను స్వరాలు (అచ్చులు), వ్యంజనాలు (హల్లులు) అని ప్రాచీనులు విభజించారు. కాని పైచెప్పిన బట్టి భాషలో ప్రతి కనిష్ఠ భేదకాంశమూ వర్ణమౌతుంది కాబట్టి మరికొన్ని రకాల భేదాలను కూడా వర్ణసమామ్నాయంలో చేర్చాలి. అవి కాల పరిమితి (దీర్ఘత), ఊనిక, స్వరం, విరామం, మొదలైనవి. తెలుగులో హ్రస్వాచ్చుల ఉచ్చారణకు, దీర్ఘాచ్చుల ఉచ్చారణకు కాలపరిమితిలోనే భేదం. స్థానకరణాలు సమానాలే. 'పకు-పాకు' అన్నచోట 'దీర్ఘత' అర్థభేదకం గాబట్టి దాన్ని కూడా వర్ణమునే వ్యవహరించాలి. ఒడియా, బెంగాలీ మొ. ఔత్తరాహ భాషల్లో హ్రస్వదీర్ఘ భేదం అప్రధానం. పరిసర భేదాన్ని బట్టి హ్రస్వదీర్ఘాలు సవర్ణాలు. ఊనిక భేదం

వల్ల అర్థభేదం కలిగే భాషలు లెక్కకు చెందిన ఆంగ్లం. 'permit' అన్న మాటలో మొదటి అచ్చుపై ఊనిక నిలిస్తే విశేష్యంగానూ, రెండవ అచ్చుపై ఊనిక నిలిస్తే క్రియగానూ ఆంగ్ల భాషా వ్యవహారంలో ఉంది. 'Black bird' అంటే ఒక పక్షి విశేషం. 'Black bird' అన్నప్పుడు నల్లని పక్షి అని అర్థం. ఇట్టిచోట్ల స్వరవ్యంజన భేదం లేకపోయినా ఊనికల భేదంవల్ల అర్థభేదం ఏర్పడుతున్నది. కాబట్టి ఊనికలు కూడా ఆంగ్లంలో వర్ణాలే. వైదిక సంస్కృతంలో ఉచ్చనీచ స్వరితాలు (high, low, mid) అని మూడురకాల స్వరాశ్రయవర్ణాలు (pitch phonemes) ఉన్నాయి. తెలుగులోను స్వరవర్ణాలున్నాయనే చెప్పాలి. కాని ఇవి వాక్యస్థితిలో ప్రవర్తిస్తాయి గాని, పదస్థితిలో లేవు. అంటే రెండు పదాల భేదం స్వరాశ్రయం గాదు. రెండు వాక్యాల మధ్య భేదం స్వరభేదాన్ని బట్టి నిర్ణయించవచ్చు. ఉదా: 'అది?' 'అది గాదు ఇది.' 'అది?' అన్న వాక్యంలో చివరి స్వరం క్రమంగా తక్కువ స్థాయినించి ఉచ్చస్థాయికి సాగుతుంది. రెండవ వాక్యంలో స్వరం ఉచ్చస్థాయినించి నీచకు దిగుతుంది. ప్రశ్నార్థక వాక్యాన్ని సూచించే స్వరం Λ అని, నిర్దేశార్థక వాక్యాంతాన వచ్చే స్వరం V అని గుర్తు పెట్టుకోవచ్చు. స్వరభేదాల స్థాయిని 1, 2, 3 అంకెలతో నీచ స్వరితోచ్చాలని ఉత్తరోత్తర ప్రకర్షగా నిరూపించవచ్చు. పైన చెప్పిన రెండు వాక్యాల స్వరభేదాలు నిరూపించటానికి వినియోగించే కనిష్ఠ స్థాయి భేదాలను కూడా వర్ణాలని పిలవచ్చు. వ్యవధానాలూ, విరామాలూ కూడా భాషలో అర్థభేదకాలే. ఉదాహరణకు ఈ క్రింది రెండువాక్యాలు చూడండి. "వాడు తెలిసీతెలేనట్లు మాట్లాడేడు" "వాడు తెలిసీ, తెలేనట్టు మాట్లాడేడు." ఈ రెండు వాక్యాల మధ్య ఉన్న అర్థభేదం, మొదటి వాక్యం 'తెలిసీ తెలేనట్టు' అని అవ్యవహితంగా ఉచ్చరించటంవల్లను, రెండో వాక్యంలో 'తెలిసి, తెలేనట్టు' అని వ్యవహితోచ్చారణవల్లను ఏర్పడ్డది. అందువల్ల వ్యవధానాలు కొన్నిచోట్ల నిలపటం కొన్నిచోట్ల నిలపక పోవటం భేదకలక్షణంగా అన్నిభాషల్లోనూ ఉంటుంది.

## వర్ణం - లిపి

భాషలో వర్ణాలకే లిపిచిహ్నాలుండాలి గాని సవర్ణాలకు గుర్తులు పన్లేదు. సవర్ణాలన్నీ ఏకైక భేదంగా వర్తిస్తాయి కాబట్టి వాటన్నిటికీ ఒకే లేఖన చిహ్నం చాలు. ప్రతివర్ణభాగాలయిన ధ్వనుల (సవర్ణాల) ఉచ్చారణ స్థానభేదాన్ని పట్టి నిర్ణయించటానికి సాధ్యమౌతుంది గదా! వర్ణానికి పెట్టుకొనే గుర్తు కేవల సంకేతం మాత్రమే కాబట్టి అందులో సౌలభ్యానికే ప్రాధాన్యం గాని ఉచ్చారణతో సంబంధం లేదు. సంప్రదాయాన్ని బట్టి మనం ఈనాటి తెలుగులో సవర్ణాలయిన 'మ-వఁ'లకు /మ/ అనీ, 'చ-చొ'లకు /చ/ అనీ, 'జ-జొ' లకు /జ/ అనీ, 'న-ఙ' లకు /న/ అనీ, గుర్తులు పెట్టుకోవచ్చు.* కాని /మ/ ధ్వని మాత్రం కాదనీ, కొన్ని భేదకలక్షణాల సమాహానికి కొన్ని సవర్ణాలకు సంకేతం మాత్రమే అనీ గ్రహించాలి. ప్రస్తుతం తెలుగు లిపిలో /ఫ f/ వర్ణాలకు గుర్తులేవు ఉదా: "ఫేషు, కాఫీ." ఈనాటి శిష్టుల వ్యవహారంలోను 'ఫ-ఫ' లను వేరుచేసే భేదకలక్షణం ఉచ్చారణలో లేదు. రెంటిని 'ఫ' గానే ఉచ్చరిస్తాం. రెండూ ఒకవర్ణంగానే ప్రవర్తిస్తున్నాయి. అర్థభేదం సందర్భాన్ని బట్టి మాత్రమే తెలుసుకుంటాం. ఉదా: "ఈపద్యానికి అర్థమేమిటి?" "ఆవగింజలో అర్ధభాగం కాలేదు" సంస్కృతంలో వేరైన 'అర్థ అర్ధ' శబ్దాలకు తెలుగులో భేదం పోయింది. ఇలాంటి చోట్ల ఒకే సంకేతం చాలు. ప్రాచీనాంధ్రంలో 'ఱ-ర' లు ప్రత్యేకవర్ణాలు. నేటి తెలుగులో ఇవి సవర్ణాలు. ద్విరుక్తమైనప్పుడు 'ఱ' కారోచ్చారణం, అన్యత్ర 'ర' కారోచ్చారణం వినిపిస్తుంది, గొఱ్ఱె, మారటం; అందువల్ల ఈ రెండు సవర్ణాలను /ర/ గుర్తుతోనే సూచించవచ్చు. /గొర్రె/, /మారటం/. భాష మారుతున్నప్పుడు ముందున్న వర్ణాలు కొన్ని జారిపోతుంటాయి. కొత్తవర్ణాలు అన్యభాషాసంపర్కంవల్ల వచ్చి చేరుతుంటాయి. సమాజంలో వచ్చే మార్పులతో పాటు వ్యక్తులు మారుతున్నట్లే, చరిత్రలో వచ్చే మార్పులతోపాటు ప్రతి భాషలోని వర్ణసమామ్నాయం కూడా మారుతుంటుంది. ఆ మార్పులు లేఖన చిహ్నాల్లో చూపకపోవటంవల్ల, చదువుకొనేటప్పుడు కొన్ని అర్థ సందిగ్ధతలు ఏర్పడుతుంటాయి.

---

* వర్ణాలను ధ్వనులనుంచి వేరుగా సూచించటానికి ఇకముందు / / గుర్తులు ఇరువైపులా ఉపయోగింపబడతాయి.

# ధ్వని: వర్ణం

## ప్రాచీనులమతం :

పాణిన్యాదులు భాషాశాస్త్రవేత్తలు. ఆధునిక భాషాశాస్త్రానికి పునాదులు వీరి రచనలే. ఇంతదాకా చేసిన ఈ వాదం వీరి రచనల్లో లేక పోయినా, దానికి కావలసిన భావ బీజాలు మాత్రం అక్కడ ఉన్నాయి. సంస్కృత భాషావ్యాకర్తలు వర్ణశబ్దాన్ని కేవల లేఖన చిహ్నం అనే అర్థంలో ఉపయోగించలేదు. వారు విధించిన వర్ణాగమాదేశలోపాదికార్యాలు ఉచ్చారణ భేదాలకు చెందినవి గాని లిఖిత చిహ్నాలకు గాదు. అప్రధానోచ్చారణ భేదాలున్నచోట వాటిని ప్రత్యేక వర్ణాలని వారు వ్యవహరించలేదు, ఉదా. 'యవ'లకు భిన్న పరిసరాల్లో వచ్చే లఘ్వలఘూచ్చారణ భేదం అలాంటిది. పాణిని ప్రధానంగా అచ్చులకే 'వర్ణ' శబ్దం ఉపయోగించాడని, అందులోను, స్థానకరణతుల్యత ఉన్న అచ్చులన్నీ ఏకవర్ణగ్రాహ్యాలుగానే పరిగణించాడని విమర్శకుల అభిప్రాయం. 'ఇ' వర్ణం అంటే హ్రస్వదీర్ఘప్లుత భేదాలుకల 'ఇ, ఈ, ఇ3' లకు గ్రాహకం. కాని పాణిని ప్రతి కనిష్ఠభేదానికీ 'కార' ప్రత్యయం చేర్చి వ్యవహరించాడు. ఇకారం, ఈకారం, చకారం, కకారం, ఇత్యాది. కాని, ఈవర్ణం, చవర్ణం, మొ. వ్యవహృతి అష్టాధ్యాయిలో లేదని పండితుల నిర్ణయం.

ఆ తర్వాత వ్యాకరణ సంప్రదాయంలో 'వర్ణ - కార' శబ్దాలు పర్యాయాలుగానే ప్రయోగించారు. కాని వర్ణసమామ్నాయంలో ఉపదిష్టాలైనవి చాలవరకు కనిష్ఠ భేదాలేగాని ఉచ్చరిత ధ్వని సర్వస్వం గాదు.

ఇక సవర్ణాలంటే తుల్యాస్య ప్రయత్నాలు కలవి అని ప్రాచీనులమతం. ఈ వ్యాసంలో అప్రధాన భేదం కల వర్ణ ధ్వనులను 'సవర్ణా' లని పిలవటానికి ఆధారం చిన్నయసూరిగారి సూత్రం 'దంత్యతాలవ్యంబు లయిన చజలు వర్ణంబులు' (బాలవ్యా. సంజ్ఞా. 7) మాత్రమే. కాని సూరిగారి అభిప్రాయం అటు ప్రాచీనుల మతానికీ చెందదు, ఇటు నవీనుల మతానికీ చెందదు. తుల్యాస్య ప్రయత్నం చ - ౘ, జ-ౙల మధ్యే కాదు, ౘ - ౙ, చ - జల మధ్య కూడా ఉంది గదా! పోతే, 'చ-ౘ' లు ఒక వర్ణం 'జ-ౙ'లు ఒక వర్ణం అని వారి అభిప్రాయం అయితే, వర్ణ సమామ్నాయంలో "తెనుఁగునకు వర్ణములు ముప్పదియారు" అన్న సూత్రంలో చ-ౘ, జ-ౙలు నాలుగు భిన్న వర్ణాలుగా పరిగణించారు. ప్రౌఢ వ్యాకరణ కర్త కూడా వీటిని నాలుగువర్ణాలుగానే చెప్పారు. సంజ్ఞా. సూ. (1).

ఈ వ్యాసంలో 'ధ్వని' అంటే ఉచ్చరితమైన భాషాధ్వని. 'వర్ణం' అంటే భాషా నిర్మాణక్రమంలో కనిష్ఠ భేదం, లేక భేదకాంశం. 'సవర్ణం' అంటే వర్ణగత ధ్వని. ఆంగ్లంలో వీటిని క్రమంగా Phone, Phoneme, allophone అంటారు.

## అనుబంధం

భాషాధ్వనుల ఉత్పత్తిక్రమాన్ని గురించి చెప్పే శాస్త్రాన్ని ధ్వనిశాస్త్రం లేక శిక్ష అంటారు. సంస్కృత ధ్వని నిరూపణం చాలా శాస్త్రీయంగా శిక్షల్లోనూ, ప్రాతిశాఖ్యల్లోనూ కనిపిస్తుంది. పారిభాషిక పదాలు చాలవరకు మన ప్రాచీనులవే ఉపయోగించుకున్నా వాటి అన్వయవివరణాల్లో ఆధునిక ధ్వని శాస్త్రానుగుణంగా కొన్ని మార్పులు చేసుకోవాలి. పెదవులు మొదలు కాకలకం దాకా ఉన్న ప్రదేశాన్ని ఆస్యం లేక వక్త్రం అంటారు. ఉచ్చారణావయవాలన్నీ ఈ భాగంలోనే ఉన్నాయి. ఓష్ఠాలు (కిందిది, పైది), జిహ్వ (అగ్రం, మధ్యం, మూలం). దంతాలు, దంతమూలం (పై పండ్ల చిగుళ్ళు), తాలువు (పూర్వభాగం, మూర్ధం), అంగిలి (మృదు తాలువు), సప్తపథ, కాకలకం లేక స్వరపేటిక (నాద తంత్రులు, Vocal chords), ఇవన్నీ ధ్వనుల ఉత్పత్తికి కారణాలైన వక్త్రాంగాలు. వీటిల్లో కొన్ని స్థానాలు, కొన్ని కరణాలు; కదలిక గల అవయవాన్ని కరణం అనీ, లేనిదాన్ని స్థానం అనీ చెప్పుకోవచ్చు. సాధారణంగా క్రింది పెదవి, నాలుక (కొస, మధ్య, మొదలు) కరణాలు. పై పెదవి, పై దంతాలు, దంత మూలం, తాలువు, అంగిలి - ఇవి స్థానాలు. ఊపిరితిత్తులనుంచి నిర్గమించే గాలి కంఠబిలం మొదలు పెదవులు దాకా ఉన్న ప్రాంతంలో పొందే మార్పును ప్రయత్నం అంటారు. స్థానకరణ ప్రయత్నభేదాల్ని బట్టి ధ్వనులను విభజించవచ్చు.

### స్థానకరణాలనుబట్టి చేసే విభజన :

ఓష్ఠ్యాలు—స్థానం : పై పెదవి; కరణం : కింది పెదవి.

దంతోష్ఠ్యాలు—స్థానం : పై దంతాల వెనక భాగం; కరణం : కింది పెదవి.

దంత్యాలు—స్థానం : పైపంటిల వెనక భాగం; కరణం : నాలుక కొసగానీ అంచుగాని.

దంతమూలీయాలు—స్థానం : దంతమూలం; కరణం : నాలుక కొసగాని అంచుగానీ.

తాలవ్యాలు—స్థానం, కఠిన తాలువు; కరణం : నాలుక ముందు లేక మధ్యభాగం.

మూర్ధన్యాలు—స్థానం : కఠిన తాలువు చివరి భాగం, దీన్నే 'మూర్ధం' అంటారు; కరణం: ముడత వేసిన నాలుక కొస.

కంఠ్యాలు—స్థానం : అంగిలి లేక మృదుతాలువు; కరణం : జిహ్వామూలం.

కంఠమూలీయాలు—స్థాన కరణాలు : నాద తంత్రులు.

ప్రయత్నాలు కొన్ని సామాన్యాలు, కొన్ని విశిష్టాలు. విస్తృతప్రయోజనం కల ప్రయత్నాలు సామాన్యాలు. అవి శ్వాస, నాద, అల్పప్రాణ, మహాప్రాణాలని నాలుగు విధాలు. నాదతంత్రులను కంపింపజేయకుండా నిర్గమించే ఊపిరి 'శ్వాసం'. నాదతంత్రులను కంపింపజేస్తూ వెలువడే ఊపిరి 'నాదం'. శ్వాసం వినబడదు, నాదం వినబడుతుంది. నాద నిర్గమనం జరిగేటప్పుడు రెండు చెవులూ మూసుకుంటే 'గుయ్'మనే ధ్వనికంపన వినవచ్చు. శ్వాసనిర్గతితో అది వినిపించదు. నిర్దిష్టకాలంలో స్వాభావికోచ్చారణకు వెలువడే గాలి 'అల్పప్రాణం', అంతకంటే ఎక్కువ ఒత్తిడితో వెలువచ్చిన ఊపిరి 'మహాప్రాణం.' అచ్చుల్లో వచ్చే ఒక ప్రయత్నభేదం అనునాసిక్యం. ఇది నాసికారంధ్రాల ద్వారా నాదవంతంగా గాలిని నిర్గమింపజేయటం.

ఇక విశిష్టప్రయత్నాలవల్ల ఏర్పడే ధ్వని భేదాలు : గాలిని కొంతకాలం స్థానకరణాలు నిరోధించి విడవటంవల్ల ఏర్పడే ధ్వనులు - స్పర్శాలు; స్థానకరణభేదాలనుబట్టి ఓష్ఠ్యస్పర్శాలు, దంత్యస్పర్శాలు, ఇత్యాదిభేదాలు. వీటిల్లో శ్వాసనాద, అల్పప్రాణ, మహాప్రాణ భేదాలనుబట్టి సూక్ష్మతర విభజన చెయ్యవచ్చు. స్థానిక నిరోధం లేకుండా గాలి స్థానకరణాల సంకుచితావకాశంగుండా ఒరుసుకొని రావటంవల్ల ఏర్పడే ధ్వనులు ఊష్మాలు, శ ష స హల వంటివి. గాలి నాసికారంధ్రాల ద్వారా వెలువడే ప్రయత్నంలో ఉచ్చరించే ధ్వనులు అనునాసికాలు, ఙ ఞ ణ న మ లు. నాలుక ఇరువైపులగుండా గాలి వెలువడటంవల్ల ఏర్పడే ధ్వనులు పార్శ్వికాలు, ల ళ మొదలైనవి. కరణం అవ్యవహితంగా కంపించటంవల్ల ఏర్పడే ధ్వనులు, కంపితాలు లేక రేఫలు, 'ర-ఱ' మొదలైనవి. ఈషత్ స్పర్శవల్ల ఏర్పడే ధ్వనులు శిథిలస్పర్శలు, హిందీలో ఉచ్చరించే 'ఢ' (ఉదా. 'లడ్కా') ఇటువంటిది. ఊష్మాలకున్నంత ఒరిపిడి లేకుండా గాలి జారిపోయే ప్రయత్నంవల్ల ఏర్పడే ధ్వనులు అంతస్థలు, య వ మొదలైనవి. భాషల్లో ఇవి కొన్నిచోట్ల అచ్చులుగాను, కొన్నిచోట్ల హల్లులుగాను ప్రవర్తిస్తాయి. ఈ రెంటి లక్షణాలకు మధ్యస్థంగా ఉంటాయి కాబట్టి అంతస్థలన్నారు. చ-చ జ-జ ఉచ్చారణలో మొదట స్పర్శప్రయత్నం, చివర ఊష్మప్రయత్నం ఉండటంవల్ల వీటిని స్పృష్టోష్మాలని గాని, స్పర్శోష్మాలని గాని పిలవవచ్చు. తాళపత్రగ్రంథాల్లో చకారాన్ని 'త్స' గా రాయటానికి హేతు వీప్రయత్న విలక్షణతే కావచ్చు.

అచ్చుల ఉచ్చారణస్థాన భేదాన్నిబట్టి తాలవ్యాలు, కంఠ్యాలు, అని ద్వివిధం. నాలుక మధ్యభాగం కఠిన తాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు ఎ̱, ఎ, ఇలు. నాలుక వెనుకభాగం మృదుతాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు, అ, ఒ, ఉ లు. ఇ, ఉ లను ఉచ్చరించేటప్పుడు వక్త్రంలో అవకాశం తక్కువగా ఉంటుంది. ఎ̱, అ లను ఉచ్చరించేటప్పుడు ఈ అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఈ ప్రమాణాన్నిబట్టి ఇ, ఉ లను సంవృతాచ్చులనీ, ఎ̱, అ లను వివృతాచ్చులనీ వ్యవహరించవచ్చు. ఎ, ఒ లను అర్ధసంవృతాలని గాని అనవచ్చు. తాలవ్యాచ్చులు తెలుగులో నిరోష్ఠ్యాలు. కంఠ్యాచ్చులు (అకారం తప్ప) ఓష్ఠ్యాలు.

# ఏరు కాటేసింది!

## శ్రీ మిక్కిలి సుందరరావు

హోరుగాలి రివ్వున బాణాల్లా దూసుకుపోతోంది! శిథిల పృథివిపై క్షతిత వ్యాపగాల బాధలా మూలుగుతోంది నిశీథిని. మానవరక్తాన్ని త్రాగి యెముకల్ని కొరుకుతోంది నరాల్ని జివ్వుమనిపించి మెదడును తిమ్మిరెక్కించే చలిగాలి!

సూదుల్లాగ, బాణాల్లాగ, యీటెల్లాగ, రాలుతున్న చినుకులు సూటిగా హృదయంలో గుచ్చుకుపోయేలాగా దూసుకుపోతున్నాయి వడిగా — మరి వడివడిగా.

మహావృక్షాలు చరమరాత్రికి ఆహుతి కాబోతూ చేస్తున్న రోద మహాసంగ్రామంలో మరణబాధతో విలవిలలాడుతున్న సైనిక సమూహంలా వుంది.

వాన మహాప్రవాహమయ్యింది భూమ్మీద —

ప్రవాహం భయంకరంగా ఉద్ధృతరూపం దాల్చింది. వరిచేలు గట్లు తెంచుకుని సర్వనాశన మౌతూ మానవజాతికి రానున్న క్షామాన్ని దర్శిస్తున్నాయి.

చీకటి కరిగిపోతున్నది కాటుకలాగ. ఆకాశం చేసే హాహాకారాలకు ప్రకృతి యావత్తూ సింహం నోట పడ్డ లేడిపిల్లలా గిజ గిజ తన్నుకులాడుతున్నది కంఠం తెగి.

ఇంత బీభత్స సమయంలో ఊరిబయట గడ్డు మీద కలుసుకున్న రెండు శరీరాల ఆకారాలు లీలగా గోచరిస్తున్నాయి.

ఒక ఆకారం రెండో ఆకారానికి కత్తి అందించింది.

రెండో ఆకారం ఆ కత్తి సాయంతో మొదటి ఆకారాన్ని అనుసరిస్తుంది.

రెండు ఆకారాలు భయంగా వణుకుతూ నడుస్తున్నాయి.

రెండు ఆకారాలు సెలయేటి ఆనకట్టపై నిలబడ్డాయి. వరదతో కూడిన మహాప్రవాహం గుండెల్ని చీల్చుకుని వచ్చే దుఃఖంలాగ పొర్లి పొర్లి ఆనకట్టను ఢీకొంటున్నది.

రెండు ఆకారాలు చిక్కు సమస్యను ఒకే ఒక ముక్కలో తేల్చుకోవడానికి యత్నిస్తున్నాయి.

"నన్ను ఖూనీచేసిన యీ ఊరుమీద నా కసి తీర్చుకుంటాను."

"అది నీచేతుల్లో వుందనుకుంటున్నావా?"

"ఉంది?"

"నీవు లోకంలో అందరికంటే బలహీనుడివి."

"కావచ్చు. ఇప్పుడు అందరూ నాకంటే బలహీనులు."

"ఆవేశం — నిన్ను అలా మాట్లాడిస్తున్నది."

"దేవుడిచ్చిన ఆవేశం నాకు గొప్ప తెలివి నిచ్చింది."

"నీ తెలివి కసితీర్చుకోడానికి సాయపడదు."

"లేదు. ఇప్పుడే నాకసి తీర్చుకుంటాను."

"ఎలా?"

"ఈ వూరిని నా గుప్పిట్లో పెట్టాడు భగవంతుడు!"

"అంటే?"

"ఈ లాకు త్రిప్పానంటే నా ప్రాణంలో ప్రాణం కొట్టుకుపోయినట్లు యీ వూరు మొత్తం పోతుంది."

రెండు ఆకారాలు నిశ్శబ్దంగా — మసిబొగ్గు లాంటి, కాదు చీకటి లాంటి ఆకాశంలో రెండే చుక్కల నీడల్లా నిలబడ్డాయి. గాలివాన వేగంలాగ ఆలోచనలమీద ఆలోచనలు రెండు హృదయాల్లోను దూసుకు దూసుకు పోతున్నాయి. నరనరాలు జివ్వున పొంగి మెదళ్ళు దిమ్మెక్కిపోతున్నాయి.

"ఒక్కసారి ఆలోచించు — ఆపని చేసేముందు."

గాలి పెట్టే రొద ప్రళయంగా వుంది! వాన పెట్టే బాధ విలయతాండవంగా వుంది.

చెట్లు, గట్లు, గనుమలు, కాలువలు, పొలాలు చీకటి ప్రవాహంలో ఐక్యమైపోయి ఆకాశం పులిక్కిపడేలా అరుస్తున్నాయి!

మొదటి ఆకారం తను చెయ్యబోయే పనిని గూర్చి యెంతసేపు ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేక — యివ్వాళ తనకు జరిగిన అవమానాన్ని మళ్లీ జ్ఞప్తిచేసుకుని ఆవేశాన్ని పెంచుకుంటున్నది.

* * *

రైలుబండి స్టేషనులో ఆగింది.

వాన హోరుమంటోంది. ఈదురుగాలి ప్రాణాలు తోడుతున్నది. మధ్య మధ్య భయంకరంగా మబ్బు పగిలిపోతున్నట్లు ఉరుములు మెరుపులు నిర్విరామంగా వినవస్తున్నాయి.

రంగయ్య బండిదిగాడు. చేతి సంచిని జాగ్రత్తగా పట్టుకున్నాడు. జేబులోని పర్సును తడిమి చూసుకున్నాడు. ఒక్కసారి పర్సుకూడా విప్పి చూద్దామనుకున్నాడు. వాన హోరులో ఆపని చెయ్యడానికి వీలు కలిగేది కాదు.

రైలు కూతేసి సాగిపోయింది. ఈదురుగాలి యిసిరిసిరి కొడుతున్నది. కటిక చీకటి ప్రకృతి హృదయంలో కరాళ నృత్యం చేస్తున్నది. అంతా చీకటి! ఈ బీభత్స వాతావరణంలో ఏవస్తువును కూడా పోల్చుకోవడానికి వీలులేకుండా వుంది!

రంగయ్యకు భయం పుట్టుకొచ్చింది! యీ ప్రళయవాతావరణంలో తను యింటికి చేరుకోవడం ఒక భీకర సమస్యగా పరిణమించింది.

రంగయ్య గుండెలు గాలికి చిటపటమనే చినుకుల్లా కొట్టుకుంటున్నాయి.

రంగయ్య స్టేషనులోకి వెళ్ళి వరండాలో నిలబడ్డాడు. స్టేషను మాస్టరు రంగయ్య దగ్గరనుండి టిక్కెట్టుపుచ్చుకుని మందహాసంతో కుశల ప్రశ్నలు చేశాడు. స్టేషను మాస్టరువంటి గొప్ప అధికారి అల్పజీవిగా పరిగణింపబడుతున్న తన యోగక్షేమాలు తెలుసుకున్నందుకు మనసులో తెగ గర్వపడ్డాడు రంగయ్య.

ఈ బండికి ఆ స్టేషనులో దిగినవాడు రంగయ్య ఒక్కడే! రంగయ్య అంచనా ప్రకారం రైలు మధ్యాహ్నానికే యీ స్టేషనుకు రావలసింది. అలా తన అంచనా ప్రకారం బండి చేరుకున్నట్లయితే యీ గాలివాన కూడా తనకు లేకపోయేది. లంఖణాల బండి నాలుగు గంటలు లేటయినందువల్ల ప్రమాదం తన గొంతు మీదకు వచ్చింది!

చీకటి, గాలి, వాన,—వీటిని చూస్తుంటే ఒంటరిగా యింట్లో యెలా కంపించిపోతుందో సీత - అనుకున్నాడు రంగయ్య. తన సీత గుర్తుకొచ్చేసరికి రంగయ్య కంపించిపోయాడు. తన కాళ్ళు నేలమీద నిలబడలేక పోయాయి.

తనని సాయంకాలానికి తప్పక తిరిగి రమ్మని మరీ మరీ వేడుకుంది సీత—కడకు కన్నీళ్లుకూడా కార్చింది.

తను యిదివరలో ఒకసారి యిలాగే బస్తీకి వెళ్ళాడు. ఆ రాత్రి సీత ఒక్కతే వుండవలసి వచ్చింది యింట్లో.

రౌడీ వెధవలు! ఒకరి వెనుక ఒకరు వచ్చి సీతను బలవంతం చేశారు. ఏడిపించుకు తిన్నారు!

బస్తీనుంచి తను తిరిగి వచ్చినతరువాత సీత వెక్కి వెక్కి యేడ్చింది. కంట తడిపెట్టుకుని విషయమంతా చెప్పింది. ఈ వూరునుంచి వెళ్ళిపోదామని కూడా చెప్పింది. అందుచేతను అప్పటినుంచి కాస్త జాగ్రత్తగా మసలుతూ వచ్చాడు.

తను పెళ్ళాడకముందు సీత అల్లరి చిల్లరిగా తిరుగుతుండేది! ఒక రోజు వరిచేలో కోతకోసేటప్పుడు తనకు సీతకు పరిచయం కుదిరింది. సీతంటే తనకు యెంతో యిష్టమయ్యింది. ఈ లోకంలో తనకు సీత ఒక్కతే దిక్కనిపించింది. సీత కూడా తనని ఎంతో ప్రేమించింది.

తను చేసుకోకముందు సీత యెన్నో తప్పులు చేసిందట! అన్నీ చెప్పి కన్నీళ్ళుపెట్టుకుంది. తను చేపడితే మంచిగా బ్రతుకుతాననీ, మరో జన్మ యెత్తుతానని చెప్పింది.

అప్పుడు తను సీతను చేసుకోవడానికి యిష్టపడ్డాడు. ఆ వూరువాళ్ళెవరూ సమ్మతించలేదు. అయినా రంగయ్య సీతను చేసుకున్నాడు.

నాటినుంచి సీత యెంతో మంచిగా బ్రతుకుతున్నది. ఇంత మంచి సీతను దేవుడు తనకు దయచేసినందుకు తను ఒంటరిగా దేవుడికి దండాలు పెట్టుకునేవాడు.

సీత యెంత మంచిగా బ్రతుకుతున్నా—వూళ్ళో వాళ్ళకు పూర్వంలో వున్న చెడ్డ అభిప్రాయం మాత్రం పోయిందికాదు. అందుకే సీతను పొలాల్లో, బావిదగ్గర, యెక్కడ వీలుదొరికితే అక్కడ అల్లరి పెడుతున్నారు రౌడీ వెధవలు.

"ఈ రాత్రి యెంత గొడవ చేస్తారో వెధవలు!" అనుకున్నాడు రంగయ్య.

స్టేషనులో ఒకే ఒక లాంతరు వుంది. అది పొరపాటున ఆరిపోతే అందరి ప్రాణాలు అక్కడే పొయ్యేటంత భయంకరంగా వుంది వాతావరణం!

బుకింగ్ ఆఫీసులో యిద్దరు ముగ్గురు పడుకోవడానికి సిద్ధపడుతున్నారు ఇళ్లకు వెళ్ళలేక. స్టేషనుకీ వూరికీ రెండు మైళ్ళదూరం. ఆ వూళ్ళో పొగాకు

# ఏరు కాదేసింది!

కంపెనీకొంత రైలు వేళాగుకాని వూళ్ళోజనాన్ని వుద్దేశించి మాత్రం కాదు.

రంగయ్య కొద్దిగా తడిసిపోవడంవల్ల చలిగాలికి వణికి పోతున్నాడు.

స్టేషను మాష్టరు రంగయ్యను గమనించాడు!

"రంగయ్యా, సంచిలో పెద్ద సామానువుంది!" అన్నాడు.

"ఏముంటుంది మాబోటివాళ్ళ దగ్గర?" అన్నాడు రంగయ్య.

"ఈ వానలో యెలా వెళ్తావ్? ఆఫీసులో పడుకోరాదూ—పొద్దున్నే వెళ్ళొచ్చు!" అన్నాడు స్టేషనుమాష్టరు.

"వానయ్యేది వరదయ్యేది యింటికి చేరాలిసిందే! అర్జంటు పనుంది." అన్నాడు రంగయ్య.

"అయితే ఒక పని చెయ్యి - వెంకన్న యిప్పుడే ఎండ్లబండి కట్టబోతున్నాడు. దానిలో వెళ్ళు. మెల్లిగా చేరుకోవచ్చు."

"అయితే సరేనండి." అని చెప్పి బయలుదేరాడు రంగయ్య. వెంకన్న రంగయ్యను బండిలో ఎక్కించుకున్నాడు.

కంకరరోడ్డు మీద బండి కటకటలాడుతున్నది. చుట్టూ విలయతాండవం జరుగుతున్నది. బండి తడిసి పోతున్నది. రంగయ్య ఒక మూలకు ఒదిగి పడుకున్నాడు.

ఎండెద్దు అతి కష్టం మీద బరాబరా లాక్కు పోతున్నది భారాన్ని.

కొండంత ఆనందంతో రైలుబండి యెక్కిన రంగయ్య యింత త్వరలో యీ విపత్తు సంభవిస్తుందనుకోలేదు. సంచిలోని పట్టుచీర, రవిక తడిసిపోయాయేమోనని చూసుకొన్నాడు. బాగానే వున్నాయి.

పెట్టె విప్పి చూసుకొన్నాడు.

పెట్టెలో వున్న చంద్రహారం అదే సమయంలో మెరిసిన మెరుపువల్ల ధగధగలాడిపోయింది.

రంగయ్య తన ఐదేళ్ళ సంసార జీవితంలో తన భార్యకు తొలిసారిగా ఒక బంగారు వస్తువు కొనగలిగాడు పట్టణంలో. చంద్రహారం కొన్న తరువాత కొంత డబ్బు మిగిలింది. ఆ డబ్బుతో చంద్రహారానికి తగిన బట్టలుకూడ భార్య కట్టుకోవాలని ఆ పట్టుచీర, రవిక కొన్నాడు. ఇంత ఖరీదుగల వస్తువులు తాను కొనడంవల్ల తను లెగ గర్వపడుతున్నాడు. సీతకు యిది యెప్పుడు చూపెడదామా అనే ఆతురత అతన్ని త్వర పెడుతున్నది.

సీత చెప్పినమాటలు ఒక్కసారి అకస్మాత్తుగా గుర్తుకు వచ్చాయి.

"నా చిన్నతనంలో చంద్రహారాన్ని ఒక గొప్పోళ్ళ అమ్మాయి మెడలో చూశాను. అప్పటి నుండి జీవితంలో యెప్పుడైనా అటువంటి దండ నా మెడలో వేసుకోవాలనుకున్నాను. ఈ రోజు మీరు నా కోరిక తీరుస్తున్నారు" అని చెప్పి పొంగి పోయింది సీత.

ఈ చంద్రహారం కోసం యెంతో కష్టపడి చేసిన కూలిమీద డబ్బులు వెనుకేశాడు రంగయ్య. రంగయ్య లాంటివాడు యింత గొప్ప హారాన్ని కొన్నాడంటే ఆ వూరివాళ్ళకు యెంతో విభ్రాంతి కలుగుతుంది!

సీత పట్టుచీర కట్టుకుని పట్టురవిక తొడుక్కుని-మెళ్ళో చంద్రహారం మెరిసి పడుతుంటే, తల్లో మల్లె పూలు పక్కున నవ్వుతుంటే, నొసట కుంకుమరేఖలు సిగ్గుపడుతుంటే, కళ్ళ కాటుక రేఖలు తెలియనిభావాలు ఆడుతుంటే—నిజంగా సీత అందాన్ని చూడాలి! సీతకున్న అందం ఆ వూళ్ళో మరెవ్వరికీ లేదనే చెప్పాలి.

సీత తనకు దొరకవలసిన భార్య కాదనుకుంటాడు రంగయ్య-తనలాంటి మంచివాడికి తగిన భార్య కాదంటారు జనం. సీత-తనూ యెప్పుడూ తగువులాడుకోలేదు ఐదేళ్ల జీవితంలో - సీతనువిడిచి క్షణం బ్రతకలేడు తను - తనను విడిచిన క్షణం నరకమే నంటుంది సీత!

వెంకన్న ఎద్దును చలాకుగా అదిలిస్తున్నాడు.

ఈదురుగాలి యినిరి కొడుతున్నది. ఫెళ్లున వురిమింది ఆకాశం. పెళ్లున పిడుగు పడింది దూరంగా-రంగయ్య గుండెలు కొట్టుకులాడాయి.

రంగయ్యకు ఆదిలో పెళ్ళంటే భయంపుట్టేది. పెళ్ళిచేసుకోవడానికి కూడా తనకు అర్హత లేదనుకునేవాడు. దానికి కారణం తను దిక్కులేనివాడుగా పెరగడమే!

రంగయ్యను గూర్చి ఆ పల్లెలో ఒక చిన్నకథ వుంది.

ఒక అర్ధరాత్రి వేళ ఒంటరిగా ఒక పడుచు పిల్ల ఈ గ్రామం వచ్చింది. ఆ వూళ్లోవున్న సత్రంలో రెండు రోజుల పాటు తలదాచుకుంది. వూళ్ళో వాళ్లు ఆమెను యేమి అడిగినా జవాబు చెప్పేదికాదు. అప్పట్లో వూళ్లో మునసబుగారు దిక్కులేనివాళ్లంటే యెంతో ఆదరం చూపేవారు. అందువల్ల ప్రజలు

కూడా ఆమెను యేమీ అనేవాళ్ళు కారు. ఆమె అలాగే రహస్యంగా అక్కడే వుండేది.

ఒకనాటిరాత్రి ఆమె సత్రంలో ప్రసవించింది. బిడ్డపుట్టిన వెంటనే మరణించింది. తెల్లవారిన తరువాత ఆ వూరి ప్రజలు ఆ వూరి సత్రంవద్ద చేరారు. ఆ దిక్కులేని బిడ్డను పెంచుకోవడానికి యెవ్వరూ యిష్టపడలేదు. అప్పుడు మునసబుగారు ఆ విషయంలో కలుగజేసుకున్నారు. ఆ వూరి కాపలాదారుడుగా వుండే సుబ్బయ్యను పిలిపించాడు. తనకోరిక మీద ఆ బిడ్డను పెంచవలసిందిగా సుబ్బయ్యను మునసబు కోరాడు.

సుబ్బయ్య అందుకు అంగీకరించాడు.

ఆ బిడ్డను అతిజాగ్రత్తగా పెంచి పెద్ద చేశాడు. ఆ బిడ్డమీద క్రమేణా అందరికీ జాలి కలిగింది. ఆ పసిబిడ్డ తను దిక్కులేని వాడినని తెలుసుకున్నాడు. ఆ వూరి ప్రజలే తనకు తల్లి దండ్రి అనుకొనేవాడు. అతడే రంగయ్య!

ఆడవాళ్లందర్నీ రంగయ్య 'అక్కయ్య' అని పిలిచేవాడు. మగవాళ్లందర్నీ 'అన్నయ్యా' అని పిలిచేవాడు. తనకంటే చిన్నవాళ్లను తమ్ముడు, చెల్లెమ్మ అని పిలిచేవాడు.

ఆ వూరిలో యెవరికి కష్టం వచ్చినా తన కొచ్చినట్లే బాధపడేవాడు. ఎవరు ఏ పని చెప్పినా కాదనకుండా ఆపనిచేసి ఆరోజు అక్కడే భోజనం చేసేవాడు. వాళ్లకు పనికిరాని బట్టలు యేవైనా యిస్తే వాటిని పరిశుభ్రం చేసుకుని తొడుక్కునేవాడు.

చిన్న చిన్న పరిహాసాలతో అందర్నీ నవ్వించేవాడు. అతని అమాయకత్వానికి అందరూ యెంతో ఆప్యాయత చూపించేవారు. పువ్వులంటే అతనికి యెంతో యిష్టం! అందుచేత కొన్ని పువ్వుల్ని చెవుల మీద పెట్టుకొని తిరుగుతుండేవాడు. అది చూసి అతన్ని కొందరు 'పూలరంగయ్య' అని పిలిచేవారు.

రంగయ్య చిన్నతనమంతా అలాగే యే బరువులు, బాధ్యతలు లేకుండా గడచిపోయింది. ఆవూరికెవరైనా క్రొత్త చుట్టాలు వస్తే రంగయ్య వాళ్లను సులభంగా పరిచయం చేసుకునేవాడు.

అప్పుడు వాళ్లు "ఎవరీ రంగయ్య?" అని తెలుసుకుంటే ఆపల్లెవాళ్లు రంగయ్య తల్లిని గూర్చి యీ క్రిందివిధంగా చెబుతారు.

"రంగయ్య తల్లి ఒక గొప్ప కులానికి చెందిన పిల్ల. వాళ్లింట్లో పాలేరుని ప్రేమించింది. వాడికి కూడా రంగయ్య తల్లి అంటే యెంతో ప్రేమ! అయితే యేవో కారణాలవల్ల అతనికి జన్మఖైదు విధించారు. అతడు జైలుకెళ్లాడు. రంగయ్య తల్లికి గర్భంవచ్చింది. ఒకనాటిరాత్రి అర్ధరాత్రివేళ ఆ వూరి నుండి పారిపోయి యీ వూరు వచ్చింది. ఇక్కడ సత్రంలో రంగయ్యను కని మరణించింది." పల్లెప్రజలు యీ రీతిగా చెప్పుతారేగాని దానికి రుజువేమీ లేదు. అది నిజం అనిగాని, అబద్ధం అని గాని యెవ్వరూ చెప్పలేరు.

ఇలా యెన్నో విషయాలు రంగయ్య హృదయంలో దొర్లిపోతున్నాయి. దారుణసంగ్రామంలా చెలరేగిన ఆ గాలివాన మహావృక్షాలను సైతం పెళ్ళగించివేస్తున్నది. చావుబ్రతుకుల మధ్య అవి పోరాడుతున్నాయి.

బండి సాగుతున్నది. ఎద్దు బలవంతంగా లాగుతున్నది నరాలన్నీ కూడగట్టుకుని. బండి యిరుసు కిర్రుమంటున్నది. కంకరరోడ్డు కరకరమంటున్నది కర్కశంగా.

వెంకన్న వుండీ వుండలేక "అయితే రంగయ్యా, సీత ఒక్కతే వుంటుందా యింటివద్ద ఇంత గాలివానలో?" అన్నాడు.

"లేదు వెంకన్నా, యింటిముందు పంచలో ఆ గుడ్డివాడు పడుకుని వుంటాడు తోడుగా. ఆ ముసలాడికి మేమంటే ప్రాణం."

"వాడిది యేవూరంటావ్?"

"ఏవూరో నాకు తెలీదు. అడుక్కునేవాళ్ళకు వూరేటి? అడుక్కుంటూ మనవూరు వచ్చాడు. మన వూళ్ళోతిండీ తిప్పలూ కాస్త సుఖంగా గడుస్తుంది గదా! అందుకని యీ నాలుగేళ్ళనుండి మనవూళ్ళోనే వుంటున్నాడు—ఇక్కడ గడ్డుగ 'జాలు వస్తే - మంచిరో 'జులుండేవో'యని వెతుక్కుంటూ పోతాడు." అన్నాడు రంగయ్య యీదురుగాలికి కొంగర్లుపోతున్న తనశరీరాన్ని స్వాధీనం చేసుకుంటూ.

వాన కొంచెం తగ్గుముఖం పట్టింది. గాలిమాత్రం హోరుగానే వుంది. బండి వంతెనమీదకు వచ్చింది. ఏరు ఉద్ధృతంగా వుంది.

రంగయ్య యేటివంక చూశాడు. చీకట్లో ప్రవాహం స్వాధీనం తప్పి సుళ్ళు సుళ్ళుగా మెలికలు తిరుగుతున్నది.

'అంత మహాప్రవాహాన్ని లాకు తలుపులు అడ్డుకుని వున్నాయి. ఒక్కలాకు తలుపు తిప్పితే నా? అమ్మ

బాబో! ఊరంతా 'నేలమట్టమై నీట్లో కలుస్తుంది' అనుకున్నాడు రంగయ్య.

తెలియనిరీతిగా రంగయ్య ఒళ్లు గగుర్పొడిచింది. వెంకన్న మళ్ళీ మొదలెట్టాడు.

"రంగయ్యా, మన పల్లెను చూస్తుంటే చిరాకెత్తుతుందనుకో-పాపం పెరిగి పండిపోతున్నది. దేవుడి మీద ఒక్కడికీ నిగా లేదు కదా? అందుకే దేవుడికి కోపం వచ్చి యీ గాలివాన పంపించాడు. పంటలన్నీ పోతున్నాయి. ఈ యేడు తప్పకుండా కరువొచ్చి తీరుతుందనుకో—"

రంగయ్య వింటూ తనలో నెమరు వేసుకుంటున్నాడు వెంకన్న అభిప్రాయాల్ని—వెంకన్న మొదలెట్టాడు.

"ఒట్టి పోసుకోలు రచకీగాలు, దొంగతనాలు, తగాదాలు, కొట్లాటలు, హత్యలు, కోగులు, జైళ్ళు! పదేళ్ళ క్రిందట మన పల్లె యెంత మంచిగా వుండేదో— యిప్పుడు అంత చెడ్డగా మారిపోయింది. ఇప్పుడు యే పల్లె చూసినా యీ ఎలక్షన్లొచ్చిన తరువాత బస్తీల కంటే చెడిపోయాయి. ఛీ—ఛీ, రోత పుడుతుంది. ఒక్కణ్ణీ నమ్మడానికి వీల్లేదు కదా?'

'వెంకన్న అక్షరాలా నిజం చెబుతున్నాడు' అనుకున్నాడు తనలో రంగయ్య.

"బస్తీలోనే నయం—ఎవడి దోవను వాడు పోతాడు. ఒకడి సంగతి యింకొకడు పట్టించుకోడు. మరి మన వూళ్ళోనో—ఇక్కడ లేచిందంటే అక్కడ పోయిపడిందంటారు" అన్నాడు రంగయ్య. రోడ్డుకిరువైపులా వున్న చింతచెట్లబారుని దాటుకొంది బండి.

మెల్ల మెల్లగా పల్లె దాపుకు చేరుకుంటున్నది. రంగయ్య బండి దిగాడు. వెంకన్న దగ్గర సెలవు తీసుకున్నాడు. తడుసుకుంటూ యింటికి వెళ్ళాడు.

పంచలో ముసలివాడు కనుపించలేదు.

"సీతా! సీతా! నే నొచ్చాను తలుపు! తలుపు!" రంగయ్య యెంత అరచినా తలుపు తెరుచుకోలేదు. బలవంతంగా నెట్టాడు. కాని ఒరగా తీసివుండనికూడా గుర్తించలేకపోయాడు.

ఇల్లంతా చీకటిగా వుంది. అగ్గిపెట్టెకోసం వెతికాడు. గూట్లో దొరికింది. బుడ్డి ముట్టించాడు. మంచం మీద సీత కనుపించలేదు.

అటు వైపు మూలని దూలానికి వ్రేలాడుతున్నది సీత! రంగయ్య గజగజ వణికిపోతున్నాడు, నిలువునా నీరైపోతున్నాడు, గుండెలు బాదుకుంటున్నాడు.

"సీతా! సీతా! అమ్మో! నేననుకుంటూనే వున్నాను! ఎవరు సీతా—నిన్నీ పని చేయించింది? ఒక్క మాట కూడా చెప్పకుండా వెళ్ళిపోయావా? నేను సీతా! నేను! నీ రంగణ్ణి! అమ్మో! నా సీతను నాకు కాకుండా చేశారు. నా సీత యెవ్వరికీ అపకారం చేసేదికాదు. నా సీత మహాయిల్లాలు! సీతా! సీతా!!"

పెద్దగా యేడుస్తూ గుండెలు బాదుకున్నాడు రంగయ్య. బైట అగ్ని పర్వతాలు పగిలినట్లు అక్కడక్కడ చెట్లు ఫెళ్ళు ఫెళ్ళున విరిగిపడుతున్నాయి. గాలి, చినుకులు అవిరామంగా భూమ్యాకాశాల్ని ఏకం చేస్తున్నాయి. ఉరిపోసుకున్న సీతను క్రిందికి దించాడు రంగయ్య. మంచంమీద పడుకో బెట్టాడు. కిరసనాయిలు బుడ్డి చూపుతున్న గుడ్డి వెలుతురులో సీత అమాయకపు చూపులు రంగయ్య హృదయాన్ని కలచివేస్తున్నాయి.

రంగయ్య మంచంమీద సీతకు దగ్గరగా కూర్చున్నాడు. జీవంలేని అందం సజీవంగా నే కనుపిస్తున్నది.

'సీతా! నిన్ను అందంగా పుట్టించడమే దేవుడు చేసిన తప్పు" అని ఘోషమన్నాడు.

గుడ్డి వెలుతురులో సంచి కనుపించింది రంగయ్యకు. సంచిలో నుండి సిల్కుచీర, రవిక తీశాడు. దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంటూ చీరను సీతకు కప్పివేశాడు.

పర్సు గుర్తొచ్చింది!

పర్సు విప్పాడు. సీత మళ్ళీ పలుకుతున్నట్లయ్యింది:

"నా చిన్నతనంలో చంద్రహారాన్ని ఒక గొప్పోళ్ళ అమ్మాయి మెడలో చూశాను. అప్పటి నుండి జీవితంలో యెప్పుడైనా అటువంటిది వుంటే నా మెడలో వేసుకోవాలనుకున్నాను. ఈ రోజు మీరు నా కోరిక తీరుస్తున్నారు" అని చెప్పి పొంగిపోయింది సీత.

రంగయ్య చంద్రహారాన్ని సీత మెడలో అలంకరించాడు.

బుడ్డి వెలుతురులో సీత అందం నిగనిగలాడుతున్నది. సీత నిద్రిస్తున్నట్లుగా యెంత అందంగా వుంది! రంగయ్య నిలువునా చలించిపోయాడు!

రంగయ్య బయటికి నడుస్తున్నాడు!

సీత మెడలో ఆమె కోరుకున్న చంద్రహారం మెరుస్తున్నది. రంగయ్య కొని తెచ్చిన పట్టుచీర, రవిక ఆమె మీద ప్రాకుతున్నాయి!

రంగయ్య రోడ్డు మీదకు గబాగబా నడిచాడు.

సీత శీలాన్ని కొంగిలించడానికి ప్రయత్నించిన మూర్ఖుల హృదయాలవంటి చీకటి అంతటా స్వైర విహారం చేస్తున్నది. గాలీవానా చేతులు కలుపుకున్నాయి. ప్రకృతిపై పగబూని మబ్బులు అరుస్తూ వాటికి ప్రోత్సాహాన్నిస్తున్నాయి.

వాన, గాలి, చలి, చీకటి, ఉరుములు, మెరుపులు, పిడుగులు భయంకరంగా స్వారీచేస్తున్నాయి ఏకాంతంగా నడుస్తున్న రంగయ్య మీదకు.

రంగయ్య నెత్తి కేకలు వెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నాడు—అతనికి పిచ్చెక్కి పోతున్నది.

తను యీ వూరులో యెవ్వరికీ యెప్పుడూ అపకారం చెయ్యలేదు. తను ప్రతివారికీ యేదో విధంగా సాయపడ్డాడు తనజీవితంలో-వాళ్ళకు తనుచేసినసేవ అపారం! అంతా తనకు ఋణపడివున్నారు! అయినా, అంతా తనకు కీడు చేశారు! తన జీవితాన్ని సర్వనాశనం చేశారు!

అంత చలిగాలిలో రంగయ్య రక్తం ప్రకోపించింది! నరనరాలు మండిపోయాయి!

రంగయ్య ముందుకు పరుగుతీశాడు!

"రంగా! రంగా!!"

రంగయ్యకు అంతరాంతరాలలో ఆ పెద్ద కేక పిడుగు చరిచినట్లయ్యింది!

ఠక్కున ఆగిపోయాడు.

"ఎవరు.?" అన్నాడు కోపంగా రంగయ్య.

"నేను రంగా! ముసలివాణ్ణి! గుడ్డివాణ్ణి!"

రంగయ్య చలించిపోయాడు. దుఃఖం కట్టలు త్రెంచుకుంది.

"తాతా!" రంగయ్య పెద్దగా రోదిస్తూ ముసలివాణ్ణి కౌగలించుకున్నాడు. ముసలి వాడు వుక్కిరిబిక్కిరయ్యాడు.

"ఏంచెయ్యను రంగా! నేను పందలోనే వున్నా! రాడీ మూకరా! ఒకడి తరువాత ఒకరు వచ్చారు. సీతను నానాబాధ పెట్టారు! సీత వాళ్ల కాళ్ల మీద పడి యేడ్చింది. ఎంత చెప్పినా వెధవలు వినకున్నారు కాదు. మహాతల్లి తనదారి తాను చూసుకుంది." అని చెప్పాడు.

"తాతా! యీ వూరోళ్లకు నేను కీడేం చేశాను?"

"రంగా! నీకు అన్యాయం జరిగింది. ఎంత గోల జరుగుతున్నా ఒక్కడు కూడా రాలేదు."

ఎక్కడో ప్రళయంగా వురిమింది. ముసిలాడు భయపడి రంగయ్యను కౌగలించుకొన్నాడు.

ఏరు దగ్గరకు వచ్చింది.

రొద తీవ్రంగా వుంది. యేటి వంతెన దగ్గర ప్రవాహాన్ని అడ్డుకునే లాకులు గుర్తుకు వచ్చాయి.

రంగయ్యకు ఎక్కడ లేని ఆవేశం వచ్చింది.

ఇప్పుడు యీ పల్లె ప్రాణాలు తన గుప్పిట్లో వున్నాయి! తను యీలాకు త్రిప్పితే, వూరు మొత్తం నామరూపాలు లేకుండా పోతుంది. పండిన పాపం పరిహార మవుతుంది. తన సీతను చంపినందుకు యీ ఘోరం జరగాల్సిందే! సర్వనాశనం కావల్సిందే!

ఏమైనా సరే ప్రతికక్ష తీర్చుకోవాలి! లేకుంటే తన గుండెలు యీ దుఃఖాన్ని భరించలేవు. ఉన్నట్లుండి ఒక్కసారిగా లాకు దగ్గరకు వెళ్ళాడు. రెండుచేతులతో లాకు కడ్డీని బిగించి పట్టుకున్నాడు.

*　　　*　　　*

"అంతా ఆలోచించాను. ఇక నాశనం తప్పదు" అన్నాడు రంగయ్య.

"దేవుడు నీచేత యీపల్లెను నాశనం చేయించదలుచుకున్నాడేమో! లేకపోతే యింత మంచివాడివి అకస్మాత్తు యెంతగా మారిపోయావ్!"

"నాసీతను నాశనంచేసినవాళ్ల మీద కసితీర్చుకుంటున్నాను" పెద్దగా అరిచాడు రంగయ్య—అతని అరుపు గాలివాన తీవ్రధ్వనిలో లీనమైపోయింది. లాకు త్రిప్పడానికి అమర్చిన కడ్డీ గిర్రున తిరుగుతుంది. లాకు తలుపులు బావురు మని రోదించుకుంటూ విడిపోయాయి.

రంగయ్యకు అకస్మాత్తుగా వూరుమీదవచ్చిన ఆవేశంలాంటి ప్రవాహం తలుపుల్ని చీల్చుకుంటూ వంతెన పగిలిపొయ్యేలా గర్జిస్తూ వూరిని నాశనంచెయ్యడానికి వురకలు వేస్తున్నది.

ఏరు చీకట్లో త్రాచుపాములా బుసలుకొడుతూ నురుగులు క్రక్కుతూ, పడగ విప్పుకుని, వూరిని కాటు వెయ్యడానికి పరుగులు పెడుతున్నది.

రంగయ్యకోసం వెతికాడు గుడ్డివాడు.

లాకు కడ్డీ దగ్గర రంగయ్య జాడ దొరకలేదు.

"రంగా! రంగా!!" అని యెంతసేపు పిలిచినా జవాబులేదు. ఏటి వంతెనమీద గుడ్డివాడు దయ్యంలాగ మిగిలిపోయాడు.

"ఇంత మంచి రంగయ్యకు దేవుడు యింతలోనే యెంతకోపం తెప్పించాడు! జీవితంలో కోపం అంటే యెరుగని రంగయ్యలాంటి వాళ్ళకు కోపంవస్తే యీ ప్రపంచంకూడా భరించలేదేమో!" అనుకున్నాడు ముసిలాడు నల్లని చీకట్లో!

గాలివానలో కొట్టుకుపోటేమీద ముందుకు సాగింది నల్లని ఆకాశంయొక్క భయంకర భయంగా. ఏరు త్రొక్కుతున్న పరవళ్లు ఆ నల్లని ఆకాశపు కర్ణపుటాల్లోనికి పోతున్నాయి!

తొక్కత్రొక్కిన నల్లని త్రాచులా చెట్టంత యెత్తుకు యెగిసి బుసలుకొడుతున్నది సెలయేరు!

# విడిపోతున్న రెండు సంస్కృతులు

శ్రీ సి. పి. స్నో

పారిశ్రామిక విప్లవానికీ, వైజ్ఞానిక విప్లవానికీ పొలిమేర స్పష్టంగా లేదు కాని అంతవరకు ఉపయోగకరము. పారిశ్రామిక విప్లవమంటే నా అభిప్రాయం క్రమంగా వృద్ధిపొందే యంత్రాలవాడుక, స్త్రీ పురుషులు కర్మాగారాలలో పనిచేయడమూ, (ఈ) దేశంలో - ముఖ్యంగా కృషీవలులుగా ఉన్న జనాభా కార్మికులుగా మారిపోవడమూ, కర్మాగారాలలోని వస్తువులను ఉత్పత్తి చేయడమే కాక సరఫరా చేయటంలో పాల్గొనటమూను. ఈ మార్పులు మనకు తెలియకుండానే జరిగిపోయాయి. విద్యాపరిషత్తులు వీటిని గమనించనేలేదు. లుడ్డైట్ లు ద్వేషించారు. ఈ లుడ్డైట్ లలో ప్రయోజనప్రధాన వాదులైనవారూ, మేధావులైనవారూ కూడా ఉన్నారు.

శాస్త్రాలనుగురించి, కళలను గురించి మనలో ఘనీభవించిన వైఖరులకూ ఈమార్పుకూ సంబంధం ఉందని నే ననుకుంటున్నాను. ఈ మార్పు 18 వ శతాబ్దం మధ్యనుంచి 20 వ శతాబ్దం ప్రారంభం వరకూ జరిగినదనవచ్చు. మరొక మార్పును కూడా ఇక్కడ చెప్పాలి; పైవాటన్నిటికీ సంబంధించినదే అయినా ఇది ఇంకా గాఢంగా శాస్త్రీయమైనదీ, త్వరితమైనదీ, ప్రయోజనాత్మకంగా బహుముఖమైనదీ- మునుపటిలాగ ఉజ్జాయింపుగా కాక శుద్ధశాస్త్రాన్ని పరిశ్రమకు వినియోగం చేయడమే.

ఈ రెండవమార్పు ఎప్పటినుంచి ప్రారంభించినదీ నిర్ణయించడం మన అభిరుచిమీద ఆధారపడి ఉంటుంది. కొందరు, అరవై సంవత్సరాల క్రితం రూపొందిన రసాయనిక, యాంత్రిక పరిశ్రమలతో ప్రారంభ మయిన దంటారు. కాని నా మట్టుకు నేను ముప్ఫైనలభై ఏళ్ళ క్రితం కాదని అనుకుంటున్నాను. సుమారుగా చెప్పాలంటే, పరిశ్రమలో మొదట పరమాణుకణాలను వాడినప్పుడు. ఎలక్ట్రానిక్స్, పరమాణు శక్తి, ఆటోమేషన్‌ను వాడే సమాజము ఇంతకు ముందున్న వాటన్నిటినుంచీ వేరైనదని నా అభిప్రాయము. అంతేకాక ఈ సమాజం ప్రపంచాన్ని మార్చివేస్తుందని కూడా నా అభిప్రాయం. ఈమార్పునే నేను "వైజ్ఞానిక విప్లవ"మనడానికి అర్హమైనదని భావిస్తున్నాను.

ఇదే మన జీవితాలకు భౌతికమయిన ఆధారము. ఇంకా సూక్ష్మంగా చెప్పాలంటే, మన మొక భాగంగా ఉంటున్న సంఘానికి జీవపదార్థం (Social Plasma). దీనినిగురించి మనకేమీ తెలియదు. శాస్త్రేతరమైన సాంప్రదాయిక సంస్కృతికి చెందిన వారిలో చాలామంది, పండితులైనప్పటికీ శుద్ధశాస్త్రానికి సంబంధించిన భావాలను ఏమాత్రం అర్థం చేసికొనలేకుండా ఉన్నారని ఇంతకుముందే చెప్పాను. వినియుక్త శాస్త్రం. విషయము చెప్పనే అక్కరలేదు. విద్యావంతుల మనుకునే వారిలో ఎంతమందికి పరిశ్రమలో ఉత్పత్తిని గురించి తెలుసు? "యంత్రపరికరాలంటే ఏమిటి?" అని ఒక సాహిత్యసమావేశంలో అడిగాను. ఎవరూ సూటిగా సమాధానము చెప్పలేకపోయారు. వృత్తిలో ఉండేవారికి తప్ప తక్కినవారికి పారిశ్రామికోత్పత్తి పద్ధతులు మంత్రాలంత నిగూఢంగా, మాయగా ఉంటాయి. ఉదాహరణకు; మామూలు గుండీలనే తీసుకొండి. ఇవి ప్రతిరోజు కొన్ని లక్షలు తయారవుతూ ఉంటాయి. ఈ పరిశ్రమ నిరుపయోగమైనదని సాహసికులైన లుడ్డైట్లు తప్ప ఎవరూ అనరు కాని ఈ సంవత్సరం కేంబ్రిడ్జిలో శాస్త్రేతరవిషయాలలో మొదటి తరగతిలో ఉత్తీర్ణులైన వారిలో పదిమందిలో ఒకరికి కూడా ఈవిషయం సరిగ్గా తెలిసి ఉండదు.

అమెరికాలో పరిశ్రమతో ఇంతకంటే కొంచెం ఎక్కువ పరిచయము ఉన్నదేమో కాని ఏ ప్రముఖ అమెరికన్ రచయిత తన పాఠకులకీ పరిచయం ఉన్నట్లు గుర్తించి వ్రాశాడు? దక్షిణ భాగాలలో ఉంటున్న సాంఘిక వ్యవస్థలను వర్ణిస్తారే కాని పారిశ్రామిక సమాజాన్ని గురించి వ్రాయనే వ్రాయరు. ఇంగ్లీషు నవలా రచయిత అసలు వ్రాయలేడు.

కాని ఉత్పాదకమైన ప్రతి వ్యవస్థలోనూ అతి సూక్ష్మమైన, ప్రయోజనకరమైన, వ్యక్తిగత సంబంధాలు ఉంటాయి. ఇవి నిజంగా అంత సరళమైనవి కావు. ఇవి సైన్యంలోని ఒక దళంలో ఉండే సంబంధాలలాగ ఆజ్ఞలను శిరసావహించడం వంటివని అను

ఇది రెండవ వ్యాసం, మొదటి వ్యాసం సెప్టెంబర్ సంచికలో ప్రచురించాము. —సంపాదకుడు.

కుంటాము కాని వాటికంటే చాలా సంకీర్ణమైనవి. ఇవి తెలియనివారి సమాజంలో కాలుపెట్టిన మరుక్షణం తప్పిపోతారు.

నిజం చెప్పాలంటే చాలామంది శాస్త్రజ్ఞులే ఈ విషయంలో అజ్ఞులుగా ప్రవర్తిస్తారు. శుద్ధశాస్త్రజ్ఞులనూ, వినియుక్త శాస్త్రజ్ఞులనూ ఒకే తరగతిలో చేర్చినా వారిద్దరికీ చాలా భేదాలున్నాయి. ఇంజినీర్లూ, శుద్ధశాస్త్రజ్ఞులూ తరచు ఒకరినొకరు పూర్తిగా అపార్థం చేసుకుంటారు. వారి ఆచరణలు భిన్నంగా ఉంటాయి. ఇంజనీర్ల ప్రపంచం నియమబద్ధమై ఉంటుంది. లోపల విచిత్రంగా ఉన్నా పైకిమాత్రం క్రమశిక్షణ కనిపించేట్లు ఉంటారు. శుద్ధ శాస్త్రజ్ఞుల విషయం వేరు. వామపక్షాలకు చెందినవారే వీరిలో అధిక సంఖ్యాకులు—ఇంకే వృత్తిలోనూ ఇంతమంది ఉండరేమో. ఇంజనీర్లలో మాత్రం దక్షిణ పక్షానికి చెందినవారే ఎక్కువమంది ఉంటారు. మన ప్రస్తుత సంఘ వ్యవస్థే వారికి నచ్చినట్లనిపిస్తుంది.

ఇంజనీర్లకూ, వినియుక్తశాస్త్రానికీ సంబంధించినంతవరకూ శుద్ధశాస్త్రజ్ఞుల తెలివి మరుగైపోయింది. ఈ విషయాలలో వారికేమాత్రం ఆసక్తి లేకపోయింది. "శుద్ధమయి"న సమస్యలంత అద్భుతమైనవి వినియుక్త శాస్త్రంలో ఉంటాయని వారు గ్రహించలేకపోయారు. వాటి పరిష్కారం "శుద్ధమై"నవాటి పరిష్కారమంత సంతృప్తికరంగా ఉంటుందని వారికి తెలియదు. వీలైనప్పుడెల్లా సరికొత్త విడంబనకోసం వెతికేస్వభావం మనదేశంలో ఉన్నది. ఈ వైఖరివల్ల వినియుక్తశాస్త్ర సమస్యలు తమ సమస్యలకంటే తక్కువ రకమైనవని అనుకునేవారు. నేను ఈవిషయం ఇంతగా నొక్కి చెప్తున్నానంటే దానికి కారణము లేకపోలేదు. ముప్ఫైఏళ్ల క్రితం నేనూ ఈ విధంగా ఆలోచించేవాడిని. కేంబ్రిడ్జిలో అప్పుడున్న మానసిక వాతావరణము గర్వితమైనది. మేము చదివే శాస్త్రము దేనికీ పనికిరాదని గర్వపడేవారము. ఎంత నిరుపయోగమయితే అంత గొప్ప, అనుకునేవారము.

రూథర్ ఫోర్డ్ ఇంజినీరింగ్ పైన అభిరుచి చూపేవాడు కాదు. కాపిట్జా, ఒక ఇంజినీరింగ్ పటాన్ని మెట్రోవిక్ కు పంపగా వారు దాని సహాయంతో ఒక యంత్రాన్ని తయారుచేశారని ఆశ్చర్యపడుతూ చెప్పేవాడు! రూథర్ ఫోర్డ్ కాక్రాఫ్ట్ యంత్రనిర్మాణచాతుర్యంచూసి అతనికి ఒక 600 పౌన్ల 'గ్రాంట్' ప్రత్యేకంగా ఇప్పించాడు. 1933 లో, తను చనిపోవటానికి ఇంకా నాలుగు సంవత్సరాలు ఉండనగా, అతడు (రూథర్ ఫోర్డ్) పరమాణుకేంద్రంలోని శక్తిని ఎప్పటికీ ఉపయోగించుకోలేమని అంటూ ఉండేవాడు. తొమ్మిది సంవత్సరాల లోపుగా చికాగోలో మొదటి రాశి పనిచేయటం మొదలుపెట్టింది. ఈ ఒక్క విషయంలో నే రూథర్ ఫోర్డ్ పొరపడ్డాడు. ఇది సరిగా శుద్ధశాస్త్రము వినియుక్త శాస్త్రముగా మారినప్పుడే అని గమనించాలి.

శుద్ధశాస్త్రజ్ఞులు నిజంగా సాంఘికపరిస్థితులను అర్థం చేసుకోనలేకపోయారు. పోనీ అనుకుంటే, అవసరమయినప్పుడు కష్టం లేకుండా గ్రహించగలిగే వారని మాత్రం చెప్పవచ్చు. యుద్ధకాలంలో చాలామంది శాస్త్రజ్ఞులకు ఉత్పత్తితో పరిచయం కలిగినది. దానితో వారు కళ్లు తెరిచారు. నా ఉద్యోగంలో నాకు కూడా ఇదే అనుభవం కలిగినది. ఇది నా జీవితంలోనే అత్యంతముఖ్యమయిన శిక్షణ విషయాలలో ఒకటే అయినా, నా ముప్ఫై అయిదవఏట సంభవించినది.

మన వైజ్ఞానిక శిక్షణతో బాటు ఎందుకు ముందుకు పోలేకుండా ఉన్నాము? తక్కినదేశాలు ఎందుకు మనల్ని దాటిపోతున్నాయి? మనము భవిష్యత్తు నే విధంగా ఎదుర్కోవాలి?

మానసిక, సాంఘిక విషయాలనుగురించి మాత్రమే ఆలోచిస్తే మన విద్యావిధానం భ్రష్టమైపోయినదని స్పష్టమవుతుంది.

ఏ ఒక్క దేశమూ నిర్దుష్టమైన విద్యావిధానం కలదని నేను అనలేను. ముందు చెప్పినట్లు రష్యన్లు, అమెరికన్లు ఇద్దరూ కూడా ఈ విషయంలో మనకంటే హెచ్చుగా అసంతృప్తిపడుతున్నారు. అంటే బాగు చేయటానికి ప్రయత్నిస్తున్నారన్నమాట. మనకంటే జీవితంపైన ఎక్కువ సూక్ష్మదృష్టి చూపుతున్నారని తెలుస్తున్నది. నా మట్టుకు నేను, వారు మనకన్న సరియైన మార్గంలో, సత్యానికి దగ్గరగా ఉన్నారని నమ్ముతున్నాను. కొన్ని విషయాలలో మనదే పైచేయి. విద్యోపాయాలు వారికంటే మనకే ఎక్కువ తెలుసు; విద్యానైపుణ్యంలో మాత్రము వెనుకబడి పోయాము.

ఈ మూడు విధానాలలోని భేదాలనూ పరిశీలిస్తే కొన్ని విషయాలు బయటపడతాయి. మన విద్యార్థులలో కొంతమంది మాత్రమే పద్దెనిమిదవ ఏటివరకూ విద్యాభ్యాసం చేస్తారు. విశ్వవిద్యాలయాలకు వెళ్ళేవారు ఇంకా తక్కువ అనుకోండి. ఒక చిన్న విశిష్ట జనవర్గాన్ని (Elite) తయారుచేసే ప్రాచీనపద్ధతి కొంచెంగా మారినా, ఇంకా పోలేదు. ఆ పాతపద్ధతిలోనే ఆ విద్యలో ప్రత్యేకత సంపాదించాలనే వుబలాట పడుతున్నాము. ఇరువై ఒకటవ సంవత్సరం వరకూ మన విద్యార్థులూ అమెరికన్లకంటే కష్టపడవలసి వస్తుంది, కాని రష్యన్లకంటే కాదు. పద్దెనిమిదవ సంవత్సరం వచ్చేప్పటికి మన శుద్ధశాస్త్రజ్ఞులకు శాస్త్ర

మును గురించి తెలిసినంత (ప్రపంచములో ఎవరికీ తెలియదు (తక్కిన విషయాలలో అజ్ఞానం ఎలా ఉన్నా). ఇరవై ఒకటవ సంవత్సరంలో పట్టభద్రులైనప్పుడు కూడా ఇంకా తక్కిన వారికన్నా ఒక మెట్టు ఎక్కువే నని చెప్పాలి.

అమెరికాలో పద్ధతి వేరు. పద్దెనిమిదవ సంవత్సరం వచ్చేవరకూ దేశంలో ఉండేవారందరినీ హైస్కూళ్ళలో చదివిస్తారు. విద్యావిధానం కొంచెం శిథిలంగా ఉండటముచేత గణితములోనూ, శాస్త్రాలలోనూ క్షుణ్ణంగా శిక్షించటమే వారి ఉద్దేశము. వీరిలో చాలా మంది కళాశాలలలో చేరుతారు. ఇక్కడ కూడా, హైస్కూళ్ళలో వలెనే విద్యాప్రణాళిక శిథిలంగా ఉంటుంది. నాలుగేళ్ళ తర్వాత వారు మన విద్యార్థులంత క్షుణ్ణంగా శిక్షణ పొందకపోయినా, వారి విద్యావిధానంలో స్వతంత్రమయిన ఊహాలకు ఉండే అవకాశంవల్ల తమ ఉత్సాహాన్ని కోల్పోరు. పిహెచ్. డి. (Ph. D.)తో నిజమయిన కష్టాలు ప్రారంభమవుతాయి. అక్కడినుంచి విద్యార్థులు తీవ్రంగా పనిచేయవలసివస్తుంది. మనము ఎంతమంది పట్టభద్రులను తయారు చేస్తామో వారంతమంది పిహెచ్.డి. లను (శాస్త్రంలోనూ, ఇంజినీరింగ్ లోనూ) తయారుచేస్తారు. దీనినిబట్టి విద్యార్థుల ప్రతిభ ఎటువంటిదో గ్రహించవచ్చు.

రష్యాలో హైస్కూళ్ళ విద్యాప్రణాళికలు మనవాటంత ప్రత్యేకతా సంపాదనదృష్టి కలవి కావు. కాని అమెరికన్ ప్రణాళికలకంటే కష్టమైనవి. చాలమంది కివి మరీ కష్టంగా ఉన్నాయని గ్రహించి మార్చటానికి చూస్తున్నారు. మొత్తానికి ప్రతివారినీ యూరోప్‌లో ఉండే లైసే (Lycee) పద్ధతిలో శిక్షించే ప్రయత్నం కనబడుతుంది. అందరూ అన్ని విషయాలూ చదివి తీరాలి – ప్రత్యేకంగా గణితంలోనూ, శాస్త్రంలోనూ. కళాశాలలలో ఈ పద్ధతి హఠాత్తుగా మారిపోయి, మొత్తం అయిదుసంవత్సరాల శిక్షణకాలంలో చివరి మూడుసంవత్సరాలలోనూ, విశేషజ్ఞానసంపాదన మనకంటే తీవ్రమయిపోతుంది. ప్రతి ఇంగ్లీషు విశ్వవిద్యాలయములోనూ మెకానికల్ ఇంజనీరింగ్ లో ఆనర్స డిగ్రీ తీసికొనవచ్చు. రష్యాలో దీనితో సమానమయిన డిగ్రీ రెండుమూడు శాస్త్రాలతో కలిపి తీసికొనే అవకాశాలు ఉన్నాయి.

వారు నామాట వింటారని కాదు కాని ఇంజనీర్ల శిక్షణవిషయం కొంచెం మితిమీరిపోయేటంతగా ప్రవర్తించారని నే ననుకుంటున్నాను. ఇంజనీర్లను కూడా అవసరం లేనంత మందిని తయారుచేస్తున్నారని నా అభిప్రాయం. మిగిలిన ప్రపంచంలో ఉండే ఇంజనీర్ల మొత్తపు సంఖ్య కన్నా రెండురెట్లు పెద్దది రష్యాలోని ఇంజినీర్ల సంఖ్య. అమెరికాలోని శుద్ధశాస్త్రజ్ఞుల సంఖ్య రష్యాలోకంటే కొంచెమే తక్కువకాని భౌతిక, గణితశాస్త్రాలలో రష్యన్లదే ముందంజ.

కొన్ని సందేహాలున్నా, రష్యన్ల పద్ధతే మంచిదని నే ననుకుంటున్నాను. వైజ్ఞానిక విప్లవాన్ని వారే మనకన్నా, అమెరికన్లకన్నా ముందు అర్థం చేసుకున్నారు. రెండు సంస్కృతులూ ఒకదానికొకటి దూరమైపోలేదేమో అక్కడ. ఇటీవల వ్రాసిన రష్యన్ నవల దేనిని చదివినా ఈ విషయము తెలుస్తుంది. పాఠకులలో యంత్రాలకు సంబంధించిన సూత్రపరిచయం ఉందని రచయిత భావిస్తాడు. శుద్ధశాస్త్రం కనుపించదు. అంటే అక్కడకూడా సాహిత్య విషయాలలో నే ఆసక్తికలవారు లేకపోలేదనిపిస్తుంది. అయితే ఇంజనీరింగు కనిపిస్తుంది. అమెరికన్ నవలల్లో మానసిక వైద్యులు ఎంత సామాన్యంగా ఉంటారో రష్యన్ నవలలలో ఇంజనీర్లు అంత సామాన్యంగా ఉంటారు. బాల్జాక్ (Balzac) చేతి పనులపైన చూపినధ్యాస వీరు పారిశ్రామికోత్పత్తిపైన ప్రదర్శిస్తారు. ఈ నవలలలో గమనించదగ్గ విషయము వారికి విద్యపైగల తీవ్రమైన నమ్మకమే. మా తాతగారు విద్య నేవిధంగా గౌరవించేవారో వీరుకూడా అదేవిధంగా గౌరవిస్తున్నారు. ఈ గౌరవంలో ఆదర్శాలూ, ఆశలూ కూడా మిళితమయి ఉంటాయి. ఏది ఎట్లా ఉన్నా, రష్యన్లు ఒక్కరే దేశాభివృద్ధికి కావలిసినది శాస్త్రజ్ఞులూ, ఇంజనీర్లూ అని గ్రహించారు.

అభివృద్ధి చెందిన దేశాలన్నిటిలోనూ మన పరిస్థితి చాలా ప్రమాదకరమైనది. దీనికి కారణాలు చరిత్రలోనే ఉన్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యంపైన చూపిన శ్రద్ధ వైజ్ఞానికవిప్లవంపైన చూపి ఉంటే కొంచెం బాగా ఉండేదేమో కాని, అలా జరగలేదు. మనదేశంలో పండే ఆహారము మనజనాభాలో సగము మందికే సరిపోతుంది. అందుచేత ఫ్రాన్స్, స్వీడెన్ల కంటే మనమే ఎక్కువ క్లిష్టస్థితిలో ఉన్నాము. సహజమయిన ప్రకృతి సంపదలు మనకు చాలా తక్కువ— పెద్దదేశాలతో పోల్చుకుంటే ఏమూలకీ రావు. ఇంతకీ మనకు ఉండే సంపద మన చాతుర్య బలమే. స్వాభావికంగా నైతేనేమి, మరొకవిధంగానైతేనేమి మనము లౌక్యులము. ఇదే మన బలము. మనకు మన జనసంఖ్యను మించినంతగా కల్పనాశక్తి, యంత్రనిర్మాణశక్తి ఉన్నాయేమో ననిపిస్తుంది కొన్ని సమయాలలో. ఒక జాతి, దేశము తక్కినవాటిని మించిన తెలివికలిగి

ఉంటుందని తేనవటంలేదు, కాని మనము ఎవరికీ తీసిపోము.

అటువంటప్పుడు అందరికన్నా మనమే వైజ్ఞానిక విప్లవంయొక్క ప్రాముఖ్యము గ్రహించిఉండాలి. అందరినీ మించి ఉండాలి. కొన్ని విషయాలలో ఏదో కొంచెము చేశామనుకోండి. పరమాణుశక్తి వినియోగంలో మనదే అగ్రస్థానం. శుష్కమైన ఘనీభవించిన మన విద్యావిధానంలోను, ఉభయసంస్కృతులలోను సద్దుకోవడానికి ప్రయత్నిస్తున్నాము.

కాని ఇది చాలదు. సరిగ్గా చదువుకోవకపోతే నాశన మవుతా మనటం అతిశయోక్తి. కాని మన విద్యావిధానాలను మార్చుకోనకపోతే మన జీవితకాలంలోనే దిగజారిపోతా మనటంలో అబద్ధంలేదు. వాటిని మార్చకుండా మన మేమీ చెయ్యలేమని నేను గట్టిగా నమ్ముతున్నాను. ఇది చాలా కష్టమని నాకూ తెలుసు. ఇది మనలో చాలామంది మానసికాభిరుచులకు వ్యతిరేకంగా ఉంటుంది. ఎన్నోవిధాల నా స్వంత అభిరుచులకే వ్యతిరేకంగా ఉన్నది. ఎందుచేతనంటే, నశించిపోతున్న ప్రపంచంలో ఒక కాలు ఉంచి, ఎలాగయినా జన్మించాలనే మరొక ప్రపంచంలో రెండవ కాలు ఉంచాను కాబట్టి. నేను చెప్పినవాటిని అంగీకరించే శక్తి మనకందరికీ ఉంటే బాగుండును.

ఇదంతా మనదేశానికి సంబంధించిన సమస్య. దానిని పరిష్కరించుకోవలసినవారం మనమే. అసలు విషయ మేమిటంటే, వైజ్ఞానికవిప్లవంవల్ల పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలప్రజలు క్రమంగా ఐశ్వర్యవంతు లవుతున్నారు; ఈ అభివృద్ధి చెందని దేశాల ప్రజలుమాత్రం దరిద్రులుగా ఉండిపోతున్నారు. వీరిద్దరి మధ్య తారతమ్యమూ రోజు రోజుకు ఎక్కువై పోతున్నది. ప్రపంచం మొత్తంమీద చెప్పాలంటే, ఈ తారతమ్యము బీదవారికీ గొప్పవారికీ ఉండేదే.

ధనవంతమయిన దేశాలలో అమెరికా, తెల్లజాతికి చెందిన కామన్‌వెల్త్ దేశాలూ, బ్రిటన్, యూరోపులో చాలా భాగం, రష్యాలను చేర్చవచ్చు. చైనా ఎటూకాకుండా ఉన్నది. మిగిలినవా రందరూ బీదవారే. గొప్పదేశాల ప్రజలు ఎక్కువకాలం బ్రతుకుతున్నారు, కడుపునిండా తింటున్నారు, తక్కువ పని చేస్తున్నారు. ఇండియావంటి బీదదేశంలోని మనుష్యుల జీవిత పరిమాణం ఇక్కడి దానిలో సగం కూడా లేదు. ఇప్పటి ఆసియా వాసులు తమ తండ్రులనాటి వారికంటే తక్కువ తింటున్నారని వింటున్నాము. దీని వివరాలు లేవు గాని ఇది నిజముకాదని నాతో కొందరు చెప్పారు. ఏమైనా, బీదదేశాలలోని ప్రజలు కేవలం బ్రతకడానికి కావలసినంత మాత్రమే తిన గలుగుతున్నారన్నమాట నిజము. శిలాయుగం ఉత్తరార్ధంలో ఏవిధంగా పనిచేసేవారో ఇప్పుడూ ఆ విధంగానే పనులు చేస్తున్నారు. ప్రజాబాహుళ్యానికి జీవిత మెప్పుడూ భయంకరంగా, అసహ్యంగా, అల్పంగా ఉండేది. ఈ వెనుకబడిన దేశాలలో ఇంకా అలాగే ఉన్నది.

పేదవారిమధ్యా. ధనవంతులమధ్య ఉండే తారతమ్యం పేదవారే మొదట గమనించారంటే ఆశ్చర్యం లేదు గమనించినతర్వాత ఊరికే ఉండరు. క్రీ॥ శ॥ 2000 వరకూ ఏది మిగిలినా ఈ తారతమ్యం మాత్రం మిగలదని నిస్సందేహంగా చెప్పగలను. ధనార్జనలో గహస్య మేమీ లేదుగనుక, ఈ రెండు తరగతులూ కలిసి ఉండలేవు.

పాశ్చాత్యదేశాలే రావలసిన మార్పును తీసికొని రాగలవు కాని ఈ దేశాల సంస్కృతిలో కలిగిన విభజనవల్ల ఈ మార్పుయొక్క అవసరం పూర్తిగా గ్రహించలేకపోతున్నారు. ఇప్పటివరకూ మానవ చరిత్రలో మార్పులు చాలా నెమ్మదిగా జరిగాయి; ఒకవ్యక్తి జీవితంలో తెలిసేవి కావు. నేటి పరిస్థితి వేరు. మన ఊహాకే అందనంత త్వరగా మార్పులు జరిగిపోతున్నాయి. పై దశాబ్దంలో ఇంతకుముందు ఎప్పుడూ లేనిమార్పు కలిగితీరుతుంది. రెండు దశాబ్దాల తర్వాత ఇంకా తీవ్రంగా ఉంటుంది. బీదదేశాలలో ఈ విషయాన్ని ప్రజలు గ్రహించారు. ఈ మార్పుకోసం చేతులుకట్టుకుని కాచుకు నేందుకు సిద్ధంగా లేరు.

ఇంకొక వంద రెండువందల సంవత్సరాల తర్వాత పరిస్థితి బాగుపడవచ్చునని చెప్తే, వారికి ఒళ్లు మండుతుంది. "వీరు మనతో సమానంగా కావాలంటే అయిదువందల సంవత్సరాలైనా పడుతుంది." అని ఆసియా, ఆఫ్రికాలలో కొంతకాలం గడిపిన నిపుణులు అనటం వింటూఉంటాము. ఇదెంత ప్రమాదకరమైనదో తెలుసుకోవటం ముఖ్యము. ఈ విధంగా అనేవారితో సాధారణంగా ఆదిమ (Neanderthal) మానవుడు అయిదేళ్ళలో సమానం కాగలుగుతా డనిపిస్తుంది.

మార్పు ఎంతశీఘ్రంగా జరుగుతుందో నిర్ధారణ అయిపోయినది. మొట్టమొదటి ఏటంబాంబు ప్రేలిన తర్వాత "ముఖ్యమయిన రహస్యం కాస్తా బయటపడిపోయింది-అసలు ఈ బాంబు పనిచేయడమే." అని ఎవరో అన్నారు. కావాలనుకుంటే ఏ దేశమయినా ఏటంబాంబు చేయగలదు. ఇదేవిధంగా రష్యా చైనాల పారిశ్రామికాభివృద్ధిరహస్యం ఒక్కటే; అదేమిటంటే అభివృద్ధి జరగటము. ఆఫ్రికన్లు,ఆసియావాసులు దానిని చూస్తున్నారు. రష్యన్లు నలభై ఏళ్ళలో ఈ అభివృద్ధిని సాధించారు. వారి కప్పటికే పరిశ్రమ ఉన్నది. (జారిష్టు పాలనలో పరిశ్రమ కేమీ తక్కువ

లేదు.) ఈ నలభైఏళ్ళలో ఒక అంతర్యుద్ధమూ తర్వాత ప్రపంచయుద్ధమూ జరిగాయి. చైనాలో వారికున్న పారిశ్రామికావకాశం చాలా తక్కువ. అయినా త్వరలో సాధించేట్లున్నారు.

ఈమార్పు లెంతో బాధపడగ వచ్చినవి; ఎంతో త్యాగం చెయ్యగా కలిగినవి. ఈ బాధలో ఎక్కువ భాగం అనవసరంగా పడ్డమాట నిజం. దానినిమాని ఊరుకోవటం కష్టము. దానివల్ల రుజువయ్యేదేమిటంటే మనుష్యులు రేపటిభుక్తికోసం ఇవాళ ఎంతకష్టపడతారో అన్నది. ఇవాళ భోజనమంటే ఎవరూ ఉదాత్తంగా ప్రవర్తించరు. భోజనమంటే కలిగే చైతన్యమే వేరు.

ఈ మార్పులు నిరూపించిన సత్యమింకొకటి ఏమిటంటే 'టెక్నాలజీ' చాలా సులభమయినదని. దీనిని గ్రహించే సామర్థ్యం శాస్త్రీయమైన సంస్కృతికి మాత్రమే ఉన్నది. మరొక విధంగా చెప్పాలంటే, మనుష్యులు నేర్చుకొనే వాటిలో టెక్నాలజీకి సంబంధించినంతవరకూ జరుగబోయే విషయాలను తెలుసుకోవచ్చు. చాలాకాలం పాశ్చాత్య దేశాలవారు దీనిని గుర్తించలేకపోయారు. చాలామంది ఇంగ్లీషువారు ఆరు, ఏడు తరాలుగా యంత్రపరికరాలలో సామర్థ్యం చూపారు. కనుక ఈ సామర్థ్యం మరొకరికి రాదనుకొన్నాము. ఈ విషయంలో మనకొక సౌకర్యం ఉన్నమాట నిజమే. తరతరాల సంప్రదాయంతో దీనికేమీ సంబంధము లేదు. కేవలం మనపిల్లలు ఆడుకునే వస్తువులు యంత్రాలు కలవి గనుకనే. వారు చదవటం రాక మునుపే యాంత్రికమైన విషయాలు తెలుసుకుంటున్నారు. అదేవిధంగా అమెరికాలో మోటారుకార్లు అధికంగా ఉండటముచేత అందరూ మంచి మెకానిక్కులుగా తయారయ్యే అవకాశం ఉన్నది. కడచిన ప్రపంచయుద్ధంలో ఇది చాలా సహాయపడినది. రష్యా అమెరికాను అందుకోవడానికి ప్రయత్నిస్తున్నా, మోటారుబండ్లు తక్కువ కనుక ఇంకా కొంచెంకాలం పడుతుంది.

ఒక దేశాన్ని పారిశ్రామికంగా మార్చాలంటే కావలసినంత దృఢనిశ్చయముంటే చాలు. కావలసినంతమంది ఇంజనీర్లనూ, శాస్త్రజ్ఞులనూ తయారుచేయడానికి ఒకజాతికంటే మరొక జాతిగాని, ఒక దేశంకంటె మరొక దేశంగాని శాస్త్రీయమైన శిక్షణలో స్వాభావికంగా సామర్థ్యం చూపుతుందనే ఊహకు ఆధారములేదు. ఇంచుమించు అందరూ ఒక్కటే అనవచ్చు. సంప్రదాయమూ, సాంకేతికశిక్షణా, ప్రధానమని అందరకూ తెలిసిన విషయమే.

దీనిని మనమే చూస్తున్నాము. రోమ్ విశ్వవిద్యాలయములో సిసీలియన్ యువతులు భౌతిక శాస్త్రంలో ఆనర్స్ పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులు కావటం నాకు తెలుసు. ముప్పై సంవత్సరాల క్రితం వారే ఘోషాలో ఉండేవారు. 1930 లో జాన్ కాక్రాఫ్ట్ మాస్కోనుంచి తిరిగి రావటం నాకు బాగా జ్ఞాపకం ఉన్నది. అక్కడ ఫ్యాక్టరీలను కూడా చూసివచ్చాడని వినగానే కొందరు అక్కడి గ్రామీణులు యంత్రాలముందు సాష్టాంగపడినట్లు కథలు విందామనుకుని, "కార్మికులు ఎలా ఉంటారు?" అని అడిగారు. కాక్రాఫ్ట్ మితభాషి, "మెట్రోవిక్ లో లాంటి వారే" అని ఊరుకున్నాడు. ఎప్పటిలాగే అతను నిజాన్ని తెలుసుకొనగలిగాడు.

కాదనుకుంటే లాభంలేదు. ఇండియా, ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికా, మధ్యప్రాచ్యాలలో వైజ్ఞానిక విప్లవం తీసుకరావటానికి వీలు ఉన్నది. పాశ్చాత్యులు దీనిని గ్రహించకపోవటం తప్పు: అజ్ఞానంకంటే పాపంలేదని చెప్పగలిగే పరిస్థితులలో ఇది ఒకటి.

ఐశ్వర్యాలైశ్వర్యవంతాలయిన దేశాల మధ్య తారతమ్యం తొలగించవచ్చు. తొలగిపోతుంది కూడా. మనం దూరదృష్టితో, ఔదార్యంతో, సహజమైన స్వార్థంతో ప్రవర్తించకపోతే యుద్ధంతోబాటు కరువుకూడా వస్తుంది. మనల్ని ఎదుర్కొనే ప్రశ్నలు "ఏవిధంగా?" "ఎవరిచేత?" ప్రపంచమంతా వైజ్ఞానిక విప్లవం కావాలంటే పెట్టుబడి కావాలి. యంత్రరూపంతో సహా అన్నిరకాలైన పెట్టుబడులు కావాలి. ఒక దశ వచ్చేవరకూ దరిద్రదేశాలు ఈ పెట్టుబడి మొత్తాన్ని సాధించలేవు. అందుకనే తారతమ్యం ఎక్కువవుతున్నది. పెట్టుబడి బైటనుంచి రావలసినదే.

పెట్టుబడితర్వాత కావలసినది శిక్షణ పొందిన మనుష్యులు. అంటే కావలసినంతమంది ఇంజనీర్లూ, సైంటిస్టులూ విదేశాలలో పదిహేను సంవత్సరాలు ఉండగలగాలి. ప్రస్తుతం, ఈ విషయంలో రష్యన్లదే పైచేయిగా ఉన్నది. ఇక్కడే వారి విద్యావిధానం ప్రయోజనం తెలుస్తున్నది. వారికి అలాంటివారు కావలసినంతమంది ఉన్నారు. మనకు లేరు; అంటే అమెరికన్లకుకూడా. చైనాతో పోల్చదగ్గ పారిశ్రామికాభివృద్ధిని తీసుకువచ్చేటందుకు అమెరికా బ్రిటన్లు ప్రయత్నించాయనుకొండి. ఎంత పెట్టుబడి కావాలో ఆలోచించండి. పది, ఇరవై వేలమంది ఇంజనీర్లు కావలసివస్తారు. ప్రస్తుతం అంతమంది మనకు దొరకరు.

ఇటువంటివారికి కేవలం సాంకేతికమైన శిక్షణ ఉంటే చాలదు. మానవజాతి సంబంధమయిన విషయాలలో కూడా శిక్షణ కావాలి. "పెద్దరికాన్ని" పూర్తిగా వదలించుకుంటేగాని వారి పనిని వారు చేయలేరు. ఫ్రాన్సిస్ క్సేవియర్ నుంచి ఆల్బర్ట్ ష్వైట్జర్ వరకూ చాలామంది యూరోపియన్లు ఆసియన్లకూ, ఆఫ్రికన్లకూ ఉదాత్తమయిన సేవచేశారు. కాని ఇటువంటివారు కాదు ప్రస్తుతం కావలసినది. పాత్రికేయులవలె ప్రవర్తించి, తెలిసినదేదో చెప్పి వారిపని చేసినతర్వాత వెళ్ళిపోయేవారు మాత్రమే కావాలి. అదృష్టవశాత్తు ఈ వైఖరి శాస్త్రజ్ఞులకు సులభంగా వస్తుంది. విజాతిద్వేషం వారిలో తక్కినవారికంటె తక్కువ. వారిసంస్కృతి అసలు ప్రజాస్వామ్య స్వభావం కలది. ఆసియా, ఆఫ్రికాలతో శాస్త్రజ్ఞులే మనకు మంచి చేయగలుగుతారు.

మనసమస్య పరిమాణం (ఇంత ఉందని) తేలింది. అంగబలం రూపంలోనూ, పరికరాలరూపంలోనూ బ్రహ్మాండమయిన పెట్టుబడి కావాలి. (ఈ పెట్టుబడిని ప్రస్తుతం మనం సరఫరా చేయలేని స్థితిలో ఉన్నాము.) ప్రతిఫలం వెంటనే దొరకదు. ఆ పైనకూడా చెప్పలేమనుకోండి.

నాతో కొంతమంది ముందే ఈ విధంగా అన్నారు: "సరే అంతా బాగానే ఉన్నది. కాని నువ్వు లౌక్యుడవనుకున్నాము. రాజకీయాల సూక్ష్మ నిర్మాణాన్ని అనుశాసించడం నీకు ఇష్టమనుకున్నాము. మానవులే విధంగా ప్రవర్తిస్తారో తెలుసుకొనడానికి ప్రయత్నించావనుకున్నాము. వారు నువ్వు చెప్పినట్లు ప్రవర్తిస్తారని నిజంగా నమ్మగలవా? పార్లమెంటరీ సంప్రదాయము కల మనదేశంలో, అమెరికాలో నీ ప్రణాళిక సిద్ధించేందుకు అవలంబించవలసిన రాజకీయపద్ధతి నీకు తెలుసా? ఇది జరిగే అవకాశం, పదికి ఒకరైనా ఉన్నారని నీకు అనిపిస్తున్నదా?"

ఇది సబబుగానే ఉన్నది. నాకు తెలియదనిమాత్రం సమాధానమివ్వగలను. అహంకారాలను గురించీ, దౌర్బల్యాలనుగురించీ, దర్పాలనుగురించీ, మనుష్యులలోని అధికారవాంఛలనుగురించీ చెప్పినంతమాత్రాన చాలునా? అసలు, వారంతే. వారే మన శిల్పసామగ్రి. మన స్వార్థంద్వారానే వారినిగురించి నిర్ణయించగలము. కొన్ని సమయాలలో వారు ఇంకా స్వార్థంతో ప్రవర్తిస్తారు. దానిని గ్రహించలేని "లౌక్యము" నిరర్థకమైనది.

ఎంతచెప్పినా, ఏమీ తెలియదనడం నిజంకాదు. నాకొకమార్గం తోస్తున్నది. దానిద్వారా పాశ్చాత్య నాగరికతలో మానవాకాశాలపై ఉండే నమ్మకాన్ని ఫలించేట్లు చేయవచ్చు. నేను చేయగలిగినది 'సాధించవచ్చునే'-ఇది ఎంత అసంతృప్తికరమైనదైనప్పటికీ. కాని ఇదికూడా నాకు మనశ్శాంతిని చేకూర్చగలదు తప్ప మరేమీ చేయలేదు.

ఒక్కటిమాత్రం చెప్పగలను. మనం చేయగలిగినా, చేసినా, చేయకపోయినా ఊరుకున్నామంటే కమ్యూనిస్టులు చేసివేస్తారు. ఈ చేయడంలో తామే కాక ఇతరులుకూడా అమితంగా బాధపడేటట్లు చేస్తారు. కాని ఏలాగో సాధిస్తారు. ఇదిగనుక జరిగితే మనము నైతికంగా, ప్రయోజనాత్మకంగా పరాజయము పొందాము అన్నమాట. మరి ఉంటే పాశ్చాత్యదేశాలన్నీ కలిసి తక్కిన ప్రపంచంలో ఒక ద్వీపంగా ఉండిపోతాయి: మనదేశం ఇందులో మరొక ద్వీపంగా ఉండిపోతుంది. దీనిని నిస్సహాయంగా స్వీకరించి ఊరుకోవడమేనా? చరిత్ర లోపాలను క్షమించదు. ఒకవేళ మనము గనుక నెగ్గలేకపోతే ఆవిషయాన్ని చరిత్రగా వ్రాసే అవకాశమే ఉండదు.

ఇంతలో, ప్రాజ్ఞులు చేయగలిగినవి కొన్ని ఉన్నాయి. విద్యాభ్యాసం అన్ని సమస్యలకూ పరిష్కారం కాదు. కాని విద్యలేకుండా ఏ విషయాన్నీ ఎదుర్కొనలేము. అన్ని సూచనలూ ఒకేమార్గాన్ని చూపిస్తున్నవి. రెండు సంస్కృతులమధ్య ఉన్న విభేదాన్ని తొలగించడం మానసికంగానూ, ప్రయోజనాత్మకంగానూ కూడా అత్యవసరము. ఇవి రెండూ వేరైపోయినప్పుడు ఏ సమాజమూ విచక్షణ చూపజాలదు. మేధావిజీవితవృక్షణంకోసం, ఈ దేశం ఎదుర్కొనే ప్రమాదం నివారించడంకోసం, బీదవారి మధ్యన విపరీతంగా వైభవంతో ఉంటున్న పాశ్చాత్య దేశాల రక్షణకోసం, విచక్షణ ఉంటే దారిద్ర్యం అనుభవించ నక్కరలేని దరిద్రులకోసం, మనమూ, అమెరికన్లూ కూడా కొత్తమార్పు అలవరుచుకోవాలి.

కావలసినంత వ్యవధి ఉన్నదనుకుంటూ పెరిగాము; అంత లేదని ఇప్పుడు తెలిసికొనగలుగుతున్నాము. ఎంత తక్కువో ఆలోచించడానికి భయంగా ఉన్నది. [ఎన్‌కౌంటర్ 'నుంచి]

## సవరణ

సెప్టెంబర్ సంచికలోని "విడిపోతున్న రెండు సంస్కృతులు" వ్యాసంలో 51 వ పుటలో Wave అనడానికి మారు wane అని, 56 వ పుటలో Luddites అనడానికి మారు Luddits అని అచ్చు తప్పు దొర్లింది.

—సంపాదకుడు.

# బిరుద నామధేయములు

శ్రీ విక్రాల శేషాచార్యులు

[ఆగస్టు సంచిక తరువాయి]

## వేదాంతదేశికుడు

వీరి అసలు నామధేయము వేంకటనాథాచార్యులు అని. శ్రీరంగనాథ ప్రసాదలబ్ధమైనది వేదాంతదేశిక బిరుదము.

శ్రీధియోగ్యే (1192) శకే శుక్ల
ఉపభూ ద్వేంకటేశ్వరః,
లబ్ధప్రాయే (1293) శకే ప్రాయా
త్స్వామ్యేన పరమం పదం.

అను వీరచరిత్రాంతర్గతశ్లోకముంబట్టి శాలివాహన శకము 1192 లో వీరి అవతారము. అప్పుడు క్రీ. శ. 1269 వ సంవత్సరమగును. అవతారసమాప్తి శా. శ. 1293. అప్పుడు క్రీ. శ. 1369 సంవత్సరము. 1369 లో 1269 తీయఁగా 100. ఇది వీరి విభవ (జీవిత) కాలము. అనఁగా నిప్పటికి 590 యేఁడులనాటివారు. కాంచీపురనివాసులు. విశిష్టాద్వైత సిద్ధాంతములో వడగల సంప్రదాయమునకుఁ బ్రవర్తకులు. సంస్కృత ద్రావిడ భాషలలో 150 గ్రంథములకుఁ గర్తలు. శ్రీ భగవద్రామానుజ రచిత శ్రీ భాష్య గీతాభాష్యాది గ్రంథములకు గొప్ప వివరణముల నిర్మించినవారు. న్యాయపరిశుద్ధి, న్యాయసిద్ధాంజనము, సేశ్వర మీమాంస, మీమాంసాపాదుక, తత్త్వ ముక్తాకలాపము, శతదూషణి, భూగోళ నిర్ణయము, మొదలగు తర్క మీమాంసా వేదాంత జ్యోతిషాది వివిధ శాస్త్రములందు ననేకములైన యుద్గ్రంథములను విరచించి యంతస్తమస్సు నడంచిరి. వీరిది విశ్వామిత్ర గోత్రము. తమ గోత్ర ప్రవర్తకుఁడైన యా విశ్వామిత్ర మునీంద్రుఁడు కమలాసను సృష్టికిఁ బ్రతి సృష్టి యొనర్చినట్లు కాళిదాసుని రఘువంశము, కుమార సంభవము, మేఘ సందేశములకు వరుసగ యదువంశము, మార సంభవము, హంస సందేశములను మహాకావ్యములను, ప్రబోధచంద్రోదయాది నాటకములకు సంకల్ప సూర్యోదయాది నాటకములును విరచించి కావ్యరస పిపాసువులకుఁ గాంతుతీర కావ్యసుధాకలశముల నొసంగినవారైరి. మఱియు పాదుకాసహస్రమును నిర్మించి మొట్ట మొదట సహస్ర వాఙ్మయము రచనకాది కవియై యొప్పిరి. ఇట్టి మహనీయుని కవిత్వ లక్ష్మికిని స్వకీయ (వైష్ణవ) మత స్థాపనమునకు నలరి సాక్షాత్తుగ శ్రీరంగనాథ భగవానుఁడే "కవితార్కిక సింహ" యను బిరుదమును, వేదాంతశాస్త్ర ప్రతిష్ఠాపనమునకు నామోదించి "వేదాంత దేశిక" పదమును, ఆ దేవదేవుని పట్టపురాణి శ్రీరంగనాయకి మహాలక్ష్మి "సర్వతంత్ర స్వతంత్ర" బిరుదమునున్ను పవిత్ర పండిత ప్రకాండమండల మధ్యమున ననుగ్రహించిరి. ఇది మొదలు వేదాంత దేశిక నామమున జగన్నుతుఁడవు కమ్మనియు శ్రీరంగనాథుఁ డనుగ్రహించె. నాఁటం గోలె వారి కా నామధేయమే నామధేయమై యొప్పుచున్నది. ఇప్పుడు వేంకటనాథాచార్యులనిన నెవ్వరికిని నెఱుకపడదు. వేదాంతదేశికు లనిననే వీరు స్ఫురింతురు. భగవద్వాక్యము రిత్తవోవునే? ఇట్లు శంకర రామానుజాదులతోఁ దేవతలు ఋషులు సంవాదములు జరిపినట్లు వారి చరిత్రములు చెప్పుచున్నవి. వీరు దేవాంశసంభూతులు కనుక వీరితో దేవ ఋషులు సల్లాపములు చేసిరనుటలో బంధువులతో బంధువులు మాట్లాడుకొనిరి యనుటలోవలె సందేహ ముండదు. శంకర రామానుజులు వేదాంత స్థాపనార్థము భూమియందవతరించిన సాక్షాత్తు శంకర శేషాహులని చరిత్రములం జదువుచున్నాము. వీరును తదర్థము శ్రీ వేంకటేశ్వర ఘంటాంశముతో నవతరించిరి యని వీరి చరిత్రములు నుడువుచున్నవి. దేవాంశ సంభూతులతో దేవర్షులు సంభాషించుట స్వాభావికమే. వీరికి నామధేయముగా జగద్గృహీతమైన ఈ వేదాంతదేశిక బిరుద నామమే వేదాంతశాస్త్రములో నిస్సీమప్రతిభగల వెనుకటివారికి ముందు మఱియొక విశేషణపదమును చేర్చి బిరుదముగ నివ్వఁబడుచున్నది. ఎట్లన? "అభినవ నిగమాంతాచార్య, అభినవ నిగమాంత దేశిక" యని. వేదాంత దేశికులకే నిగమాంత దేశికులని నామాంతరము. ఈ బిరుదము వడగలసంప్రదాయపు వైష్ణవ పండితులలో మిక్కిలి ప్రచారము నొందియున్నది. వీరు రచించిన సమస్త గ్రంథములపేళ్లు సరహస్యముగ శ్రీమాన్

మా తండ్రిగారిచే రచితమైన "ఆళ్వారాచార్య జనన దేశకాలాది నిరూపణ" మను గ్రంథమునందుఁ దెలుపఁబడియున్నవి.

ఈ వేదాంతదేశికయను బిరుదము వైఖానసులలో "వైఖానస మహిమ మంజరి" మున్నగు గ్రంథముల రచయితయగు శ్రీనివాసదీక్షితులకును గలదు. ఐనను వాల్మీకివ్యాసులును వ్యాసశబ్దోచితులేయైనను వ్యాస శబ్దముతో మహాభారత ప్రణేతయైన కృష్ణద్వైపాయనుఁడే స్ఫురించుచున్నట్లులు వేదాంత దేశికుఁ డనఁగనే ప్రకృత చర్చ్యమానులగుచుండు మహానుభావుఁడే హృదయపీఠి నలంకరించుచుండును. సర్వతంత్ర స్వతంత్ర శబ్దమున్ను ఇట్టులే వీరియందే సుప్రసిద్ధమై యున్నది.

## వైదిక సార్వభౌముడు

ఈయనయొక్క తొలినామము వేంకటనాథాచార్యులు. తోళప్పర్ అని ద్రవిడనామము. ద్రవిడదేశవాసులు వడగల సంప్రదాయమునకుఁ జేరిన శ్రీవైష్ణవులు. హారీతగోత్రులు. ఏ శతాబ్దములోనివారో తెలియదుగాని (కొంత) ప్రాచీనులు. వీరు ధర్మశాస్త్రమునందు బహు గ్రంథములను విరచించినవారు. వీరి రచనలు- దశనిర్ణయి 1. స్మృతి రత్నాకరము 2. పితృమేధసారము 3. సుధీవిలోచనము (పితృమేధసార వ్యాఖ్యానము) 4. ప్రయోగచంద్రిక 5. ఆశౌచశతకము 6. గృహ్యరత్నము 7. కంఠభూషణము 8. అనునవి ప్రచురింపఁబడి యున్నవి. ఇంకను శ్రౌతమీమాంసా వేదాంత శాస్త్రములలోను ననేక గ్రంథములను విరచించినట్లు నుడివెదరు. ఆశౌచశతక రచన నాటికి వైదిక సార్వభౌమ బిరుదము లబ్ధముకాలేదు. కనుకనే యందు అదివదలి కడమ గోత్ర పిత్రాది నామములు మాత్రము నుడువఁబడినవి.

"వేదేఽద్వితీయః స్మృతిషు ప్రవీణో
వేదాంతవిచ్ఛ్రాంతమనా శ్శ్రుతేషు,
సుధీ స్సుశీలో హారితాన్వయార్క
జయత్యయం వైదిక సార్వభౌమః."

ఇత్యాదిగ గ్రంథాంతములయందు శ్లోకములలో తనను వైదికసార్వభౌమశబ్దముచేతనే చెప్పినను గ్రంథాంత గద్యములలో వేదాంతదేశికులవలె బిరుదమును, అసలు పేరునుగూడా వాడియున్నాడు.

## విద్యానాథుడు

ఈయన నిజనామ మగస్త్యుడు. 4సంస్కృతమున 14 నాటకము లీతనిచే రచింపబడినట్లు తెలియుచున్నది. ఈ మహాకవి మూర్ధన్యము "కావ్యాలంకార సంగ్రహ" మను నలంకారశాస్త్ర గ్రంథమునురచించి ఓరుగంటి వీర ప్రతాపరుద్రున కంకిత మిచ్చి "ప్రతాపరుద్రయశోభూషణ" మని పేరిడినాడు. అప్పటి నుండియే యితనికి "విద్యానాథుడ"ని బిరుద మబ్బినది. ఈ ప్రతాపరుద్రీయము క్రీ. శ. 14 వ శతాబ్దము—ప్రథమపాదమున రచింపబడెనని. చరిత్రకారులు నిర్ణయించియున్నారు. (చూ. ప్రొఫెసర్ పాండురంగ వామన కాణేగారి "హిస్టరీ ఆఫ్ సాంస్క్రిట్ పొయిటిక్స్"-పుట CXIX) కనుక నీయన క్రీ. శ. 14 వ శతాబ్దిలోనివాడు. అగస్త్యుడు రచించిన "బాలభారత" మనెడి 18 సర్గములుగల మహాకావ్యరత్నముకలదు. విమర్శకుల నిర్ణయప్రకారము నిక్కముగ నీయనయే (విద్యానాథుడే) అగస్త్యుడయినచో నేతత్కృతి రత్నములలో నేతత్కృతి రత్నద్వయము నే మనము చదువనోచుకొంటిమి.

## విదగ్ధచూడామణి

పంచాశన్నిఘంటు సారమని గొప్ప నిఘంటువును రచించినకవి. ఈయన నీ పేరుతోనే వ్యవహరించెదరు. ఈయన నిఘంటువు చెన్నపురి అడయారు గ్రంథాలయములో గలదు.

## లీలాశుకుడు

ఈయన ప్రథమ నామము బిల్వమంగళుడు. శ్రీకాకుళక్షేత్రవాస్తవ్యుడు. చింతామణి యను వేశ్యను చేపట్టి బహుకాలము విషయలోలుడై చివరకు వైరాగ్యభక్తి సంపన్నుడు కాగా శ్రీకృష్ణు డేవిధమున తనకు దర్శన మొసంగెనో ఆవిధమును వర్ణించుచు "శ్రీకృష్ణ కర్ణామృతము" అను మధురమైన కావ్యమును రచియించెను. శ్రీకృష్ణు నానతిచేత "లీలాశుక" నామమును ధరించెనట. తన వేశ్యయైన చింతామణి యుపదేశముచేతనే వైరాగ్య మబ్బి అప్పుడు సోమగిరియను సద్గురు నాశ్రయించి తన్మూలమున భగవత్కృపాపాత్రమగుటచేత ఆమెను గూడ సన్మార్గబోధకాచార్యనుగా భావించి గ్రంథాదిని "చింతామణిర్జయతు" అని ప్రారంభించెనని కథలు గలవు. లీలాశుకుడన శ్రీకృష్ణునకు మాటలాడ నేర్పిన పెంపుడు చిలుకవంటివాడని భావము.

---

4. ఇది విమర్శకులు విమర్శించి తేల్చిన విషయము.

# బిరుద నామధేయులు

## బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి

వీరు వేదాంతదేశిక సమకాలికులు. ద్రవిడదేశ వాసులు. పూర్వనామము పేరరుళాళ జీయర్. వేదాంత శాస్త్రసామర్థ్యమును బట్టి వేదాంతదేశికులు వీరికీ బిరుదము నొసంగిరి. నాడు మొదలు ఈ బిరుదుచేతనే వ్యవహృతు లగుచున్నారు. వీరు విద్యావిశేషములందు భగవద్రామానుజులకు బ్రహ్మదేవునికిని సాటియని యీ క్రింది శ్లోకమువలన దెలియుచున్నది.

పర్యాయభాష్యకారాయ ప్రణతార్తిం విధూన్వతే,
బ్రహ్మతంత్ర స్వతంత్రాయ ద్వితీయబ్రహ్మణే నమః.

వీరి వెనుక నీ బ్రహ్మతంత్రస్వతంత్ర బిరుదము సంఖ్యాపూర్వకముగా వీరి సంప్రదాయ పరంపరలో గొందఱకు లబ్ధమైయున్నది—ద్వితీయ బ్రహ్మతంత్ర స్వతంత్రస్వామి, తృతీయ బ్రహ్మతంత్రస్వామి ఇత్యాది. ఈయన సంస్కృత ద్రావిడములయందు బహు గ్రంథ కర్త.

## బాలసరస్వతి

శ్రీశైల వీరరాఘవాచార్యులని అసలు నామము. దాక్షిణాత్యులు. వైష్ణవులు, ఏ కాలమువారో తెలియ రాదు. వీరు పిళ్లైలోకాచార్యులవారు రచియించిన "ముముక్షుప్పడి" యను ద్రవిడగ్రంథమునకు సంస్కృత భాషతో తాత్పర్యదీపికయని మిక్కిలి విపులమైన వ్యాఖ్యానమును నిర్మించినారు. ఇంకను పెక్కు గ్రంథ ములను రచించినట్లు చెప్పెదరు. ముద్రితమైన తాత్ప ర్యదీపిక మొదట పెద్ద అక్షరములతో "బాల సరస్వతీ కృత తాత్పర్యదీపికా" యని గ్రంథనామము యున్నది. కాన వీరీ బిరుదముచేతనే ప్రసిద్ధులైనవారని యూహింప దగియున్నది. వీరినిగుఱించి యింతకన్నను విశేషములు తెలియవచ్చుటలేదు.

## ప్రతివాది భయంకరాచార్యులు

వీరి తొలిపేరు అణ్ణన్ గారు అని. వీరి గురువు వేదాంతదేశిక కుమారులు, ప్రళయకాల ఝంఝా మారుతాచార్యులని ప్రసిద్ధిగాంచినవారునైన శ్రీ నయనారాచార్యులు (లేక వరదాచార్యులు) గారి ముసలితనములో వారితో వాదింపవచ్చిన నరసింహ మిశ్రుడను పేరుగల యొక యుద్దండ పండితుని వాద ములో జయించినందున సంతోషించి గురువుగారు వీరి కీ బిరుదము నొసంగిరి. నాటినుంచి గురుదత్తమైన యీ బిరుదముతోనే వీరు వన్నెకెక్కిరి. వీరి కీ బిరుద ముపలబ్ధమైన, వెనుక వేదాంతదేశికులను తద్బిరుద ప్రాప్త్యనంతరము ఆ బిరుదముతోనే వాకొనునట్లు

"వేదాంతదేశిక కటాక్ష వివృద్ధబోధం
కాన్తోపయన్తృయమినః కరుణైకపాత్రం,
వత్సాన్వవాయ మనవద్యగుణై రుపేతం
భక్త్యా భజామి పరవాదిభయంకరార్యం."

ఇత్యాదిగ వీరిని ప్రతివాదిభయంకరాచార్యులనియే పేర్కొనుట పరిపాటియైనది. వీరి కథలో వీరిని ప్రతి వాది భయంకరాచార్య శబ్దముతోనే వ్యవహరించి యున్నారు చరిత్రకారులు. ఎట్లన ఆచార్య సూక్తి ముక్తావళి ఉత్తరభాగము ఆరవ ఉల్లాసమున

"వాది భీకర! సూరిసత్తమ!
వత్సవంశ విభూషణా!
నాదు నామము వేంకటాచలనాథుఁ
డింద్రుఁడు బుధుల్ మహిన్,
ఆదరంబుగ నిన్ను మున్పరి
కార్య పిల్వఁగ వచ్చితిన్
మోద మొప్పఁగ వచ్చి శ్రీపురి
ముఖ్యవృత్తి వసింపుమా."

ప్రతివాది భయంకరం అణ్ణన్ గారనియు చెప్పెదరు. ఈ ప్రతివాది భయంకరశబ్దమే వాదిభీకరయని, పరవాదిభీకరయనియు చెప్పబడు. ఈ బిరుదము వీరి యనంతరము వీరి వంశస్థులకు ఇంటిపేరునై యొప్పినది. ప్రతివాది భయంకరమువారు అను ద్రవిడదేశవాసులు తెన్గల సంప్రదాయమునకు జేరిన శ్రీవైష్ణవులు. వీరు పెరియనారాచార్యులు శ్రీ మణవాళ మహాముసులు సన్నిధిలో శిష్యులుగాన, వారికాలము క్రీ. శ. 1316–1370 గాన వీరున్ను అప్పటివారే. వీరు రచించిన గ్రంథములు—అష్టశ్లోకీ వ్యాఖ్యానము, వృద్ధిస్తవము, సుప్రభాత స్తవము, మంగళాశాసనప్రబంధము, జియ్యారు పడి ననుసరించి శ్లోకరూప భగవదారాధన క్రమము, శ్రీమద్వరవరముని శతకము. (ఇవి యన్నియు సంస్కృత గ్రంథములు).

## పండితరాయలు

ఈ పండితమణిమకుటముయొక్క నిజనామము జగన్నాథుఁడు. గొప్ప అలంకారశాస్త్ర గ్రంథమైన "రసగంగాధరము"నకు కర్త. సంస్కృతాలంకార శాస్త్రమునందు అదివఱకున్న సిద్ధాంతము లన్నియు దగ్ధంబు చేసి, తన మతమునే సిద్ధాంతీకరించి స్థిర యశము నార్జించుకున్నదిట్టు. అదివఱకు నొకరీతిగా పరిణామము జెందియున్న అలంకార శాస్త్రమంతయు నొక్కసారిగా ఖండించి తన రససిద్ధాంతమును నిల్పి నాడు. ఒక్క యలంకార శాస్త్రమునే కాదు. అన్ని

శాస్త్రములయందు గూడ స్వతంత్రించి క్రొత్త త్రెన్నులు త్రొక్కినాడు. భట్టోజీ దీక్షితులు రచించిన (ప్రౌఢ) "మనోరమ" యను వ్యాకరణమునకు "మనోరమాకుచమర్దనము"ను ఖండన గ్రంథమును జేసినాడు. అప్పయదీక్షితులవారి "చిత్ర మీమాంస"యను అలంకారగ్రంథమునకు "చిత్రమీమాంసా ఖండన" మును జేసినాడు. కేవల శాస్త్రరచనమే గాక అతి మనోహరమైన కావ్యతల్లజములను గూడ జెప్పినాడు. భామినీ విలాసమను గ్రంథములో తాను ప్రేమించిన లవంగియను సుందరి విషయమై చెప్పుకొనినాడు. ఇంకను "జగదాభరణము", "ప్రాణాభరణము", "అసఫ్ విలాసము" అను గ్రంథముల నొనర్చినాడు. ఇవిగాక గంగాలహరి, కరుణాలహరి, లక్ష్మీలహరి, సుధాలహరి, యమునావర్ణన చంపువు అను నీలోనుగాగల రమణీయతమములైన అనేక గ్రంథముల రచించి జగన్నుతుడయినాడు. ఇక్కవి జన్మస్థలము కోనసీమలోని ముంగండయను గ్రామమని చరిత్రకారులు తెలిపెదరు. ఈయన ఢిల్లీ పాదుషాయగు షాజహాను ఆస్థానమునుండి యచ్చటనే "పండితరాయలు" అను బిరుదమును గాంచినాడు. పండితరాజః అని సంస్కృతపదము. ఈయనను "జగన్నాథ పండితరాయ" లనియు చెప్పెదరు.

## డిండిమభట్టు

ఈయన నిజనామము తెలియుటలేదు. తన కవితా చాతుర్యముచేత లోకములోనుండు విద్వాంసుల నందరిని జయించి తన కవిత్వలక్ష్మికి బిరుదావళిగా "డిండిమ"మను వాద్యవిశేషము నొకటి వాయించుచు కవులకెల్ల గుండె దిగులుగా దిగ్విజయము చేయుచు సంచరించుచున్నందున నీయనకు డిండిమభట్టారకుండని పేరుగల్గెనట. వేదాంతదేశికులవారి కవితార్కికసింహేత్యాది బిరుదావళులను విని "రామాభ్యుదయ" మనెడి స్వకృతకావ్యమును దెచ్చి దేశికులవారికిం జూప వారు స్వకృతములైన యాదవాభ్యుదయాది కావ్యమ్ముల జూప నాశ్చర్యరసనిమగ్నుండై దేశికుల నిర్భయమున స్తుతించెనట.

"ద్విచతుష్పద పరివర్తన
గర్విత కవిశరభ గండభేరుండః,
ఖండన ఖండన కవిరిహ
డిండిమ కవిగండ డిండిమో జయతు."

అని వేదాంతదేశిక చరిత్రమునందింతవరకు మాత్రము ఈయన విషయము తెలియుచున్నది. ఈ డిండిమ కవి సార్వభౌములు నలుగురున్నట్లు తెలియుచున్నది. సాళ్వాభ్యుదయ రచయిత రాజనాథదేశికుడును, ఈతని కుమారుడు వీరభద్రవిజయ డిమకర్త అరుణగిరినాథుడును, యోగానందప్రహసనకారుడు అరుణగిరినాథుండును అని చెప్పెదరు. రామాభ్యుదయ నిర్మాతయైన యీ డిండిమకవి ఈ మువ్వురిలో నొకండో లేక భిన్నుడో తెలియదు. పూర్వోక్త వేదాంతదేశికునకు సమకాలికుడు రామాభ్యుదయకావ్యనిర్మాతయని చరిత్రములబట్టి తెలియుచున్నది.

## కవిరాజ పండితుడు

ఈ కవిరాజసూరి నామము మృగ్యము. మొట్టమొదట "రాఘవపాండవీయ" మను కావ్యమును రచించి ద్వ్యర్థి కావ్యరచన కాదికవియై వెలింగినవాఁడు. కావ్యాంతగద్యమునను, కావ్యాంతమునందలి (13 సర్గ-62 శ్లో.) చక్రబంధమున గూడ కవిరాజ కావ్యమని చెప్పుకొనియున్నాడు. కవులకు సంబంధించిన భేదములను నామములను రాజశేఖరకృత కావ్య మీమాంస యందుక్తములై యున్నవి. (9వ పుట.) "దశ చ కవేరవస్థా భవంతి. తత్ర చ బుద్ధిమదాహార్యబుద్ధ్యోస్సప్త తిస్రశ్చ ఔపదేశికస్య, తద్యథా. 1. కావ్యవిద్యాస్నాతకః; 2. హృదయకవిః; 3. అన్యాపదేశీ; 4. సేవితా; 5. ఘటమానః; 6. మహాకవిః 7. కవిరాజః; 8. ఆవేశికః; 9. అవిచ్ఛేదీ; 10. సంక్రామయితా చ...యోఽన్యతరప్రబంధే ప్రవీణః స్సమహాకవిః యస్తు తత్ర భాషావిశేషే తేషు ప్రబంధేషు తస్మింస్తస్మింశ్చ రసే స్వతంత్రః స కవిరాజః" అని. ఈ దశవిధకవులలో నాలవవాడు మహాకవి. ఏడవవాడు కవిరాజు. నానాభాషా ప్రవీణుడు, నానావిధప్రబంధ ప్రణేత, రసభావనిరంతర కవితాచతురుడే కవిరాజ బిరుదార్హుఁడు. కవిరాజు మహాకవికంటె నధికతరుడు. ఈ కవిరాజపండితుడు తొలుత రసభావనిరంతరకవితాచతురిమతో నానావిధ ప్రబంధముల నిర్మించనిదే రాఘవపాండవీయమువంటి కావ్యము రచింప సమకట్టుట, అందులో కృతార్థుడగుటయు జరిగియుండదు. కావున "కవిరాజ" యను గొప్ప బిరుదమును గడించి సగర్వముగ దానినే తన గ్రంథమునందు (వ్యాసునివలె) వాడుకొనియుండును. ఈయన బిరుదమునే గ్రంథమునందు జెప్పుకొనుటయు, కాళిదాసు బిరుదము నెచ్చటను చెప్పుకొనక పోవుటయు, విద్యాధిదేవతయైన సరస్వతియొక్క పురుషావతారములనందగిన యియ్యిరువురయొక్క నిస్వభావమును (కవిరాజ పండి

తుదకు నిజనామమును జెప్పుకొనక బిరుదముచే వ్రాసుకొనుట, కాళిదాసమహాకవి బిరుదమును మెచ్చుటను జెప్పుకొనమియు) గాంచ,

భాదితేశ్వరభావంచ స్వేశ్వరస్వప్రకాశకం,
రామం దాశరథిం కృష్ణం వాసుదేవం నమామ్యహం.

(శ్రీమాన్ మాతండ్రిగారి "రామకృష్ణస్తవము" శ్లో. 16 )

అని రాముడు తన భగవదవతార తత్త్వమును ఎప్పుడు మెచ్చుటను వాకొనమియు, కృష్ణుడు పదే పదే వాకొనుచు ప్రదర్శించుటను స్ఫురింప జేయుచుండును. కాళిదాసు బిరుదార్థ్యుపపదములను వేటిని చెప్పక కేవలము "అన్యథలు కాళిదాసగ్రథితవస్తునా నవేన నాటకే నోపస్థాతవ్య మస్మాభిః" అని తన నామధేయము నే చెప్పికొనినందుకు అభిజ్ఞానశాకుంతలము ప్రథమాంకము ప్రస్తావనయందు నటీసూత్రధార సంభాషణయందలి, "అన్యథలు...అస్మాభిః" అను పంక్తి వ్యాఖ్యయందు శ్రీనివాసాచార్యులు, "అత్ర కాళిదాస ఇతి నిరుపపదేన పదేన ప్రసిద్ధిరేవ స్వస్య మాహాత్మ్యం గమయతి. కేవలవాగ్విజృంభితేన కిం ప్రయోజనం? సమస్త పాండిత్యస్య స్వనాటకమేవ ప్రమాణమితి ధ్వన్యతే. స్వాభిధాస్యమాన ధ్వన్యనుప్రాణిత నాటక నిర్మాణ ప్రతిభా భాజనత్వేనైవ మహాకవి వ్యపదేశః స్ఫుటీభవిష్యతీతి భావః.

కవయస్తు ప్రబంధార స్తే భవేయు శ్చతుర్విధాః,
ఉదాత్త ఉద్ధతః ప్రోక్తో వినీత ఇతి భేదతః,
అంతర్గూఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే.

ప్రకృతే కాళిదాస ఇతి నిరుపపదప్రయోగేణ గుప్తాహంకార భణితోదాత్తత్వం సూచితం".. అని గుప్తాహంకారభణితియని లక్షణానుసారముగ నుడివియున్నారు. కాని "మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం." అని రఘువంశమునం జెప్పికొనిన మహాకవి కాళిదాస విషయములో నిందుకుం దోడుకదనినట్లు ఆ మహానుభావుడు స్వోత్కర్ష సూచక చిహ్నముల నుడువ లేదని గ్రహింపదగును. వ్యాఖ్యాతయా స్థలమున తచ్ఛలముతో కవుల లక్షణములదెలుపుటయే. కవిరాజసూరి యన్నలక్షణవేది విస్పష్ట త్తమైన అన్వర్థ బిరుదముతో తనను పేర్కొనెను. కవిరాజ బిరుదాంచితులైన కవులు ఐదుగురు గలరు. వారు—

1. క్రీ. శ. 4 శకమున రాజ్యపాలన మొనర్చిన సముద్ర గుప్తునకును కవిరాజ బిరుదము గలదు. 2. కర్ణభూషణమను నలంకారగ్రంథకారుడగు గంగానందునికి గూడ కవిరాజ బిరుదముగలదు. 3. బాలరామాయణ కావ్యమీమాంసాది గ్రంథ నిర్మాతయగు రాజశేఖర మహాకవియు (క్రీ. శ. 880-920) కవిరాజబిరుదభూషితుడే. 4. క్రీ. శ. 12వ శతాబ్ది వంగదేశాధిపతియైన బల్లాలసేన సూనుడగు లక్ష్మణసేనుని సభాలంకార భూతుడును, "పవనదూత" కావ్యప్రణేతయు నగు "ధోయీ" కవికిని కవిరాజ బిరుదముగలదు. 5. క్రీ. శ. 14వ శతాబ్ది సాహిత్య దర్పణకారుడగు విశ్వనాథునకు గూడ కవిరాజబిరుదముగలదు. వీరందరు కవిరాజ బిరుదాంకులని తత్తత్కృత గ్రంథముల జదివిన దెలియును. కాని రాఘవపాండవీయ కారుడగు కవిరాజువలె పై జెప్పిన సముద్రగుప్త, గంగానంద, రాజశేఖర, ధోయీ, విశ్వనాథులలో నెవ్వరును కేవల బిరుదముచే వ్యవహరింపబడుట లేదు. కావున "కవిరాజ" నిన రాఘవపాండవీయకారుడే, వ్యాసుడన మహాభారత కర్తవలె సూచితుడు. ఈతడు రాఘవ పాండవీయమును కాదంబకుల తిలకుడగు చక్రవర్తి వీరకామదేవుని ప్రోత్సాహముచే రచించెనని నుడివియున్నాడు. గ్రంథాంతగద్యము "ఇతి శ్రీ మాలవరణీప్రసూత కాదంబకులతిలక చక్రవర్తి వీర శ్రీ కామదేవ ప్రోత్సాహిత కవిరాజ పండిత విరచితే రాఘవ పాండవీయే మహాకావ్యే కామదేవాంకే రావణ దుర్యోధన వధ శ్రీరామ యుధిష్ఠిరాభిషేకో నామ త్రయోదశ స్సర్గః" అని.

వీరకామదేవుని దేశకాలములు అజ్ఞాతములు. అయినను ఈ కవిరాజ సూరి క్రీ. శ. 650 725 నడుమ నుండెనని శ్రీమాన్. ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు "కవిరాజ సూరికాల నిర్ణయము"అను వ్యాసములో నిర్ణయించి యున్నారు. (చూ. ఆంధ్ర పత్రిక విభవ సంవత్సర ఉగాదిసంచిక) సముద్ర గుప్తాదికాల నిర్ణయమున్నూ తత్కృతిమేనని కృతజ్ఞత దెలుపుకొనుచున్నాను.

## కవితార్కిక సింహుడు

ఈయన నిజనామము వేదాంతాచార్యులు. ఈ వేదాంతాచార్య నామము పూర్వోక్త వేదాంతదేశిక సంప్రదాయ వైష్ణవులు ధరించు వేదాంత దేశిక నామధేయము. కాని ఆ కవితార్కిక సింహ సర్వతంత్ర స్వతంత్ర వేదాంతదేశిక బిరుదాంచితులైన పూర్వోక్త వేదాంతదేశిక నామముతోఁ బ్రసిద్ధులైనవారు కారు. గ్రంథములో నిజనామము నామాంతరముగ వాడి ఈ

"కవితార్కిక సింహ" బిరుదమునే నామధేయస్థానములో వాడినారు. కాన నా పేరుతోనే వీరు చెప్పబడుచున్నారు. ఇవ్విషయము తత్కృతమైన ఆచార్య చంపు అని పేరుగల వేదాంతాచార్య విజయమను చంపూప్రబంధమున ప్రథమ స్తబకమును,

పుత్రః కౌశికవంశవారిధి విధో
శ్శ్రీవేంకటేశస్య యో
దౌహిత్రః పరవస్తు వేంకట గురో
ర్వాత్సల్యస్య యో నాగ్రిమః,
ధన్యో యః కవివాదికేసరి గురో
ర్విఖ్యాతయాఽభిఖ్యయా
సత్తే యశ్చ సరోజ సౌరభ...

అను స్తబకాంత శ్లోకములను చదివిన తెలియనగును.

"కల్పద్రుః కవివాది కేసరి గురోః
ప్రజ్ఞా సుధావారిధే
ర్జాతః కల్పన కల్పితార్థ వితతి
శ్చంపూప్రబంధాత్మనా,
తస్యాఽఽమ్నాయ కిరీట దేశిక కథా
మాధ్వీ ఝురీ ముద్వహాన్
షష్ఠోఽయం స్తబకః కరోతు సుమనః
కర్ణావతంసం శ్రియం."

అని. గ్రంథాంత గద్యము—"ఇతి శ్రీ కౌశికకులతిలక శ్రీ వేంకటేశ దేశికదయితతనయస్య, పరవస్తు వేంకట గురు చరణ జలజ షట్చరణాయితాంతఃకరణస్య, కవితార్కిక సింహస్య, వేదాంతాచార్యాపరనామధేయస్య కృతౌ వేదాంతాచార్య విజయాహ్వయే చంపూ ప్రబంధే... ...స్తబకః" అని. ప్రథమ స్తబకమునందలి,

"అపి వాచ మణీయసీ మిమాం
మహనీయా మివ మన్యతే మహాన్,
కలయన్ జలధిః కవేరజాం
కిము గాంధే తటినీం తనీయసీం."

అనుదానినిబట్టి ఇతడు కావేరీతీరవాసియని మాత్రమూహింపనైయున్నది. ఏ కాలపువాఁడో ఎచ్చటివాఁడో కనుగొన నాధారములు లేవు.

## కవి చక్రవర్తి

ఈ కవి చక్రవర్తి క్రీ శ. 1245 నాటివాఁడు. ఏ తత్కృతములైన గ్రంథము లెవ్వియు కానరావు. ప్రసిద్ధమగు గణపతిదేవుని పాకాల శాసనకర్త, గణపతిదేవుని యమాత్యుఁడగు బయ్యన నాయకునకు బాచమాంబయందు గల్గిన మూడవపుత్రుఁడు, జగదాళ ముమ్మడి కాకతీయ రాజుల నారాధించు వంశమునకు జెందిన వాఁడును. ఈ శాసనమును చెప్పిన కవిచక్రవర్తికి సమున్నతమగు నొక సౌధమును పంచనివర్తనముల భూమిని దానముచేసెను.

"శ్రీమత్కాకతిరాజవంశ భజన
ఖ్యాతాత్మ వంశక్రమః
శ్లాఘ్యా సంతతి శాసనం కవయతాం
యశ్చక్రవర్తీ త్యగాత్,
తస్మై శ్రీ జగదాళ ముమ్మడి రదా
దస్యాం పురి ప్రోన్నతం
సౌధం పంచనివర్తనానిచ సదా
క్లిష్టాని సస్యశ్రియా."

అని తన కులగోత్రాదుల చెప్పుకొనక తరతరములుగ కాకతివంశము నారాధించుటచేత ప్రఖ్యాతిమైన వంశమునం జనించితినని మాత్రము తెల్పుకొనెను. అట్లే తన పేరు తెలుపక "కవయతాం చక్రవర్తి" యని, "కవిచక్రవర్తి"యని చెప్పుకొనుటచేగణపతిదేవుని యాస్థానమున నితడు సుప్రసిద్ధుండైన కవివర్యుడై యుండవలెను. ఇంకను యితండు రచించిన శ్లోకములు కాంచీపురమునందలి యేకామనాథుని యాలయపు ద్వితీయ ప్రాకారమునందలి శాసనమునందును గలవు. అవి యనవసరములని యిచ్చట పరిత్యక్తములైనవి. కవి నామము గ్రాహ్యము. (తచ్ఛాసనములు శ్లోకములు 1959, ఫిబ్రవరి భారతియందు "కాకతీయులనాటి శాసనకవులు"అను వ్యాసమునందు తెలుపబడియున్నవి.)

ఇట్లే యింకు "బాల భారతి". ఇతడు క్రీ.శ. 1219 సంవత్సరంనాటి వాఁడు. కుందవరపు శాసనకర్త. ఆ శాసనము చివర కవి తననుగూర్చి తెలుపుకొనెను.

"సూక్తిముక్తావళీ భాతి
బాలభారతి సత్కవేః,
గుణినీ కుందమాంబాయా
యా మహీహృదయంగమా."

అని. బాలభారతి యాతని నామమో లేక బిరుదమో తెలియుటలేదని తద్వ్యాసకర్తలు వ్రాసియున్నారు. అయినను బిరుదశబ్దమువలె నున్నందున తన్నామము నిట స్మరింపబడినది. ఏతత్కృత శ్లోకాంతరములందే చనువందను. బాల భారతి తెలుగులో రాఘవ యాదవ పాండవీయమును రచించి ప్రప్రథమమున త్ర్యర్థి కావ్య రచనకు దారిచూపిన మహోపాధ్యాయ ఎలకూచి బాల సరస్వతి పర్యాయముగ వాడిన నామమైయుండవచ్చు

నేమో? దేశభాషలలో ప్రబంధములు రచించినవారు సంస్కృత విద్వాంసులైయున్నచో నందును గ్రంథములో లేక కొన్నియేని శ్లోకములో రచియించిరి యన అవిశ్వసనీయము గాదు.

## అభినవ కాళిదాసు

ఈయన చంపూభాగవత రచయిత. ఈయనయే రాఘవపాండవయాదవీయమనెడి త్ర్యర్థి కావ్యమును రచియించిన చిదంబరకవి యని చంపూ భాగవతవ్యాఖ్యలో (జెల్లకొండ రామారాయ కవి రచితములో) నున్నది. "ఇహాంగుల పల్లాలకుల కలశవారాశి చింతామణిః, ఘటిత రాఘవపాండవయాదవీయాభిఖ్య చిత్ర ప్రబంధః శ్లేష యమక చక్రవర్తీ, అభినవకాళిదాసాత్మక పౌరుష నామా, చిదంబర నామా మహాకవిః" అని. కాని ఆ చమ్పూభాగవతమునందెచ్చటను గ్రంథకర్త తన ప్రథమ నామము చిదంబరుడనియు (రాఘవపాండవ యాదవీయకర్తయనియు) తెలిపియుండలేదు. కాని రామాయణభారత భాగవత సారమని నామాంతరముగల రాఘవపాండవయాదవీయ చరిత్రమనెడి త్ర్యర్థి కావ్యము చిదంబర రచితమైనది యొకటి గలదు. ఇది మూడు సర్గములు గల కావ్యమని యందలి ప్రథమ సర్గము "పంచాశచ్చ శతం చ పద్యమణయః కించాత్ర సర్గా స్త్రయః" అను మూడవ శ్లోకమున జెప్పబడినది. ఇందు తొలిసర్గము పూర్తిగను రెండవసర్గము కొంతవరకును శ్రీ వావిళ్ల వారిచేత 1861 వ సంవత్సరము చెన్నపురమున ముద్రితమైనది దొరకుచున్నది. దొరికినంత మట్టుకు జూడ నందును సర్గాంతశ్లోకములయందును, ప్రథమసర్గాంతశ్లోకమున్నను చిదంబరుడనియే యుక్తమై యున్నది. దీనికి వ్యాఖ్యాత మూలకర్తయొక్క తండ్రియే. కవినామము వచ్చినచోట ఆయనయు చిదంబర శబ్దము తప్ప "అభినవ కాళిదాస" నామ మీయనకు (రాఘవ పాండవ యాదవీయకర్తయైన తన కొడుకునకు) ఉండినట్లు చెప్పలేదు. మనకు దొరకని పై సర్గములయందు చెప్పియుండునేమో? వాటిని చూచుడనుక చెప్పగలను కానున్నది. చంపూభాగవతమున నీతడు అభినవకాళిదాసనియు, నవకాళిదాసనియు తన పేరును నుడివియున్నాడు— చంపూభాగవతము ప్రథమవిలాసము—

"అభినవ పదపూర్వః కాళిదాసో ద్వితీయ
స్త్రిణయనదయితాయాః ప్రేమడింభ స్తృతీయః,
విరచయతి తయైవ ప్రేరితః ప్రేమ పూర్వం
హరిగుణపరిణద్ధం చారు చంపూప్రబంధం."

విలాసముల చివరలయందు—

"యస్మిన్ శంకరదారసౌరభఝరీ
జృంభత్కటాక్షచ్ఛటా
పాతాః కల్పలతా వితానసుమనో
గుంఫ ప్రియంభావుకాః,
తస్యాఽసౌ నవకాళిదాస విదుషః..."

అని శంకరవిజయకర్తయగు వ్యాసాచలకవియు నవకాళిదాస నామకుడు. ఎట్లన? తత్కృత శంకరవిజయము ప్రథమసర్గము—

సామోదై రనుమోదితా మృగమదై
రానందితా చందనై
ర్వ్యంజాగ రభివందితా ప్రియగిరా
కాశ్మీరజై స్సత్కృతా,
వాగేషా నవకాళిదాస విదుషో
దోషోజ్ఝితా గుమ్ఫవి
ప్రాతై ర్విద్వద్వరుణైః క్రియేత వికృతా
ధేను స్సుగుష్మై రివ."

"నేతా యత్రోల్లసతి భగవ
త్పాదసంజ్ఞో మహేశ
శ్శాన్తి ర్యత్ర ప్రకటతి రస
శ్శేషవా నుజ్జ్వలాద్యైః,
యత్రావిద్యాక్షతి రపి ఫలం
తస్య కావ్యస్య కర్తా
ధన్యో వ్యాసాచలకవివర
స్తత్కృతిజ్ఞాశ్చ ధన్యాః".

ఈనా వ్యాసమునందిట్లు నా యెఱింగినంతమట్టుకు బిరుదములతోనే చెప్పబడు కవులను పేర్కొంటిని. ఇంకను ప్రాచీనవైష్ణవపండితాఖండులలో వాదిహంసాంబుదాచార్యులు, వాగ్విజయభట్టారకులు, మహాభాష్యభట్టరు అనువారును, తర్కశాస్త్రములో భాషాపరిచ్ఛేదకర్తయైన నీలకంఠభట్టాచార్యుని తండ్రి విద్యానివాసభట్టాచార్యులును గలరు. ఇవి వారి బిరుదములో లేక క్రింద నుడువబడు మధురకవి ప్రభృతులవలె అసలు నామములో నిష్కర్షగ తెలియనందున గ్రామములనుగాక వారి చరిత్రములను చదివిన వెనుక మఱియొకప్పుడు వ్రాయనెంచి ఇప్పుడు స్మరించి మాత్రము వదలుచుంటిని.

బిరుదములవలెనుండు అసలు పేళ్ళు:

1. మధురకవి—వీరు వైష్ణవుల ఆళ్వారులలో నొకరు. "కణ్ణినుణ్ శిరుత్తాంబు" అను ద్రవిడ ప్రబంధమును సాయించినవారు.

2. బాలసరస్వతి—ఈయన తెలుగులో మొట్టమొదట రాఘవయాదవ పాండవీయమను త్ర్యర్థి కావ్యమును రచించినవాడు. మహోపాధ్యాయ బిరుదశాలి.

3. విద్యాపతి—వంగభాషయందు గేయకవి.

ఇట్లు ఏతద్వ్యాజముతో ప్రభావాధికులైన పూర్వకవుల గొందఱ స్మరించి ధన్యుడనగుచున్నాము.

# అరుణ కిరణాలు

శ్రీమతి పి. అరుణకుమారి

విఁగోలె వికసించి
వెల్లువై ఉరలించి
విన్నాణ మొలికించి
వేకువై తుంఁకించె
తళతళల మిలమిలలతో
తొలిప్రొద్దు
తరితీపి చిర్నవ్వులతో.

కెంపు వన్నియల నవ
కంపు సొంపులు భూన
భంపు వంపుల మొగల
నింపి రత్నద్యుతుల
జొంపములు దిగజార్చెనే
లేఁబ్రొద్దు
పెంపు సూపి తనర్చెనే.

ప్రకృతి సర్వము గ్రమ్మి
ప్రాణికోటులఁ బ్రమ్మి
అంతటను జీవమై
కాంతికణముల ప్రోవు
వెదజిమ్మి వెలివిరిసెనే
ఎలప్రొద్దు
వింత హాగువులు గురిసెనే

ఆరు బయలున సోరు
లార శాద్వలముపై
ఆణిముత్తియపు నీ
హార బిందువులలో
తళుకు బెళుకులు గూర్చెనే
తొలి సంజ
వలపు తొలకరు లేర్చెనే.

అలరు కన్నెల గుండి
యలలోన పన్నీరు
తొలఁకించి సెలయేటి
గళములో తేన పా
టల రక్తి వెలికొత్తెనే
మొల సంజ
కళలీని వెలుఁగొందెనే.

అరుణాగుణము లైన
కిరణాలు మురిపెంపుఁ
దరగలై ఆనంద
కరములై పురి విచ్చి
మధురముగ నర్తించెనే
నా యెడఁద
సుధలూరి కడలొత్తెనే.

# తెనుగు శాసనాలలో అన్యదేశ్యాలు

శ్రీ మోదేకుర్తి సత్యనారాయణ

ఏ భాషయయినను, ఇతరభాషలతోను, సంఘములతోను సంబంధము కలిగినకొలది, ఆయా సంఘముల భావములను, ఆయాభాషల పదములను గ్రహించును. ఇది విశ్వవ్యాప్తమగు సత్యము. రాజకీయప్రాబల్యమును, మతసాహిత్య ప్రాచుర్యమును వివిధభాషలను సన్నిహితమొనర్చును. దానితో భాషలలో పరస్పరము పదముల, భావముల ఆదానప్రదానములు జరుగుట సంభవించును. తెనుగుభాషలోను అన్యదేశ్యముల చేరిక యిట్టిదియే.

భారతదేశముపై గజినీ దండయాత్రలు క్రీ. శ. 1001-1038 వరకు జరిగెను. అటుపిమ్మట గోరీ దండయాత్రలు సాగెను. ఢిల్లీసులతానుల మొదటి దండయాత్ర మహారాష్ట్రదేశమందలి దేవగిరిపై క్రీ. శ. 1296 లో జరిగెను. క్రీ. శ. 1303-4 సంవత్సరములలో మహమ్మదీయులు ఓరుగల్లును ముట్టడించిరి. పదునాల్గవ శతాబ్ది ప్రథమపాదమున ఓరుగల్లుపై దండయాత్రలు సాగెను. క్రీ. శ. 1313 లో కంపిలి దేవరాయని గుత్తి రాజ్యములోని భాగములగు బళ్లారి, అనంతపురము, కర్నూలు పరిసరాలు ఉలుఘ్‌ఖానుని వశమయ్యెను. క్రీ. శ. 1324 లో ఉలుఘ్‌ఖానుని యుద్యోగియగు సాలాఉల్వి రాజమహేంద్రవరములో నుండెను. క్రీ. శ. 1347 లో బహమని సుల్తానులు దక్షిణ హిందూదేశమున రాజ్యమును స్థాపించిరి. క్రీ. శ. 1847-1565 సంవత్సరములలో విజయనగరరాజులకును, బహమనీ ప్రభువులకును సంఘర్షణలు జరుగుచుండెడివి. గోల్కొండ కుతుబుషా వంశస్థులు క్రీ. శ. 1518-1672 వరకును తెనుగుసీమలో కొంతభాగమును పరిపాలించిరి. క్రీ. శ. 1718 వ సంవత్సరమునుండి నిజాముప్రభుత్వముతో తెలుగువారికి సంబంధముకల్గెను. మహమ్మదీయులు ఆంధ్రదేశమున మక్తబులు (ప్రాథమిక పాఠశాలలు), మద్రాసాలు (కళాశాలలు) స్థాపించి, అరబ్బి, పర్షియను, ఉర్దుభాషలను వ్యాపింపజేసిరి.

కళింగను పాలించిన ఖారవేలుడు, కపిలేంద్రగజపతి, లాంగూలగజపతుల కాలమునుండి ఒరిస్సాదేశముతో ఆంధ్రదేశమునకు సంబంధమున్నను, ఒరిస్సా, ఆంధ్రప్రాంతములు ప్రాచీనకాలమునుండి యిరుగుపొరుగులలోనున్నను, ఒరియావారు నాటినుండి నేటివరకును అచ్చటచ్చట ఆంధ్రలో నివసించుచున్నను వారిభాషాప్రభావము తెలుగుపై చాల తక్కువగానున్నది.

చాలకాలమునుండి మరాఠీ వారికిని, తెలుగు వారికిని సంబంధమున్నట్లు చరిత్రవలన దెలియుచున్నది. శ్రీశైల మల్లికార్జునస్వామివారి దర్శనమునకై ఆరెవారు—మహారాష్ట్రులు – 13 వ శతాబ్దము నాటికే వచ్చుచున్నట్లు పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర ప్రమాణము. శివాజికాలమునను, అతని అనంతరమును మహారాష్ట్ర దండయాత్రలు ఆంధ్ర దేశపు పశ్చిమభాగములలో ఎక్కువగా జరిగినవి. మరాఠీ పదములు మహమ్మదీయుల పాలనవలననే తెలుగుదేశమున వ్యాప్తిలోనికి వచ్చియుండును.

శ్రీనాథుడు సుమారు క్రీ.శ 1360-1460 ప్రాంతమువాడు. ఈతని భీమఖండకృతిపతి బెండపూడి అన్నయామాత్యుడు క్రీ. శ 1420 ప్రాంతమున మంత్రియయ్యెను. అన్నయమంత్రికి అరబ్బి, తురుష్క, పారసి, భాషలు వచ్చునని, అతడు అహమదుషాకు కాకితముపై పారసికభాషలో వ్రాసెననియు శ్రీనాథుడు వ్రాయుటచే క్రీ. శ. 1420 ప్రాంతమునకే అరబ్బి, తురుష్క, పారసిభాషలు రాజకీయ వ్యవహారమున నుండినవని తెలియుచున్నది[1].

---

1. మ. అరబీభాష తురుష్కభాష
గజకర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళిభాష శకభా
షా సింధు సౌవీర బా
ర్బరభాషల్ కరహాటభాష మఱియున్
భాషావిశేషంబుల
చ్చెరువై వచ్చు నరేటియన్ననికి గో
ష్ఠీ సంప్రయోగంబునన్.

ఉ. అన్నయమంత్రి శేఖరు డ
హమ్మదుసాసనదాన భూమిభృ
త్సన్నిధికి న్మదిక్ సముచి
తంబుగ వేమ మహీసురేంద్ర రా
జ్యోన్నతి సంతతాభ్యుదయ
మొందగ బారసిభాష వ్రాసినం
గన్నుల పండువై యమరు
గా కితమందలి వర్ణపద్ధతుల్.

భీమఖండము. ప్ర. ఆ. 78-74.

నేను పరిశీలించిన శాసనములలో కొన్నింటి కాలము తెలియదు. తెలుగు శాసనములలో 15వ శతాబ్దోత్తరార్ధమునుండి అన్యదేశ్యపదములు కానవచ్చుచున్నను, అంతకు పూర్వము రాజకీయరంగమున తరచుగా వాడినదే ఆనాటి శాసనములలో వాని ఉనికి తటస్థింపదు. ఏ యన్యదేశభాషకైనను రాజకీయ మత వాణిజ్యముల ప్రాధాన్యమున్నపుడే ఒక దేశమందలి జనసామాన్యముచే అన్యదేశ్యపదములు ఎక్కువగా వాడుకలో నుండునని చరిత్రవలన దెలియుచున్నది. 15వ శతాబ్దములోనే బెండపూడి అన్నయామాత్యుడు పర్షియనుభాషలో అహమ్మదుషాకు లేఖ వ్రాసినట్లు శ్రీనాథకవి వ్రాయుటచే ఆనాటికే రాజకీయ ప్రాధాన్యముగల్గి పర్షియను భాష రాజకీయభాషగ వ్యాప్తిజెందినదనుటలో సందేహము లేదు. అరబ్బి, పర్షియను, ఉర్దు, మాటల నర్థము చేసికొని తామురూడ ప్రయోగించుటకు ఆనాటియుద్యోగస్థులు, పరిచారకులు, సైనికులు, వర్తకులు, యత్నించి యుండక తప్పదు. అట్లు చేసినందువల్లనే రాజకీయవ్యవహారమునకు, మతమునకు, నాగరికతకు, దైనందినోపయుక్తములైన వస్తువులకు సంబంధించిన పై భాషలపదములు జనసామాన్యముయొక్క వాడుకలో సుమారు నూరు, నూటయేబది సంవత్సరములలో నుండుటవలననే 15వ శతాబ్దము మందలి తెలుగుశాసనములలో అన్యదేశ్యపదములు కానవచ్చుచున్నవి.

15వ శతాబ్దము ఉత్తరార్ధమునుండి తెలుగుశాసనములలో అన్యదేశ్యపదములు దొరికినవి. ఆనాటిజనుల ఉచ్చారణలో నలిగిన అన్యదేశ్యపదములు అచ్చులలోను హల్లులలోను మార్పుపొందుట భాషాస్వభావమునకు విరుద్ధము కాజాలదు. అన్యదేశ్యభాషల వర్ణసమామ్నాయములలో కొన్నిధ్వనులు మన తెలుగువర్ణసమామ్నాయములో లేవందుననో, తెలుగు శాసనములలో నేడు కానవచ్చుచున్న అన్యదేశ్యపదముల స్వరూపమునకు శాసనములు వ్రాసినవారి యేమరిపాటో, శాసనములను చెక్కినవారి భాషాజ్ఞానరాహిత్యమో లేక యీయన్యదేశ్యపదములు ఆనాటివారిచే నట్లుచ్చరింపబడెడివో ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలుగాకున్నది. తెలుగు శాసనములనుండి నేను సేకరించిన అన్యదేశ్యపదములకు సజాతీయములైన పర్షియను భాషాపదములను, కొన్నిటికి హిందీపదములను ఉదాహరించితిని.

అన్యదేశ్యములనిన, ద్రావిడభాషలకంటె అన్యములైన అరబ్బి, పర్షియను, ఉరుదు, హిందీ, మరాఠీ, ఒరియా భాషల పదములు. నేను ఎపిగ్రఫియా ఇండిక సంపుటములు 4, 6, 7, 8, 9, 10, 11, 18, 16, 17, 18; దక్షిణదేశ శాసన సంపుటములు 4, 5, 6 7, 10; తెలంగాణా శాసనసంపుటము 1; వీనిలోని శాసనముల బరిశీలించితిని. దక్షిణ హిందూదేశ శాసనముల 4వ సంపుటిలో మొత్తము 1415 శాసనములున్నవి. వానిలో 624 తెనుగువి. వానిలో అన్యదేశ్యములున్న తెనుగు శాసనములసంఖ్య 4. 5వ సంపుటిలో మొత్తము 1414 శాసనము లున్నవి. వానిలో తెలుగువి 519. అన్యదేశ్యములున్నవి ఏడు. ఆరవసంపుటిలోని శాసనములు 1215. వానిలో తెలుగువి 707. అన్యదేశ్యములుకలవి 11. ఏడవసంపుటిలోని శాసనములు 1048. వానిలో తెలుగువి 2[illegible]. అన్యదేశ్యములు కలవి 6. పదవసంపుటిలో 781 శాసనము లున్నవి. వానిలో తెలుగువి 752. అన్యదేశ్యములుకలవి 36. తెలంగాణా శాసనములు 1వ సంపుటిలో మొత్తము శాసనములు 123. వానిలో తెలుగువి 61. అన్యదేశ్యములు కలవి 2. అన్యదేశ్యములు కల తెలుగు శాసనములు మొత్తము 66. వీనిలోని అన్యదేశ్యములు 205.

పైన పేర్కొనిన ఎపిగ్రఫియా ఇండిక సంపుటములలో నాకు అన్యదేశ్యపదములు కానరాలేదు. నేను పరిశీలించిన తెనుగుశాసనములలోగల అరబ్బి; పర్షియను; ఉర్దు; హిందీ; మరాఠీ; ఒరియా; పదములను మాత్రమే నా వ్యాసరచనకై స్వీకరించి వానిని అన్యదేశ్యపదములని వ్యవహరించుచున్నాను. వీనిలో అరబ్బి భాష సెమెటిక్ భాషా కుటుంబమునకు జెందినది. పర్షియను ఇండో—ఇరేనియన్ భాషాశాఖకు జెందినది. ఉర్దు భాష హిందీ, అరబ్బీ, పర్షియను భాషల సంకీర్ణము వలన నేర్పడినది. ఉర్దు అనగా మకాము లేక బస. మార్గమున రాజులుచేసిన విడిదిలో బయలుదేరిన స్థానిక భాషకు ఉర్దు అని పేరువచ్చినది.

అన్యదేశ్యశబ్దము, దాని యర్థము, క్రీస్తుశక సంవత్సరము, శాసనసంపుటము సంఖ్య, శాసనము సంఖ్య, శాసనపంక్తి, సజాతీయమైన పర్షియను పదముగాని, అరబ్బిపదముగాని, ఉర్దుపదముగాని, హిందీపదముగాని వరుసగా నిచ్చితిని. ద. శా=దక్షిణ హిందూదేశ శాసనములు, తె. శా=తెలంగాణా శాసనములు, ప=పర్షియన్, అ=అరబ్బి, మ=మరాఠీ, ఉ=ఉరుదూ, హి=హిందీ. ఒకే పదమునకు వివిధరూపము లున్నను ఒక రూపము మాత్రమే యిట పేర్కొనబడుచున్నది.

## పరిపాలన పరిభాష:

**తె. అకాకాని=నాయకుడు. 1697. ద. శా. 10.772.5; ప. అకాకాన్; హి. అగాఖాన్.**

**తె.** అజరతి=రాజులను, గొప్పవారిని సంబోధించు పదము. 1658. ద. శా. 10.758 7; ప. హజ్రత్; హి. హజరత్.

**తె.** అమారతు=ప్రభుత్వ కార్యాలయము. 1697. ద. శా. 10.772.4; ప. ఇమారత్; హి. ఇమారత్.

**తె.** అయాలతు=ప్రభుత్వము. 1592. ద. శా. 10.751.6; ప. ఇయాలత్.

**తె.** అరదాసు=వ్రాసిన వినతిపత్రము. 1530. ద. శా. 10.745. 31,32; ప. అర్జ్ దాష్త్.

**తె.** ఖరచ=ఖర్చు, దావా ఖర్చు. 1530. ద. శా. 10.745. 38,39; ప. ఖర్చ; హి. ఖరచ.

**తె.** కులకరణి=కరణము. 1545. తె. శా. 1.4; మ. కులకరణీ.

**తె.** జాగిరు=సేవ చేసినందుకు బహుమానముగా పన్ను లేకుండ ప్రభుత్వముచే ఇవ్వబడిన భూమి. 1774. ద. శా. 7. 790.1; ప. జాగీర్; హి. జాగీర్.

**తె.** తనఖా=భూసంబంధమైన పన్ను. 1664. ద. శా. 10.759.15; ప. తన్ఖాహ్; హి. తనఖాహ్.

**తె.** తాఖీదు=ఒత్తిడి. 1680. ద. శా. 10.767. 22.23; ప. తాకీద్; హి. తాకీద్.

**తె.** దస్తుగహా = ప్రజల కార్యాలయము. 1664. ద. శా. 10.759.8; ప. దస్త్-గహ్; హి. దస్త్—.

**తె.** దివాణం=రాజాస్థానము. 1602. ద. శా. 10.754 10; ప. దీవాన్; హి. దీవాన్.

**తె.** దేశముఖు=దేశమున సుప్రసిద్ధుడు, దేశమున ప్రధానుడు. 1697. ద. శా. 10.772.9. మ. దేశముఖ్.

**తె.** నబాబు=పట్టణము లేక జిల్లాను పాలించువాడు. 1650. ద. శా. 10.757.9. ప. నవ్వాబ్; హి. నవాబ్.

**తె.** నిజాం=ప్రధాన పరిపాలకుడు 1589. ద. శా. 10.750. 2; ప. నిజాం; హి. నిజాం.

**తె.** పటేలు=గ్రామాధికారి, గ్రామ రెవిన్యూ అధికారి. 1545. తె. శా. 1.4.3; మ. పటేల్. హి. పటేల్.

**తె.** పరగణే=జిల్లాలోని భాగము. 1691. ద. శా. 10.771.5; ప. పర్గన; హి. పరగనా.

**తె.** ఫర్మాను=ఆజ్ఞ. 1680. ద. శా. 10.767. 14; ప. ఫర్మాన్; హి. ఫరమాన్.

**తె.** పాచ్ఛాయి=రాష్ట్రపాలకుడు. 1697 ద. శా. 10.772.4; ప. పాద్ షాహీ. హి. పాచ్ఛా, పాచ్ఛాహ్

**తె.** పాదశాహా=చక్రవర్తి. 1592. ద. శా. 10.751. 9-10; ప. పాద్ షాహ్; హి. పాచ్ఛాహ్.

**తె.** బహాదురు=యోధుడు, గౌరవ వాచకము. 1774. ద. శా. 7.790.1; ప. బహాదుర్; హి. బహాదుర్.

**తె.** ముక్తా=శిస్తు, ఒడంబడిక. 1593 ద. శా. 4.711.28. అ. ముక్త.

**తె.** మసనద=సింహాసనము. 1530 ద. శా. 10.745.3. ప. మస్నద్.

**తె.** మహజరు=సామాన్యమైన దరఖాస్తు, అర్జీ. 1680 ద. శా. 10.767.16. ప. మహ్జర్. హి. మహజర్.

**తె.** మహాసూలు=పంట, పన్ను. 1664. ద. శా. 10.759.55. ప. మహ్సూల్; హి. మహాసూల్.

**తె.** ముకాసా=తక్కువ శిస్తుతోగాని, ఉచితముగాగాని యిచ్చినభూమి. 1664. ద. శా. 10.759. 14; ప. ముకాస.

**తె.** ములుక్కు=దేశము, ప్రాంతము. 1697. ద. శా. 10.772.16; ప. ముల్క్; హి. ములక్.

**తె.** వజారతు=ప్రధానమంత్రి కార్యాలయము. 1664. ద. శా. 10.759.38,39; ప. విజారత్; హి. విజారత్.

**తె.** వజీరలు=రాష్ట్రమంత్రులు. 1677. ద. శా. 10.764.6. ప. వజీర్; హి.

**తె.** విలాతు=పరిపాలకుడు. 1600. ద. శా. 10.753.50; ప. వొలత్; హి. విలాయత్.

**తె.** సహా=రాజు. 1576. ద. శా. 10.748.1; ప. షాహ్.

**తె.** శామీ=రాజ్యసంబంధమైన 1664. ద. శా. 10. 759. 54-55; ప. షాహీ; హి. శాహీ.

**తె.** శివారు=పట్టణము లేక కోట పరిహద్దు. 1680. ద. శా. 10. 767.30; ప. సివార్.

**తె.** సముతు=తాలూకాలో నొకభాగము, ప్రక్క. 1664. ద. శా. 10. 759. 17; ప. సమ్త్.

**తె.** సరకారు=ప్రభువు, ప్రభుత్వము. 1697. ద. శా. 10.772. 9; ప. సర్కార్; హి. సరకార్.

**తె.** సరదారు=ప్రధాని, నాయకుడు. 1577. ద. శా. 7. 563. 6; ప. సర్దార్; హి. సరదార్.

**తె.** సలతనత=అధికారము 1592. ద. శా. 10 751.6; ప. సల్తనత్.

**తె.** సాదిరు=జారీచేయబడిన. 1680. ద. శా. 10.767.14; ప. సాదిర్; హి. సాదర్.

తె. సాబాజీ=శ్రేష్ఠమైన డేగవంటి రాజు. 1592. ద. శా. 10. 751.18; ప. శాహ్‌బాజ్; హి. శాహ్‌బాజ్.

తె. సాలాబాదు = వ్యవసాయము చేయుచున్న లేక పన్ను కట్టుచున్న భూములు. 1664. ద. శా. 10.759.30-31; ప. సాలాబాద్; హి. సాలాబాద్.

తె. స్యాసతు=పరిపాలన. 1664 ద. శా. 10.759. 11-12; ప. సియాసత్.

తె. సాహిబు = మిత్రుడు, పెద్దమనిషి. 1664. ద. శా. 10.759.42; ప. శాహిబ్; హి. సాహబ్.

తె. సుబా=రాష్ట్రము. 1697. ద. శా. 10.772. 6; ప. శూబ; హి. సూబా.

తె. సులతాని=రాజు, చక్రవర్తి. 1531. ద.శా. 10.743.6-7; ప. సుల్తాన్; హి. సులతాన్.

తె. హుజూరు=రాజసభ, రాజాస్థానము. 1680. ద. శా. 10.767. 17 ప. హుజూర్; హి. హుజూర్.

## న్యాయ శాఖ:

తె. అమీను=న్యాయాధికారి. 1664 ద. శా. 10.759. 5-6; ప. అమీన్; హి. అమీన్.

తె. మొల్లా=న్యాయాధిపతి 1600 ద. శా. 10.753-48; ప. ముల్లా; హి. ముల్లా.

తె. శిజారు=న్యాయస్థానమునందలి పుస్తకములో వ్రాసినది, న్యాయాధికారిముద్ర. 1664. ద. శా. 10.759.16; ప. సిజిల్ల్.

## రక్షక శాఖ:

తె. తానెము=చిన్న పోలీసు స్టేషను. ద. శా. 5.108. 6. ప. థాన; హి. థానా.

తె. తానేదార్ల=చిన్న పోలీసు ఉద్యోగుల. 1530. ద. శా. 10.745. 36-37; ప. థానదార్; హి. థానేదార్.

తె. నైబు తానేదారి=సహాయుడగు చిన్న పోలీసు ఉద్యోగి. 1530. ద. శా. 10.745. 13-14; ప. నాయిబ్ థానదార్.

## సైనికశాఖ:

తె. తరఫుదారు=అనుసరించి వెళ్ళువాడు. 1789. ద. శా. 10.777. 9. ప. తరఫ్‌దార్; హి. తరఫ్‌దార్.

తె. దఫ్థారు=చిన్న పదాతిదళముపై అధికారి. 1856. ద. శా. 7. 558. 12. ప. దఫ–దార్.

తె. ఫౌజుదారు=జిల్లా సైనికాధికారి, సేనాపతి. 1691. ద. శా. 10.769.6; ప. ఫౌజ్‌దార్; హి. ఫౌజదార్.

తె. సుబేదారు=స్థానిక సైన్యాధికారి, రాష్ట్ర పరిపాలకుడు. 1697. ద శా. 10.772.5-6; ప. శూబదార్; హి. సూబేదార్.

తె. హవాలాదారు=స్థానిక సైన్యాధిపతి. 1576. ద. శా. 10.748.3; ప. హవల్ దార్; హి. హవాలదార్.

## సామాన్యవాచకములు:

తె. అలి=ఉత్తమమైన, అత్యున్నతమైన. 1592. ద. శా. 10 751.5; ప. అలి; హి. అలీ.

తె. అలియా=గొప్ప. 1592. ద. శా. 10.751.5; ప. అలియా.

తె. అలియు=అత్యున్నతమైన. 1592. ద. శా. 10 751.5; ప. ఉలియా.

ప. ఎకుబాలు=అదృష్టము, అభివృద్ధి. 1664. ద. శా. 10,759.40; ప. ఇక్‌బాల్; హి. ఇకబాల్.

తె. కతు=ఉత్తరము, లేఖ. 1530 ద. శా. 10.745. 38-39; ఉ. ఖత్; హి. ఖత్.

తె. కసుబే = చిన్నపట్టణము. 1664. ద శా. 10.759.11; ప. కస్‌బ, హి. కసబా.

తె. కాకితం=పత్రము, కాగితము. 1600. ద శా. 10.753.35; ప. కాఘజ్.

తె. కిల్లె ముజాకూరువారు=పైన చెప్పబడిన కోటవారు. 1664. ద. శా. 10.759. 15-16; ప. కలా మజ్‌కూర్; హి. కిలా.

తె. కుతుబు=ప్రశంస, ధ్రువనక్షత్రము. 1604. ద. శా. 6.1184 2; ప. కుత్‌బ్; హి. ఖుతబా.

తె. కుల్లీ=కూలివాడు, పనివాడు. 1592. ద. శా. 10.751.16; ప. కులీ; హి. కులీ.

తె. కౌలు=వ్రాతమూలకమైన ఒడంబడిక 1600. ద. శా. 10.753. 35; ప. కౌల్; హి. కౌల్.

తె. ఖబురు=వార్త సమాచారము. 1592. ద. శా. 10.751.23; ప. ఖబర్; హి. ఖబర్.

తె. ఖరీదు=కొనుట. 1593. ద. శా. 4 711.37; ప. ఖరీద్; హి. ఖరీద్.

తె. ఖాను=ఖాత, తార్తరి వంశీయులైన రాజుల బిరుదు, ఉద్యోగస్థుని బిరుదు. 1509. ద. శా. 10.733. 17; ప. ఖాన్; ఉ. ఖాన్.

తె. గరకసా=వ్యాజ్యము, దెబ్బలాట. 1664. ద. శా. 10.759.16; ప. గరీబ్.

తె. జమ=మొత్తము, కూడిక. 1600. ద. శా. 10.758.62; ప. జమ; హి. జమా.

తె. జాగా=స్థలము. 1661. ద. శా. 10.759. 35–36; ఉ. జగహ్; హి. జగహ్.

తె. జాఫరా=ఒక మహానది పేరు. 1692. ద. శా. 10.770.5; ఫ. జఫర్ :

తె. జాయతు=హోదా, ఉన్నతస్థితి. 1664. ద. శా. 10.759.7; ప. జాహ్; హి. జాహ్.

తె. జెహాద=ప్రక్కనున్న. 1697. ద. శా. 10.772 6; ప. జిహాత్; హి. జిహాత్.

తె. తమాము=పూర్తిగా. 1697. ద. శా. 10.772 5; ప. తమామ్; హి. తమామ్.

తె. తురుక=టర్కీ దేశీయుడు. 1485. ద. శా. 4.659 12; ప. తుర్క్; హి. తురక.

తె. దరివేసు=బిచ్చగాడు. 1531. ద. శా. 10.743.15; ప. దర్వెష్; హి. దరవేశ్.

తె. దస్తూరి=వలారివాండ్లిచ్చే రుసుము. 1750. ద. శా. 4.919.27; ప. దస్తూరీ; హి. దస్తూరీ.

తె. దాముదవులత్తు హం=వాని యభివృద్ధి కొరకు పాటుగాక. 1664 ద. శా. 10.759.42–43; ప. దామ్ దౌలతూ; హి. దాందౌలత్.

తె. నఫరునఫరు (కి)=ఒక్కొక్కడు, ప్రతి వ్యక్తి. 1593. ద. శా. 4.711.28; ప. నఫర్ నఫర్; హి. నఫర్.

తె. నామజాదు=పిలువబడేది, నియోగింపబడిన 1592. ద. శా. 10 751.10. ప. నామ్జాద్; హి. నామజద్.

తె. నికాబత్తు=శత్రువులను హింసించుట, కీర్తి. 1664. ద. శా. 10.759.12; ప. నికబత్; ఉ. నకబత్.

తె. నిగావానులు=కాపలావాడు. 1678. ద. శా. 10.765.36; ప. నిగాహ్బాన్; హి. నిగహబాన్.

తె. నిశాను=చిహ్నము, గుర్తు. 1600. ద. శా. 10.753 394.28; ప. నిషాన్; హి. నిసాన్.

తె. పకీర్ల=బిచ్చగాండ్ర, దేశద్రిమ్మరుల, సన్యాసుల. 1600. ద. శా. 10.753.60; ప. ఫకీర్; హి. ఫకీర్.

తె. పనాహ=ఆశ్రయము, రక్షణ. 1664. ద. శా. 10.759 38–39; ప. పనాహ్; హి. పనాహ్.

తె. బరనిసుబత్తు=తారతమ్యముతో 1664. ద. శా. 10 759.27; ప. బనిస్బత్; హి. బనిస్బత్.

తె. బాజరు=మహావిద్వాంసుడు. ద. శా. 10. 775.4–5; ప. బాకిర్; ఉ. బాకిర్.

తె. బాబు=గుమాస్తా, గౌరవవాచకము. 1593 ద. శా. 4.711.27; ఉ. బాబూ; హి. బాబూ.

తె. బురుజా=శిఖరము. 1567 ద. శా. 7.564. 6; అ. బుర్జ్; హి. బుర్జ్.

తె. మరమాంమతు=చెడినవాటిని బాగుచేయించుట. 1678; ద. శా. 765. 38–39; ఉ. మరమ్మత్; హి. మరమ్మత్.

తె. మశీదు=మహమ్మదీయుల దేవస్థానము. 1668. ద. శా. 10.762 13; ప. మస్జిద్.

తె. మహాతాబా=చంద్రుడు. 1664. ద. శా. 10. 759. 15; ప. మహ్తాబ్, హి. మహతాబ్.

తె. మామీను=జాగ్రత్తగా నుంచుట, సంరక్షించుట. 1664. ద. శా. 10.759. 55–56; ప. మామూన్; ఉ. మామన్.

తె. మామూలు=అలవాటు. 1593. ద. శా. 4 711.14; ప. మమూల్; హి. మామూల్.

తె. మాలు=పన్ను. 1600. ద. శా. 10.753.60; ప. మాల్; హి. మాల్.

తె. మాల్మ=తెలుపుట. 1664. ద. శా. 10.759. 22; ప. ములూమ్; హి. మాలూమ్.

తె. మియ్యా=యజమాని. 1530. ద. శా. 10.745. 28; ప. మియా; హి. మియా.

తె. మీరాశిదారు=పెద్ద భూస్వామి. 1678. ద. శా. 10.765.28–29; అ. మిరాస్దార్; హి. మీరాస్దార్.

తె. ముతాలికు=సంబంధించినది. 1680. ద. శా. 10.767.45; అ. ముతల్లిక్; ఉ. ముతఅల్లిక్.

తె. మునషీ=పర్షియను ఉపాధ్యాయుడు, గౌరవవాచకము. 1856. ద. శా. 7.558.12; ప. మున్షి; ఉ. మునషీ.

తె. ముస్తయిదు = సిద్ధము. 1668. ద. శా. 10–762.15; ప. ముస్తైద్; హి. ముస్తైద్.

తె. ముసాబు=మిత్రుడు, ఇష్టుడు. 1530: ద. శా. 10.745.57; అ. ముసాహిబ్; హి. ముసాహబ్.

తె. మొకర్రబు=ప్రియమిత్రుడు. 1697. ద. శా. 10.772.4–5; అ. ముకర్రబ్; ఉ. ముకరబ్.

తె. మోతిమదవులతు = నమ్మదగిన రాజ్యము. 1592. ద. శా. 10,751.5; ప. ముతిమద్ దౌలత్.

తె. యిజలాలు=ఘనమైన 1664. ద. శా. 10. 759.39–40; ప. ఇజ్లాల్, ఉ. ఇజలాల్.

తె. యిజారతి=అద్దె, గుత్త, కౌలు 1598. ద. శా. 10.752.10; ప. ఇజారత్; హి. ఇజారా.

తె. ఇస్నాసా=ఉపకారయోగ్యము, అనుకూలము. 1680. ద. శా. 10.767.9; ప. ఇహ్సాన్; ఉ. ఎహ్సాన్.

తె. గద్దు=త్రోసివేయబడుట 1664. ద. శా. 10.759.54; ప. రద్; హి. గద్దు.

తె. రావు=గౌరవవాచకము 1496. ద. శా. 10.781.3 మ. రావ్; హి. రావ్.

తె. రొఖ్ఖా=ఉత్తరము, రసీదు. 1593 ద. శా. 4.711.27; ప. రుక్కా, హి. రుక్కా.

తె. లంగర=సర్వసత్రము 1531 ద.శా. 10.743.19; ప లంగర్; హి. లంగర్.

తె. వరిశ=వారసత్వము. 1697 ద. శా. 10.772.13; ప. వరస; వరాసత్; హి. వరాసత్.

తె. వహీ=కుట్టినపుస్తకము, 1600 ద. శా. 10.758.45; మ. వహీ.

తె. శాహామత్తు=ధైర్యము, శిరత్వము. 1664 ద. శా. 10.759.7-8; ప. సాహామత్.

తె. శేకు=పూజ్యుడు, బిరుదు, మహమ్మదీయులలో మొదటి తెగ. ద. శా. 10.780.29-30.

తె. సంగ్గు=రాయి 1664 ద. శా. 10.759 36; ప. సంగ్; హి. సంగ్.

తె. సరిహద్దు=పరిమితి, సీమ. 1604 ద. శా. 10.755.4; ప. సర్ హద్; హి. సర్ హద్.

తె. సుబా=రాష్ట్రము. 1697 ద.శా. 10.772.6; ప. సూబ; హి. సూబా.

తె. హద్దు=పరిమితి, సీమ. 1664. ద. శా. 10.759.35; ప. హద్ద; హి. హద్.

తె. హరాంఖోర్లు = అన్యాయముగా డబ్బు సంపాదించువాడు, దుష్టసేవకుడు. 1592. ద. శా. 10.751.19; ప. హరాంఖోర్; హి, హరాంఖోర్.

తె. హాజీతు=అవసరము. 1664. ద. శా. 10.759.32-33; ఉ. హాజత్; హి. హాజత్.

తె. హిస్సాబిని=లెక్కలు. 1680. ద. శా. 10.767.13; ప. హిసాబ్; హి. హిసాబ్.

## స్థలవాచకములు:

తె. అముదానగరము=అహ్మద్ పేరనున్న పట్టణము. 1697. ద. శా. 10.773.3-4. ప. అహ్మద్; హి. నగర్.

తె. కతియాయతి=గ్రామము. 1576. ద. శా. 10.748.3; ప. కర్యత్.

తె. కిదరబాదను=ఒక మత ప్రవక్త పేరుతో పిలుబడిన పట్టణము. 1531 ద. శా. 10 743 22; ప ఖిజరాబాద్.

తె. కిల్లెము ర్తజాంవ్నగరు=అలియొక్క బిరుదుతో పిలుబడిన పట్టణము పేరు. 1664 ద. శా. 10 759.9; ప. కలము ర్తజానగర్; హి. కిలా-నగర్.

తె. ఖానాజీపేథి=ఒక యువరాజు పేరుతో పిలువబడుపేథి. 1593 ద. శా. 4.711.42; ప. ఖాన్ జీ

తె. చాందుమియ్యాపేంట్ట=చంద్రుని వంటి ప్రభువు పేరుతోనున్న పేట. 1593 ద. శా. 4.711 4; హి. ఛాంద్ మియాన్.

తె. జాగా=చోటు. 1664 ద. శా. 10.759 35-36; ఉ. జగహ్; హి. జగహ్.

తె. దరుబంద్దిగె=పట్టణము పేరు, కోట పేరు 1691. ద. శా. 10.771.3-4; ప. దరబంద్.

తె. నిజాంప్పట్నము=హైదరాబాదు నవాబ పేరుగల పట్టణము. 1589. ద. శా. 10.750.2; ప నిజామ్; హి. నిజామ్.

తె. మహామదానగరు=మహమ్మద్ పేరుగల పట్టణము. 1664 ద. శా. 10.759.6; ప. ముహమ్మద్ హి. నగర్.

తె. ముల్కు=దేశము. 1697 ద. శా. 10 772 16; ప. ముల్క్; హి. ములకీ.

తె. మృతిజానగరం = అలియొక్క బిరుదుతో పిలువబడుపట్టణము. 1598. ద. శా. 10.752.10; ప ముర్తజా; హి. నగర్.

తె. విభురాముభాగు=ఇబ్రహీమ్ పేరుతో పిలుబడుతోట; ద శా. 10.780.15-16; ప. ఇబ్రహీమ్బాగ్.

తె. హైదరాబాద్ను=హాజరత్ ఆలి పేరుగల నగరము. 1697. ద. శా. 10.772 6; ప. హైదరాబాద్

## సంఖ్యావాచకములు:

తె. అలఫు=వెయ్యి. 1592. ద. శా. 10 75, 4 ప. అల్ ఫ్.

తె. చెప్పన్న=ఏబదియారు. 1697. ద. శా 10.772.3; ఉ. ఛప్పన్; హి. ఛప్పన్.

తె. సలాసు=మూడు. 1600.ద. శా. 10.758.36 అ. సలాస్.

## కాలవాచకములు:

తె. జమాలుపాని=(అరబ్బిలో) 6 వ నెల.1602 ద. శా. 10.754.3-4; ఉ. జమాదుయుస్సానీ.

తె. మాహే=నెల. 1592. ద. శా. 10.751 4; ప. మాహ్.

తె. రజబు=పవిత్రమైన యేడవ నెల. ద. శా. 10.775.4-5; ప. రజబ్.

తె. రోజు=దినము. 1697. ద. శా. 10.772.3; ప. రోజ్ ; ఉ. రోజ్ .

తె. సన=సంవత్సరము. 1592. ద.శా.10.751.16; ప. సన్. హి. సన్.

తె. సవ్వాలు=(అరబ్బీలో) పదవ నెల. 1592. ద. శా. 10.751. 4. ప. సవ్వాల్.

తె. సాలు=సంవత్సరము. 1592 ద. శా. 10.751.16. ప. సాల్ ; హి. సాల్ .

తె. సుఫ్ఫ్ర=నెల. 1600. ద. శా. 10.753.2. ప. సఫర్.

తె. సైనుతిస్సామిహూ=9 వ నెల. 1592. ద. శా. 10.751.4; ప. సన్ తిసామాహ్.

## వ్యక్తివాచకములు :

తె. అకరంఖాన=ఇక్కలి దయాశాలి. 1600. ద. శా. 10.753.24; ప. అక్రమ్‌ఖాన్; హి. ఇకరాం ఖాన్.

తె. అత్తామియ్య=ప్రభువు, ద త. 1530. ద. శా. 745.13. అ. అతా; హి. అతామియా.

తె. అబులు హోసను=హాసను యొక్క తండ్రి. 1686. ద. శా. 10.768 1; ప. అబుల్ హాసన్. హి. అబ్బా.

తె. అబ్దుల్లా=భగవంతుడైన అల్లా సేవకుడు. 1664 ద. శా. 10.759.45. ప. అబ్దుహ్ అల్లాహు.

తె. అంబ్బారు ఖాను=సహృదయుడు. 1632. ద. శా. 7.645.3; ప. అంబర్ ఖాన్; హి. అంబర్ ఖాన్.

తె. అమీనముల్క=దేశముయొక్క ధర్మకర్త. 1599. ద. శా. 10 751.6; ప. అమీనల్ ముల్క్; హి. అమీన్.

తె. అయాలతు పనహా=ప్రజల కాపాడుమియ్యు రాజు. 1697. ద. శా. 10 772.4; ప. ఇయాలత్ పనాహ్.

తె. అయిదరుజాలాం = సింహమువంటివాడు. 1530. ద. శా. 10.745.14; ప. హైదర్ జాహ్; హి: హైదర్.

తె. అలంపన్నాహా=రక్షకుడు. 1680. ద. శా. 10.766.6-7; ప. అలంపనాహ్; హి. అలంపనాహ్.

తె. అలావదీను=మత వ్యాపకుడు; రాజు పేరు. ద. శా. 10.780. 27-28; ప. అలాయుద్దీన్.

తె. అవజాదుఖాను=స్వతంత్రుడు. 1691. ద. శా. 16.759.1-2. ప. అజాద్ ఖాన్; హి. అజాద్ ఖాన్.

తె. అవరంగజేబు = సింహాసనము నలంకరించు వాడు. ద. శా. 10.775.2-3; ప. ఔరంగ్ జెబ్.

తె. అహంమదు=మహమ్మదు 1678. ద. శా. 10.765.11; ప. అహ్‌మద్ ; ఉ. అహ్మద్ .

తె. ఆజంబలూలు=గొప్పవాడు, మహమ్మదు జీవించియున్న కాలములో ప్రార్థనలకై ప్రజలను పిల్చినవాడు. 1678. ద శా. 10.765 10; ప, అజం బిలాల్ .

తె. ఆలంఖాను=సర్వ సంపన్నుడు. 1658. ద. శా. 10.758.18; ప. ఆలంఖాన్.

తె. ఆలంగీరు=ప్రపంచమును జయించునటి వాడు. ద. శా. 10.775.1-2; ప. ఆలంగీర్; హి. ఆలంగీర్.

తె. ఆలిశాన=సమర్థుడు, కీర్తిగలవాడు. 1600. ద. శా. 10.753.25; ఉ. ఆలీషాన్; హి. ఆలీ.

తె. ఇభురాంశా = మతప్రవక్త అయిన ఇశ్రయిల్ యొక్క తండ్రి. 1583. ద. శా. 10.749.6-7; ప ఇబ్రాహిమ్; హి. ఇబ్రాహీమ్.

తె. కసరుకాను=మతప్రవక్త, సన్యాసి. 1577. ద. శా. 7.563.5; ప. ఖిజర్ ఖాన్.

తె. కిల్లెముబారకు = శుభప్రదమైన కోటవంటి వాడు. 1664. ద. శా. 10.759.6; ప. కిలాముబారక్; హి. కిలాముబారక్.

తె. కుతుమనముల్క=రాజ్యమున ధ్రువనక్షత్రము వంటివాడు, గౌరవవాచకము. 1531. ద. శా. 10.743. 8-9; ప. కుతుబుల్ ముల్క్.

తె. ఖాను=ఖాతి, తార్తరీ వంశీయుని బిరుదు. 1509. ద. శా. 10 733.17; ప. ఖాక్.

తె. ఖోజ్జా అల్లి జరగరు=మహమ్మదు యొక్క అల్లుని పేరుగల ప్రఖ్యాతుడు. 1598. ద. శా. 4.711.10; ప. ఖ్వాజ అలిజర్ గర్ .

తె. ఖోదావందఖానే ఆజం=గొప్ప ప్రభువు. 1600. ద. శా. 10.753.24; ప. ఖుదావండ్ ఖానాజమ్.

తె. చాంగుమియ్య=చంద్రుని వంటివాడు, కిరీటము వంటివాడు. 1598. ద. శా. 4.711.43; ఉ. ఛాంద్ మియాన్.

తె. తేజుఖాను=కిరీటమువంటివాడు. 1678. ద. శా. 10.765.17-18; ప. తాజ్ ఖాన్; హి. తాజ్ ఖాన్.

తె. నఫరుఖుల్లి=సేవకుడు, పనివాడు. 1668. ద. శా. 10 762.11; ప. నఫర్ కులీ; హి. నఫర్ కులీ.

తె. బల్లులాఖానుడు = సకల సద్గుణ వంతుడగు యువరాజు. 1740. ద. శా. 10.779 3; ప. బహ్లూల్.

తె. బాజరు = ఐదవ యిమాము బిరుదు. ద. శా. 10.775 4-5; ప. బాకిర్; ఉ. బాకిర్.

తె. బాహిరామల్కు=రాజు పేరు. 1592. ద. శా. 10.751.6; ప. బహ్రాన్ముల్క్,

తె. మముదు = రాజు, ప్రశంసనీయుడు. 1658. 10.758.9; ప. మహ్మూద్.

తె. మహామంగు=ఇస్లాం మతమును కనుగొనిన వాడు. ప్రశంసార్హుడు. 1531. ద. శా. 10.743 5; ప. ముహమ్మద్; హి. మహమద్, మహమ్మద్.

తె. మాలిఖానుంకు=తోటమాలి. 1577. ద. శా. 7.563.62 ఉ. మాలీఖాన్; హి. మాలీఖాన్.

తె. మహాబుఖాన=మిత్రుడు. 1691. ద. శా. 10.769.1; అ. మహ్బూబ్ ఖాన్; హి. మహబూబ్ ఖాన్.

తె. ముర్తజాఅల్లి=అలియొక్క బిరుదు. మహమ్మదుయొక్క అల్లుడు. 1600 ద. శా. 10.753.63; ప. ముర్తజాఅలి; హి. మురతబా.

తె. ముసా=మతప్రవక్త. ద. శా. 10.780.29-30; ప. మూసా; హి. మూసా.

తె. యినాయతుఖాను=దయశాలి. 1697 ద. శా. .772.7; ప. ఇనాయత్ ఖాన్; హి. ఇనాయత్ ఖాన్.

తె. యిభురాంశహా = మతప్రవక్తఅయిన ఇస్మయిల్ యొక్క తండ్రి. 1576 ద. శా. 10.748.1; ప. ఇబ్రాహిమ్; హి. ఇబ్రాహీమ్.

తె. యిసుమాయిలు = ఇబ్రాహీమ్ యొక్క పుత్రుడు, మతప్రవక్త పేరు. 1664 ద. శా. 10.759.8; ప. ఇస్మయీల్.

తె. యెకలాసఖాన=మృదుహృదయుడు, ప్రీతి గలవాడు. 1600 ద. శా. 10.753 25; ప. ఇఖలాస్ ఖాన్; హి. ఇఖలాస్ ఖాన్.

తె. యేదుశాహి = మహమ్మదీయులపండుగవలె పవిత్రుడు, పాలకుడు. 1577 ద. శా. 7.568.6; ప. ఈద్ షాహీ; హి. ఈద్.

తె. యేలీసుఖానింగారు=మతప్రవక్త. తె. శా. 1.4 1; ప. ఇలియాసఖాన్.

తె. రజబుఖానుడు=మహమ్మదీయ వత్స 7వ నెలవంటివాడు. ద. శా. 10 775.4 రజబ్ ఖాన్.

తె. రజాఅయిఫకి=ఇస్లాం న్యాయశాస్త్ర మహాపండితుడు. 1583 ద శా. 10.749.9; అయిఫకీ; హి. రజా...

తె. రజాఖుల్లి=అలి ముసాబిం జాఫర్ బిరుదు. 1668. ద. శా. 10 762 10; ప. రజ రజా.

తె. రుస్తుం=ధైర్యశాలి, యోధుడు. 16 శా. 10 767.18; ప. రుస్తమ్; హి. రుస్తమ్.

తె. సుజాఖాను=ధైర్యశాలి. ద శా. 1 3.4; ప. షుజాఖాన్; హి. శుజాఖాన్.

తె. నూకరల్లి = మహమ్మదుయొక్క 1589. ద: శా. 10.950.4; అ. పాకిల్లి; హి.

తె. సెకజాఖాను=పవిత్రుడు. 1669. 10.761.4; ప. షెయిక్ జాహ్ఖాన్; హి. శేఖ్

తె. సైదిభురాహిము = మహమ్మదీ రెండవ తెగకు చెందినరాజు పేరు. ద. శా. 1 12 13; ప. సైయిద్ ఇబ్రాహీమ్.

తె. సైదు=మతప్రవక్తయగు మహమ్మ మడు. 1664. ద. శా. 10.759.13; ప. సైయిక్

తె. హాజీఖాను=మెక్కాకు వెళ్ళిన డుడు. 1697. ద. శా. 10.772; ప. హాజిఖాన్ హాజీఖాన్.

తె. హాస్సానకు=మహమ్మదు సమకా కవి. ద. శా. 10.780.2; ప. హాస్సాన్; హి.

తె. హుసేను=మహమ్మదుయొక్క మ 1669. ద. శా. 10.761.7; ప. హుసెయిన్.

ఈ వ్యాసరచనకు నన్ను ప్రోత్సహించి నిచ్చిన ఆచార్య శ్రీ గంటి జోగిసోమయ డాక్టరు భద్రిరాజుకృష్ణమూర్తి, శ్రీ మల్లంపల్లి శేఖరశర్మ, శ్రీ తూమాటి దోణప్ప, శ్రీ మవ సిదిక్ఖాన్ (ఉర్దుమున్షి, మిసెస్ ఎ. వి. ఎన్. విశాఖపట్నం), శ్రీ యస్. ఎ. రషీద్ (బి ఆనర్స్, ఎమ్. ఆర్. కాలేజి విజయనగరం) ఈ వ్యాసరచన కాధారమైన గ్రంథముల రచ ధన్యవాదాలు సమర్పించుచున్నాను.

# శింజాన మంజీర రవః!

శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మ

మహేశ్వరాకల్పిత తాండవే యః
ధిమిం ధిమిం ధింధిమి నాదపేయః,
హృత్స్పర్శ మాధుర్యగుణో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

పదే పదం స్వం వినివేశయన్త్యాః
స్వనే స్వనం చాఽపి చ మేళయన్త్యాః,
స్వామ్యాత్మభూతాఽనుపదో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

కృతే రవే శంకరకింకిణీభిః
గౌరీ పరామర్శన భావరూపే,
సంజాతరోమాంచసుఖో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

దృష్ట్వా స్వదృష్టిం వినివేశ్య తస్మై
జగత్ప్రధానాంతర శక్తిభావం,
ప్రాబోధయ ద్య స్సరసో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

పాణిం సరోజాతమివాఽర్ధఫుల్లం
విలోక్య తత్రత్య మహార్ఘభోగం,
కుర్వన్ మధుస్నిగ్ధతరో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

సృష్టిస్థితి ప్రత్యవహారరూపాన్
భావాన్ ముఖే ధీర గభీరవాచా,
యో వ్యాకరో త్యాంతరతో భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

విభా విలీనే స్వకవామభాగే
పుంరూపశక్తిం ప్రకటీకరిష్ణుః,
యో భాషతే తద్ధృదయం భవాన్యాః
శింజానమంజీరరవఃపునాతు.

విలీనగౌరీతనుకే శివే స్త్రీ
రూపం పుమాంసం ప్రకటీకరిష్ణుః,
యో భాషతే తద్ధృదయం భవాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

సదా స్వభర్త్రాననపద్మచింతా
భావార్పిత భ్రూయుగనేత్రయుగ్మం,
యో వా పర త్యాంతరతో భనాన్యాః
శింజానమంజీరరవః పునాతు.

వీలున్నది. అంతకు పూర్వ మీ చవతి యన్నదమ్ముల కిద్దరికి విరోధమున్నను ప్రకోపించు తరుణము చిక్కలేదు. కాని, ఎంతో కాలమితడు రాజ్యపాలన కావించలేదు. ముమ్మడి కృష్ణభూపతి రాష్ట్రకూట రాజ్యమునకేగి నేకళింగమునుండి తిరిగివచ్చి ఇమ్మడి యమ్మరాజు—తన చవతి యన్న దానార్ణవుని వేంగిరాజ్యమునుండి పారద్రోలి; మరల వేంగిరాజ్యమును పన్నెండు సంవత్సరములు పరిపాలించినపిమ్మట, క్రీ. శ. 970 యుద్ధమందీతడు తనచవతియన్న దానార్ణవునిచేత చంపబడి వీరమరణము పొందినట్లు శాసనసాక్ష్యము కలదు.

'భూనాథ భీమ తనయః సమరేషు చండః
భీమప్రతాప మభిహత్య తమ్ అమ్మరాజం,
దానార్ణవ క్షితిపతి స్సముపాదదత్స
దానార్పితార్థినికరః త్రిసమాః ధరిత్రీమ్.'

ఈ పెన్నగశాసనము శక్తివర్మ కాలము నాటిదైనను, తన తండ్రి దానార్ణవుడు, తన పినతండ్రి అమ్మరాజును యుద్ధమందు సంహరించి అనేకదానములు కావించి సార్థక నామధేయుడైనట్లు తెలుపుచున్నది. వీరు దైవవాతుఁడనుట మంగల్లు శాసనమువల్ల తెలియుచున్నది.

చాళుక్యదానార్ణవ భీమనాగసుతుడు క్రీ. శ. 956 కు పూర్వము పన్నెండేండ్లు, తరుపరి పదమూడేండ్లు అజ్ఞాతవాసిగా కాలము గడపినట్లు స్పష్టమగుచున్నది. మొదటి అజ్ఞాతవాసములో చవతి యన్నదమ్ముల కిద్దరికి ప్రత్యక్షవిరోధము లేదు. కాగా, అప్పుడీతడు రాజభోగము లనుభవించుచు, చవతి తమ్ముని యండనే అనామకుడుగా జీవించుట కవకాశమున్నది. వేంగిరాజ్యములో ఆకాలమున విప్లవకల్లోలములు లేవు.

పోతే, క్రీ. శ. 956–970 మధ్యకాలమందలి దానార్ణవుని రెండవ యజ్ఞాతవాసము రాజద్రోహముతో కూడుకొన్నది. ఇమ్మడి అమ్మరాజ శత్రువు ముమ్మడి కృష్ణభూపతితో చవతియన్న మైత్రికావించుట రాజద్రోహము. ఈ మధ్యకాలములో జైనకవి రచనరక్షణలో సమీపవర్తియై చాళుక్యదానార్ణవ రాజకవి రచన తెనుగు ఛందమునకు సహాయకుడుగానుండి ప్రాణసమాన మిత్రత్వము నెరపినట్లూహించుట సమయోచితము.

జైనశ్రావకుడు మల్లియ రేచన—పరమ మాహేశ్వరదానార్ణవుడు, పరమత హితులైనారనుట. సర్వమత సమబుద్ధి, లేక, శైవమతమును త్యజించి దానార్ణవ చాళుక్యరాజు జైనమతము స్వీకరించి, మిత్ర పోషణలో అజ్ఞాతవాసము వెళ్ళదీసెననుట అపద్ధర్మము.

ఈ వేంగి రాజ్యమందలి గూఢ సంచారి 'దాన' రాజుచరిత్రను, తన కావ్యావతారికలో రేచన గూఢపద'దాన' కవి చరిత్రగా వర్ణించి తన్మిత్ర రక్షణ కావించుట చమత్కారము. ఇది కాలోచిత గూఢ పద నామ చరిత్రోదాహరణము.

క్రీ. శ. 960–965 మధ్యకాలములో శక్తివర్మ విమలాదిత్యులు బాలకులై యున్నప్పుడు భీమనాగ సుతుడు చాళుక్య దానార్ణవ 'వాచికాభరణు కృతికి సహాయుడుగా—కవిజనాశ్రయుడు మల్లియ రేచన సుకవి కవిజనాశ్రయమను ఛందము తెనుగుబాస నరుదుగ జెప్పెన్.'

ఇందలి గూఢ'దాన'పద నామమును గ్రహించనప్పుడీ పద్యము అనన్వయములుగా గోచరించినను తదర్థము 'దాన + అర్ణవుడు=దానార్ణవుడు' బయల్పడినప్పుడు చారిత్రకానన్వయదోషము లేదు. కావ్యాలంకార చూడామణిలో 'గూఢచతుర్థము' పేర్కొనబడినది. తద్భిన్నముగా దీనిలో 'గూఢపదనామము గోపన చేయబడియున్నది.

గూఢపదనామ మిందు లేదను పక్షముల వాచ్యముగా చాళుక్య దానార్ణవ కవినామముతో పై కందపద్యములు వ్రాసియుండవీలున్నది.

'పరగిన విమల యశో (భూ)
సుర నిరతుడు భీమనాగసుతు డఖిల కళా
పరిణతు డయ్యెను భూ (న)ర
వరుడు ప్రసాదిత (దానార్ణవ శ్రీ కవి తాన్.)'

'అసమాన దానరవి తన
య సమానోన్నతుడు వా(చి)కాభరణుడు ప్రా
ణ సమానమిత్రు డీ కృతి
కి సహాయుడుగా నుదాత్త కీర్తిప్రీతిన్.'

'అనవద్య కావ్యలక్షణ
మొనరంగా కవిజనాశ్రయుడు మల్లియ రే
చన సుకవి కవిజనాశ్రయ
మను ఛందము తెనుగుబాస నరుదుగ జెప్పెన్.'

ఇట్టి పద్యములు మార్పు కంగీకరించుచున్నను, ఇంతకంటె మేలుగా వ్రాయ నవకాశమున్నను, రేచన యట్లు చేయకపోవుటయే కాక, అనన్య ఛందోమకవిగ తనను పాఠకులు భావించుట కవకాశమిచ్చి, గూఢపద నామ రక్షణ కావించినాడు. ఇందలి 'విమల, దాన భీమన భూ నరవరు(ల)—భూసుర నిరతు(ల)' గూఢ

చరిత్ర బయటపడినప్పుడా యనన్వయము దోషాభాసము కాక తప్పదు. ఇట్టి సూచనకూడ దోషాధికారములో వ్యంజకము చేయఁబడినది. 'ఇవియు (దోషములే) వెండి యతిశయ తరమై చను గొన్నియెడల' ననుట దోషాభాస చమత్కారము.

క్రీ. శ. 960—965 ప్రాంతమునకు ముందే 'గూఢపదనామ గోపన' మున్నప్పుడు, క్రీ. శ. 1053—1054 ప్రాంతమున చోళకవిరాజు పేర్కొన్న 'గూఢవస్తుముఖ కావ్యము' లేదనుట విపరీతము.

క్రీ. శ. 1950 ప్రాంతములో బెర్నార్డుషా (కొల్లిన్స్) గ్రంథమును విమర్శించునప్పుడు వ్రాసిన దాని యాంధ్రానువాదము పరిశీలింపతగినది. 'అసలు మనం చెత్త అని కొట్టిపారవేసే వాటిల్లోనే అప్పుడప్పుడు కొన్ని మహాసత్యాలు గర్భితమయి వుంటాయి.'—(ఫ్రాన్సిస్ వాట్సన్. ఆంధ్రపత్రిక, 15-8-1950, ఆదివారము.)

ఇప్పుడేకాదు, ఎప్పుడును యుక్తి వంచన మర్మాదులు, గూఢపద నామ గోపనాదులు, గూఢ వస్తుమయ కావ్యాదులు లేకపోలేదు. కాని, ఉపయోగించుట సకృత్తు. అట్లని రేచనకృతి పద్యములలోను, నన్నిచోడుని కృతిపద్యములలోను గూఢవస్తు కవితా చరిత్ర లేదనుట ఉన్న చారిత్రక సత్యమును లేదనుట కాకపోదు.

చిత్రకవితాదులను నిర్వచించిన విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో ఇతరేతర వర్గజవళి కుదాహరణముగా క్రిందిగీతమును వ్రాసియున్నాడు.

'చతురుపాయ బాహు శక్తికి మావళి
బాలి విడిచి చిత్రభాను సాక్షి
బాటె సర్వసిద్ధి పదమేది ధరణీశ
రాహామునకు నోడి రాచకదుపు.'

దీనిలో విశ్వేశ్వర చాళుక్య చక్రవర్తి సర్వసిద్ధి దేశముపై దండెత్తినప్పటి జయచరిత్ర వర్ణింపబడినది. కాని, ఆ యుద్ధకాలమేదో తెలియదు. గూఢకాల గోపన మిందున్నదేమో లెక్కింత మనుకొన్న యెడల ఇందు 'చతురుపాయ బాహుశక్తి కుమావళి—(శా. శ.) 1324 వర్షములకు నేటి—చిత్రభానుసాక్షి' యుద్ధకాలము గర్భితమైయున్నదనక తప్పదు.

ఇదే పద్యము సంస్కృత శ్లోకముగా అనువదింపబడి విశ్వేశ్వర చక్రవర్తి దానశాసనములోని కెక్కింపబడినది.

'గతిబాహుశక్తి భూమితి
మహిగణయ త్సర్వసిద్ధిపథ భగ్నం,
పతి చిత్రభాను సాక్షిణి
ధరణీవరాహో దధావ దంష్ట్రబలం.'

దీనిలో వ్యంగ్య కాలముకంటె వాచ్యగణిత చరిత్ర కాలమున్నదనుట సత్యము. ఇప్పుడీ క్రీ. శ. 1402 సం. గీతికాలమును శిలాశాసనకాలముతో సమకాలముగా నున్నదని భాషాతత్త్వకాలవేత్తలు సహిత మంగీకరింపక తప్పదు. అయితే, ప్రతిగూఢ వ్యంగ్య చరిత్రకు శిలాశాసన ప్రమాణాదులు చూపుట సాధ్యము కానిపని. అంతమాత్రముచేతనే గూఢవ్యంగ్యచరిత్ర సత్యమును కాదన వీలులేదు.

పైన వివరించినట్లు క్రీ. శ. 950-965 ప్రాంతమందు గూఢకవి చాళుక్య దానార్ణవుడు సహాయకవిగా రేచన రచించిన కవిజనాశ్రయములో చిత్రకవిత లేకపోయినను, క్రీ. శ. 1053-1054 లేది కవిరాజ శిఖామణి నన్నిచోడుడు రచించిన కుమారసంభవములో చక్రబంధాది చిత్రకవిత కలదనుట కాలక్రమ దోషము కాదు.

'వేములవాడను వెలసిన
భీమేశ్వర కరుణగల్గు భీమ సుకవి నే
గోమటి రేచన మీదను
నీ మహి గవులెన్న ఛంద మెలమి రచింతున్.'

ఈ కృత్రిమగాథ వేములవాడ భీమకవి కృత్రిమ భాషాసేవను తెలుపుచున్నది.

వేములవాడ భీమకవి క్రీ. శ. 1175 ప్రాంతమందలి 'భీమనృపాల సచివుండు దండనాథాగ్రణి దానరాజు'ను రేచనకృతికి సహాయుడని చెప్పక, 'నే గోమటిరేచనమీదను నీ మహి గవులెన్న ఛంద మెలమి రచింతు'నని వాచ్యముగా వ్రాయుట విపరీతము. గూఢపదనామ మర్మము బోధపడియున్నచో నేడీ దుష్టకల్పన గుట్టు బయటపడియుండెడు. 'భీమనాగ్రసుతుడు' పాతమూ రూపునూ సిపోయెడిది. ఇందలి వత్సవాయి 'దాన'రాజు పూసపాటి 'భీమనృపాలు'ని సచివుడేకాని, దానార్ణవ చాళుక్య రాజువలె భీమనాగ్రసుతుడు కాడు. కేవలము సేనానాయకుడు, సచివుడు, వత్సవాయి వంశమూలపురుషుడు, వేములవాడ భీమకవి రామగోపాల చరిత్రకు కృతిపతి. రేచనకృతికి సహాయకవి కాడు.

# తెనుగు తొలికావ్యము: కవిజనాశ్రయము

జైనకవులు కన్నడాంధ్రభాషలలో రచించిన కృతిచిహ్నము లెప్పటివో పరిశీలించుట అప్రస్తుతము కాదు. 'వీరు (రత్నత్రయము : పంప, పొన్న, రన్నలను కన్నడకవులు) ముగ్గురు వేంగిదేశవాస్తవ్యులే కావున పంపకవి(యు), (పొన్నకవియు) తెనుగున కవిత చెప్పుట చారిత్రకానుకూలముగను, సాహిత్యక్రమ పరిణామానుకూలముగ నున్నది.' (శ్రీ నిడదవోలు వేంకటరావుగారు - తెనుగు కవుల చరిత్ర)

క్రీ. శ. 940-945 మధ్యకాలములో పంపకవి విక్రమార్జున విజయమును కన్నడభారతమును వేములవాడ ఇమ్మడి యరికేసరి కంకితమిచ్చినట్లే; పద్మకవి (పొన్నకవి) జినేంద్ర పురాణమును వేంగి ఇమ్మడి (వేములవాడ) చాళుక్యభీముని కంకిత మిచ్చెనో, లేదో తెలియకపోయినను తత్కాలమున రచించిన తెనుగు పద్య మొకటి ప్రబంధరత్నావళిలో సంగ్రహింపబడి యున్నది.

'రెండవ (ద్రాక్షారామ) చాళుక్య భీమునికిని (వేములవాడ) ఇమ్మడి యరికేసరికిని (రాష్ట్రకూటుడు) ఇమ్మడి గోవిందవల్లభుడు సామాన్యశత్రువు. ఇద్దరును గోవిందునిమీద విజయమందిరి.' శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు. (నవంబరు, 1948—భారతి.)

వేంగి ఇమ్మడి చాళుక్యభీమునికి వేములవాడ ఇమ్మడి యరికేసరికి మిత్రత్వమున్నదికాని, రాజభీమునికి వేములవాడ చాళుక్యభీముడను బిరుదనామమున్నదో, లేదో తెలియదు. వేములవాడ ఇమ్మడి యరికేసరికి విక్రమార్జునుడను బిరుదనామమున్నది కాని, వేములవాడ భీముడను బిరుదనామము లేదు. ఇతని యన్నకే విక్రమభీముడని పేరుండుట క్రమమైనను, ఇతనికన్న రెండుకి దున్నట్లు తెలియుటలేదు. దాక్షారామము వేములవాడ భీముల యన్నగాను, తెలంగాణం వేములవాడ విక్రమార్జునుడు (అరికేసరి) తమ్ముడుగాను యుద్ధములలో చాళుక్యరాజు లిద్దరు పాల్గొనరనుట మిత్రబాంధవ్యము.

శ్రీనాథకవి ప్రశంసలో కాశీఖండమందు పేర్కొనిన 'వేములవాడ భీమన భంగి(యు): 'దాక్షారామ చాళుక్యభీము......(నూర్గి — దేశి కవిత)... ద్వైరాజ్య భాగంబు'ను భిన్నమతిలు కావని తర్కోక్తి చరిత్ర తెల్పుచున్నది. ఇది క్రీ. శ. 934—945 ప్రాంతమందలి తెనుగు కావ్యారంభకాలమే కాని, శిలాశాసనారంభ పద్యకాలము కాదు.

"క్రీ. శ. 625 ప్రాంతమందలి రేనాటి తొలి తెనుగు రగడ శాసనకాలము చాళుక్యరాజుల కాలము నాటిదికాక, తెనుగు చోళరాజుల కాలము నాటిదిగా కనబడుచున్నది. దీని నే 'మొదటి గేయ శాసనం' కాబో లనుచున్నారు." (శ్రీ తేకుమళ్ల కామేశ్వరరావుగారు.)

క్రీ.శ. 958—960 ప్రాంతము 'కన్నడభాషలో పొన్నకవి, సర్వదేవుడనిపేరు వహించినవాడనియు నాతడే గ్రంథమును (ఆదిపురాణమును) తెలుగులో రచించియుండెదు'నని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు భావించినట్లు తెలియుచున్నది. ఈ కాలము క్రీ. శ. 945—970 మధ్యకాలమందలి ఇమ్మడి అమ్మరాజ విజయాదిత్య చాళుక్యరాజు—ఇమ్మడి వేములవాడ చాళుక్యభీముని కనిష్ఠపుత్రుడు—సమకాలముగా కనబడుచున్నది.

ఇమ్మడి అమ్మరాజ చాళుక్యుడు జైనాలయములకు విరివిగా దానములు చేయుటయే కాక, జైన 'శ్రావకి' చామెకాంబను ఉంపుడుకత్తెగా ఉంచుకొని, ఆమె ప్రోత్సాహముతో ఆమె జైనగురువు అర్హనందికి అత్తిలినాడులో కంచుమర్రు గ్రామము దాన మిచ్చినట్లు తెలియుచున్నది. పొన్నకవి ఆదిపురాణమును జైన తీర్థంకరుని చరిత్ర మీతని కాలములో రచింపబడిన ట్లూహించుట తప్పుకాదు - జినమత హితము. ఇమ్మడి చాళుక్య అమ్మరాజు, 'కలిపేతు' డని తెలియుచున్నది. క్రీ. శ. 960-965 మధ్య కాలములో వేంగి ఇమ్మడి (వేములవాడ) చాళుక్య భీమనాగ్రసుతుడు దానార్ణవచాళుక్యరాజకవియను ప్రాణమిత్రుడీ కృతికి సహాయుడుగా రేచన కవిజనాశ్రయమను ఛందము తెనుగుబాస చెప్పెను.

"క్రీ. శ. 990 ప్రాంతములో కవిరాజ హంస బిరుదాంకితుడగు నాగవర్మ 'ఛందోంబుధి' యను కన్నడ లక్షణ గ్రంథమును రచించియున్నాడు. ఇది కన్నడ భాషాలక్షణ గ్రంథములలో ప్రశస్తమైనది. ప్రాథమికమైనది. ఈ రెండింటికి పోలికలు చూపుచున్నాడను.

"ఇంకను జాత్యధికారమున కందత్రిపద లక్షణములలో ఛందోంబుధితో పోలికలుగలవు. దోషాధికారమున కవిరాజమార్గమున పోలికలు గలవు. పై విషయముల బరిశీలించి చూచినచో కవిజనాశ్రయము 10-12 శతాబ్దముల మధ్య నననగా క్రీ. శ. 1100 ప్రాంతముల

రచితమైనట్లు నిర్ణయింపబడ్డది." (శ్రీ నిడదవోలు వెంకటరావుగారు. శ్రీ వావిళ్ళ కవిజనాశ్రయ పీఠిక).

రేచనకవిజనాశ్రయమందలి చాళుక్యదానార్ణవ సహాయాది గూఢచరిత్రకాలాగులు తెలియక పోవుట చేత, సాదృశ్యభాషాచరిత్ర తారుమారైనది. ఇప్పుడు క్రీ. శ. 990 ప్రాంతమందలి నాగవర్మ కన్నడ ఛందోంబుధి కంటె ముందు క్రీ. శ. 960-965 మధ్య కాలమందు రేచన తెనుగుఛందము రచింపబడినదనుట కాలక్రమము. క్రీ. శ. 960-965 ప్రాంతమందలి తెనుగు ఛందమును చూచి క్రీ. శ. 990 ప్రాంతమందలి కన్నడ ఛందోంబుధి రచింపబడిన దనుట భాషాతత్వ కాల సాదృశ్యము.

ఇమ్మడి వేములవాడ చాళుక్యభీమనాగ్రజుడు దానార్ణవుడే కవిజనాశ్రయమునకు తోడుకవి కాడనుట గూఢపదనామగోపనమునకు విరోధము. తెనుగు భారతరచనలో నన్నయభట్టునకు నారాయణభట్టు తోడు కవి కాడనుట యెట్టిదో ఇదియు నట్టిదే.

క్రీ. శ. 934-970 మధ్యకాలములో వేంగి పూర్వచాళుక్యరాజులలో ఇమ్మడి వేములవాడ చాళుక్యభీముడును, ఇతని యగ్రజుడు దానార్ణవ చాళుక్యరాజకవియు, ఇతని చవతితమ్ముడు ఇమ్మడి అమ్మరాజ విజయాదిత్య చాళుక్యరాజును క్రమముగా జైనకవులచేత తెనుగు జైనపురాణములు, తెనుగు ఛందాదులను రచింపజేయుటయే కాక, సహాయ కవులుగా గూడ భాషాసేవ చేసినారనుట చారిత్రక సత్యము.

ఈ క్రీ. శ. 10 శతాబ్ది తెనుగు దేశకవితె రంథ చరిత్ర నే కవిరాజ శిఖామణి చోడుడు క్రింది గీతములో సంగ్రహముగా 'చాళుక్యరాజు మొదలుగ బలువుర్' దేశకవులని సూచించినాడు.

'మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశకవిత బుట్టించి తెనుం
గున నిల్పి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ బలువుర్.'

క్రీ. శ. 517-550 ప్రాంతమందు జనాశ్రయ విష్ణుకుండి మాధవవర్మ రచించిన మార్గసంస్కృతి జనాశ్రయములోను, క్రీ॥ శ॥ 960-965 ప్రాంతమందు కవిజనాశ్రయుడు మల్లియరేచనకృత- దానార్ణవ చాళుక్యరాజకవి సహాయుడుగా రచించిన 'దేవి తెనుగు' కవిజనాశ్రయములోను సముగుగా 'శిష్టకం గీతి కాపగా' యను సప్తవిధ సీసములను పేర్కొన్నను, రెంటిలో 'మార్గ-శ్రేశి' లక్షణములు భిన్న-భిన్న మార్గములలో నిర్వచింపబడినవి. అయినను, ఆ దేశిమార్గ లక్షణములు రెంటిలో, 'పింగళు (ఛందము) - పైంగల చంద(మ్)' పేరు సముముగా పేర్కొనబడినది. జనాశ్రయములో అధ్యాయములని పేర్కొన్నను, తద్వ్యాఖ్యానములో గుణస్వామి '(వృత్తాని) అధికారోయమ్, ప్రస్తార ఇత్యధికారః' అని వ్రాసిన దానినిబట్టి, కవిజనాశ్రయములో అన్ని భాగములు అధికారములుగా విభాగింపబడినవి.

ఇంతకుపూర్వము క్రీ. శ. 900—1000 మధ్య కాలమును నన్నయ పూర్వవాఙ్మయయుగముగా విభాగించుట సదాచారమైయున్నను, ఇప్పుడు పైన వివరించి గుర్తింపబడిన క్రీ. శ. 960—965 కాలమునాటి జైనకవి వాఙ్మయము - తూర్పు చాళుక్యరాజకవి దానార్ణవుడు సహాయకవిగా రచింపబడిన మల్లియ రేచన తెనుగు కవిజనాశ్రయమునుబట్టి—జైనాంధ్ర వాఙ్మయయుగము: మల్లియరేచనయుగము—పూర్వ చాళుక్యరాజకవి యుగముగా లబ్ధగ్రంథ సారస్వతము నిరూపించుచున్నది.

క్రీ. శ. 800—900 కాలమునాటి పూర్వపద్య శిలాశాసనయుగమును చాళుక్యరాజయుగమనుట చారిత్రక సత్యము. క్రీ. శ. 600—800 కాలమునాటి పూర్వపద్య శిలాశాసనయుగమును చోళరాజయుగమనుట సముంజసము.

కడపజిల్లా పొట్లదుర్తిమాలెపాడు శిలాశాసనమందలి మొదటి తెనుగుపద్య శాసనము 'శ్రీ సోఅ మహారాజు గ్రొళవ ఇనుపులోలి—

'అణపోతులు రేవణకాలు
—పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్నాటి
—ఇశైరనికిన.'

దీని ఛాయ—

'శ్రీ చోడమహారాజుల యాజ్ఞానుసారము ఇను ప్రోలు—

'అనపతులు రేవనగారు
—(పె)ద్దనగారు

ఇచ్చిన పన్నస పెన్నార
—ఇకె రేనికిన్'

ఇది ఉద్యానవనదానము - పనసతోట దానము. దీనిలో దశియతి చెల్లకపోయినను, యాగ్గతి చెల్లినది.

తెలుగు తొలికావ్యరచనకు సహాయకుడిగా గూఢపదనామముతో పేర్కొన్న క్రీ. శ. 956-972 ప్రాంతపు దానరాజుచరిత్ర క్రింది విధముగా నున్నది:

"దానవరేంద్రుడు విద్యాకలాపవిదుడు. చతుష్షష్టి కళాభిజ్ఞుడు. ధనిధి యతడు. రాజనారాయణ బిరుదాంచితుడు. కర్ణుని దానమహిమను మరపింపజేసిన మహాదానపరుడతడు. యుద్ధరంగమున దగ్రగామి. ప్రధాని. వీరాగ్రేసరు డతడు. దానార్ణవునికి ఆర్యా మహాదేవి యందు శక్తివర్మ విమలాదిత్యులను ఇరువురు కుమారులుదయించిరి" (శ్రీ॥ శ్రీ॥ భావరాజు వేంకటకృష్ణారావు - రాజరాజనరేంద్రుడు.)

అనాగా వ్యంగ్యశిద్ధాంతములై యున్న క్రీ. శ. 960-965 ప్రాంతపు రేచనగూఢపదనామ'దాన' కవి చరిత్రము, క్రీ. శ. 1053-1064 ప్రాంతపు చోడుని గూఢ వస్తుమయ గణితదేశకాలచరిత్రను విమర్శకులు పరిశీలింపక, విశ్వసింపక రచించు భాషాచరిత్రలు కేవల కల్పనాకృతులు కృత్రిమాత్మములు. చారిత్రక భాషాచరిత్రలు కవు.

గ్రంథాంతరాలకలో కవిజనాశ్రయమును మల్లియ రేచన చారిత్రకముగా 'దాన (అర్ణవుడు)—దానార్ణవుడు. నాచికాధిరాజుడు' అనియు, ప్రబంధాంతరాలకలో కవిరాజశిఖామణి నన్నెచోడరాజు చారిత్రకముగా 'మల్లయ-తిప్పిభూ'యనుటయే కాక, కథలో 'సోమ మనుష్యరూప ధూర్జటి - మల్లికార్జున; త్రైలోక్యపూజ్యన్' అనగా సోమేశ్వర త్రైలోక్యమల్లరాజు అనియు చాళుక్యరాజులపేర్లు గూఢపదనామములుగా వ్యంజకము చేసినమాట పూర్వకవి సమయము కాకపోదుగదా!

నన్నెకవిత్రయమునకు పూర్వము జైనవాఙ్మయమంతయు శిథిలమైనదనుట నిరాధారము. ఉన్నంతలో కవిజనాశ్రయమును తెలుగు గ్రంథము జైనకవి తొలికావ్యము.

గముతో వీరి "వోకో-వయొలిన్" కచ్చేరీ వినే భాగ్యము అబ్బినది. అప్పటి అనేకసార్లు అరియకుడి రామానుజయ్యంగార్ల కచ్చేరీలు, కరైకుడి సోదరుల వీణ కచ్చేరీలు, నయినాపిళ్ళెగారి కచ్చేరీ, ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఫిడేలు, పల్లడం సంజీవరావుగారి వేణుగానం, టైగర్ వరదాచార్యులవారి ప్రబంధగాన ప్రవాహములు - విని నా చెవులను నాదసుధతో నింపుకొని వాని మననము చేయుచు ప్రమత్తుడై వీధులవెంట నడుచుచున్న రోజులు. "హరినాగభూషణంగారు వక్కీలు; సంస్కృత భాషలో పండితులు; గొప్ప సంస్కారి. వీరి సంగీతము వినుట పుణ్యవంతులకే గాని ఇతరులకు అబ్బదు. దక్షిణామూర్తి పిళ్ళెగారి చేలా వేణునాయకరు. వీరి సంగీతకచ్చేరి మీరంతా నిశ్శబ్దంగా విని ఆనందించవలెనని" జడ్జి శ్రీ భుజంగరావుగారు పరిచయవాక్కులను చెప్పిరి. హరినాగభూషణంగారు ఫాలమును విభూతితో, గోపీచందనముతో అలంకరించి, రుద్రాక్షమాలలు ధరించి, శ్రీరామపంచాయతనమును జేబునుండి తీసి తమ ఎదుటనుంచి నమస్కరించి, సభకు కేలుమోడ్చి "తంబూర అయిదు నిముషాలు మీటండి బాబు" అన్నారు. వారేదో ధ్యాననిమగ్నులయి యుండిరి. పరిబోణికర్ణం వాయించిరి. సామాన్యముగా పిలుకాని తావుల్లో వీరి వేళ్లు తీగలాగ అల్లుకునేవి. మంచి లయపుష్టి. కమాను కొంత పరుషముగానే ఉన్నదనిపించినది. అప్పుడప్పుడు పాడేవారు. ఆ వయసులో సుమారు మూడవ శ్రుతిలో అంత సులభముగా పాడేవారు. "రామా నీపై తనకు" కేదార రాగములో విస్తారముగా, కల్పనా విశేషములు గల స్వరవిస్తారముతో కచ్చేరి బాగా రక్తి కట్టినది. కన్నులు కొద్దిగా విప్పి విద్వాంసులనందరినీ చూచి చక్రవాకం ఆలాపన చేసిరి. వయొలిన్ వాయించినా, పాడినా ఒకే నాదప్రవాహము. వయోవృద్ధులు గొప్పపల్లవి విద్వాంసులు శ్రీ చింతలపల్లి వెంకటరావు (నేటికిని బాగుగా పాడగలరు. 85 ఏండ్ల వయస్సున!), ఇంకా విద్వాంసులు సోసలే రామదాసు ఇతర విద్వాంసులు హాజరయి తాళము వేయుచుండిరి. "ఎటుల బ్రోతువో తెలియ" పాడి 'పట్టి గొడ్డరీతి భక్షించి తిరిగితి' అన్న పంక్తిలో చాలసేపు ప్రౌఢముగా, నిలకడగా నెరవులు చేసిరి. అట్లే ఆగానములో తనను మరచి కన్నీరు కార్చని వారెవరు ఆ సభలో.

వట్టితాళపుగొడవలు, అకారాలు, సంగతులు తొడలు విరుగునట్లు తాళముల చరుపులు — ఇవే 'నెరవులు' చేయునప్పుడు వినువారికి భ్రమ పుట్టించు తామసపు గజిబిజిలు. అటి పని సర్వమును ఉత్తమలక్షణములతో సుశిక్షితమయిన పద్ధతిలో పాడుచూ ఆ సాహిత్యార్థమును మెరుపుతీగవలె ప్రకాశింపచేయు పంతులవారి భక్తిరసపూరితమయిన హృదయగానము, సాహిత్య ప్రాధాన్యము నాకు మొట్టమొదట గుణపాఠముగా పరిణమించినది. రాగము స్వరము - వికల్పన లందయినా - పంతులవారిగానములో కాలము, మధ్యకాలము, త్రికాలమను మూడు కాలములుండేవి. రాగము మంద్రమధ్యమ తారస్థాయులలో విస్తారముగా చిత్రింపబడేది. శంకరాచార్యుల భాష్యము పూర్తిగా పఠించి, నియమనిష్ఠలతో అనేకభాషలందు విద్వత్తును గడించిన పరిపాకముగల వాక్కుతో, పద్ధతిని మీరక, భృంగిన కేశ మతంగ నారదాదులుపాసించిన సంగీతజ్ఞానము నార్జించి భక్తితో పాడునప్పుడు గల్గు మనోవికాసము, ఆత్మానందము దైవికమయినది; అప్రాకృతమయినది. అటి ఉత్కృష్టమయిన గానము పంతులవారి కచ్చేరీలలో విన్నాను. తారస్థాయిలో పాడుచు మంద్రస్థాయిలో వయొలిన్ తమ గంభీరమయిన కమానుతో వాయించునప్పుడు అనేక నూతన వైభవముతో వికసించేది. "సభాసదులు తప్పదని కోరినందులకు నా కీర్తన - ఒక్కటి పాడతాను." అని వినయపూర్వకముగా 'శరీర వాహిని' అనే రాగములో తమ కీర్తనను వినిపించిరి. శంకరాభరణము రాగాలాపన, తానము, "చక్కని నీ భజన చేసే వారికి తక్కువ కలదా?" అన్న పల్లవి, వారి స్వరవిన్యాసములు మరువరానివి. వారి రాగవిస్తార వైశిష్ట్యముగల ఒక పద్ధతి. పాడునప్పుడు వయొలిన్‌పై స్పర్ధ! వాయించునప్పుడు పాటపై స్పర్ధ! అనేక అర్ధనారి అవస్థ. "గాత్రమునకు అతీతమైనది వాద్యములో ఎంతో కలదు. జంత్రములకు సాధ్యమే కానిది గాత్రములోనూ కద్దు. రెంటినీ తనివితీర మనసార వినువారి కందజేయుటం నాలక్ష్యం." అని తమ "వోకో-వయొలిన్" పద్ధతి సమర్థించుచు నాతో చెప్పవారు. వీరు స్వరము పాడునప్పుడు ఆవిన్యాసములను గమనించి తాళము వేయగలిగిన వారు సగము విద్వాంసులయినట్లే. రాగమునందు అప్పటమయిన ప్రయోగము లుండెడివి.

# కీ. శే. హరినాగభూషణం పంతులు

పూర్తిగా తంజావూరిబాణీ కాకపోయినా వారి రాగము గమక, అను స్వర, ప్రయోగ గౌరవములతో పుష్టముగా నుండెడిది. తాన విస్తరణలో తమ వాద్య నైపుణిని ప్రతివారికి ఆశ్చర్యము కలిగించునట్లు ప్రదర్శించేవారు.

బహుకాలము తరువాత విజయవాడలో వారితోటి నాకు పరిచయము ఏర్పడినది. గంటల తరబడి తమ ఆశయాలు నాతో ముచ్చటించేవారు. "మా తండ్రి, తాతగార్ల వద్ద సంగీతం నేర్చుకున్నాను. పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి శిష్యులం. త్యాగయ్యగారి పరంపర. గోవిందస్వామిపిళ్ళె నాకు వినికిడి గురువు. నా దేవుడు తిరుక్కొడికావల్ కృష్ణయ్యగారు. భైరవి పాడితే కోనేరి రాజపురం వైద్యనాథయ్యగారు పాడాలి. వారికి రెండు పర్యాయములు ప్రక్కవాద్యం వాయించాను." అని చెప్పేవారు. హిందూస్థాని సంగీతమంటే చెవికోసుకునేవారు. బరోడాలో వీరికి గొప్ప సన్మానం జరిగిన ఘట్టాలు, దక్షిణామూర్తిపిళ్ళెగారు మృదంగం వాయించినప్పుడు తమకు కలిగిన ఉత్సాహాన్ని పదే పదే జ్ఞాపకం చేసుకునేవారు. వీరికి "వాగ్గేయకారక రత్న" బిరుదు నిచ్చు సన్మానసభకు నా గురువుగారు బ్రహ్మశ్రీ టి.ఎల్. వెంకట్రామయ్యరు గారూ, ప్రొఫెసర్ సాంబమూర్తి వెళ్ళియుండిరి. "హరినాగభూషణంగారి గానం విద్వాంసులకు మార్గదర్శి. ఆంధ్రులతో సామాన్యంగా రాగాలను కత్తిరిస్తూ ఆలాపన చేస్తుంటారు. అంత తప్పితే వారి గానానికి, మా తంజావూరు పద్ధతికి ఏమీ వ్యత్యాసం లేదు" అనేవారు మా గురువులు.

ఒక కళాభిమాని వివరించినట్లు వారిది "పురుష మార్గము." చెవికి కొంత ఘాటయినా బుద్ధికి చురుకుదనమిచ్చే ప్రౌఢపద్ధతి 'చెవికి హాయినిచ్చేది కళ; దానిని అతిక్రమించి బుద్ధికి-ఇంకా ఆత్మకూ ఆనందాన్నిచ్చేది-విద్య.' అని పంతులవారు అనేవారు. ఒకసారి నా కచ్చేరిలో నన్ను ఆశీర్వదించుచు అన్నారు: "మునుపు-నా అహంకారంవల్ల కాబోలు ఎవరుపాడినా మెచ్చుకునేవాణ్ణికాను. ఇప్పుడు నా మెదడు, హృదయమూ పక్వమయినవి. 'లేక నా' అనే అసావేరికీర్తన పాడుతుంటే ఆనందబాష్పాలు రాల్చాను." అని. వారి ఆనందబాష్పాలు నా సంగీతమునకు కాదు, వారికీ నాకూ ఇలవేల్పు - త్యాగరాజస్వాములవారి అసావేరి రాగ మాధుర్యమునకు.

ఎంతటి విద్వాంసుని గోల్పోయినది ఆంధ్రదేశము మొన్న సెప్టెంబరు సోమవారం 7 తేదిన! తుదిక్షణములలో రాములవారి ధ్యానముతో-రామానంద తీర్థులయి "యోగే నాంతే తనుత్యజాం" అన్నట్లు మోక్ష మార్గమును పట్టిన పంతులుగారు ధన్యులు. 'సంతతం చిన్తయేనన్తం, అంతకాలే విశేషతః' అన్న చార్య వాక్కు నిదర్శితమైనది.

వారిపేర సంగీత కచ్చేరీలకు ఒక సుమందిరమును బందరులో నిర్మించి, వారిపేర సంగీతపు పోటీలను ఏర్పాటు చేయించి, వారి లక్ష్యములను ఆంధ్రదేశము మరువనివ్వకుండునట్లు రసికులు ప్రయత్నింతురు గాక! హరిగానం హరిసమర్పణమైనది.

# శిఖరవాసి

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఇచటనే, ఇచటనే నిదురింతు నేను-
ఈ మలలలోన, శిలలపై, ఇచట నిల్చి!
ఏను నను లేపబోవకుడీ ప్రాణాలు
గగన మెక్కుటే నాకు తోడుగ శయింతు.

నా కనులలోన గాజురంధ్రాలు మటుకె
కలవు: ఏను విడిపోవు మేఘాలనుండి
తొంగి చూచెడు ఏ తటిత్తునకు గూడ
లోన జొరబడు నంత వెలుంగు లేదు.

ఎప్పుడెటు లీ మహాద్రిని నెక్కినానో
స్మృతికి దోచదు, కాని నా కింతమటుకె
జ్ఞప్తియున్నది-ఒకనాడు సుప్తినున్న
నా కనులముందు వికృతంపు నాట్యమాడు
ఒక్క హస్తము, అది మొండిముక్క మటుకె,
వ్రేళ్లు జూపుచు వింతగా పిలిచినట్లు,
ఆకరాంగుళులందు రత్నాగణములు
కోటికాంతులు వెల్లుగ గుప్పుచున్న
రంగు రంగుల రత్నాల ఉంగరాలు
నా కనుల గ్రుడ్డి చేసినన్ త్రాళ్లగట్టి
ఈడ్చుకొనిపోయి నట్లు - నా కింతమటుకె
జ్ఞప్తియున్నది: ఆపై సుషుప్తి వదలి
లేచి చూచితి: పెద్ద దక్కూచి రీతి
అస్తమించెడు రక్తశీతాంశు బింబ
మొక ముహూర్తమె గాన్పించి ఉన్నయట్లె
మాయమైనది - మసృణ తమస్సు లంత
గ్రమ్ముకొన్నవి, నా కనుంగవను కదలు
చున్న ఆ తుది దృశ్యంపు చిన్నెలెల్ల
తుడిచిపెట్టుచు - నేను అంధుడను నేడు!

ఒక దినాంతము సత్త్వ మటుకు నిరంత
రమును వినిపించుచున్నది, రాత్రి-పగలు
భేదమును నాకు తెలుపుచు!......
..................ఈ దరిద్ర
జీవితపు దాస్యమ్మును జూచి ఛీయటంచు
రోసికొనరేలా? శిఖరోచ్చ దేశమందు
నిత్యము వసించు ఈ మహాశయుడెవడో,
ఎంతటి అదృష్టవంతుడో ఇట నటంచు
ఎవ్వరా అబ్బురపడి వీక్షించువారు?
అగు నదృష్టములే - వసంతాగమమున
కేలు జపు చూతపుగొమ్మకై పుడిపు
వ్రేళ్లు-తొలి మొగిలుం జూచి ఫించ మెగచి
పొగరు కేకల తాండవము బొనర్చు
వన మయూరాలు-చంద్రికా ప్లావితములు
నవ వికస్వరా వికచ కైరవదళాలు-
తరుణ హేమంత హరితశాద్వలముల తుది
ఉదయసంధ్యాతరణి కరోన్మథితములయి
ఇంద్ర ధనువుల విరజిల్లు హిమకణాలు
శిశిర కాల ప్రశాంత నిశీథిని ము
ఖానిల హత తరుశాఖలందు నుండి
జారిపడు పత్రపాళి బంగారు వన్నె-
దారుణనిదాఘసమయమధ్యాహ్నమందు
సాంద్రతరు శీతలచ్ఛాయ శ్రాంతినుండి
కన్నుదెరమోడ్చు మృగశాబకముల గుంపు!
ఏ నదృష్టవంతుడ - గత దృష్టినాది!
ఇచట తుదిరేయిదాక వసింతు, కొండ
దిగెడు కోరిక లేదు, శక్తియును లేదు!
ఇచటనే, ఇచటనె నిదురింతు నేను
ఈ శిలలపైన మలపైన నిచట నిల్చి!

# కథకళి సాహిత్యము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

మలయాళ సాహిత్యాకాశమందు 'ఎజుత్తచ్ఛన్' మధ్యాహ్న సూర్యుడు. ఆ భావములు మహోత్తుంగములు. వాని ననుకరించుట యటుండ — వాని వైపు తేరిచూచుటకైన నితరులకు గుండెలాగలేదు. అతని యనంతరము మరియొక కవి యెవ్వడును గావ్యరచనకు సాహసించుటయే గడ్డుమైపోయినది. అందుకే, సాహిత్యరంగమున భిన్న ప్రస్థానములు బయలుదేరినవి. 'ఎజుత్తచ్ఛన్' ప్రారంభించిన మార్గమును సాగింపుటకు సాహసింపని కవుల యంతర్వాణములోని యవిశ్వాసమే 'కథకళి' సాహిత్యమునకు పుట్టుకు దీర్చినదన వచ్చును. ఆ యవిశ్వాసము మంచిదేయైనది. నేడు ద్వీపాంతరములలో గూడ పేరుమోసిన 'ఆట్టకథా' నిర్మాణము జరిగినది. ఒక్కొకసారి చెడుగూడ మంచిగనే పరిణమించుట ప్రకృతిలోని విశేషము

'ఆట్టకథా' సాహిత్యము రూపందినది 'ఎజుత్తచ్ఛన్'కు తర్వాత నంటిమి. కాని, యంతమాత్రమున నది హఠాత్తుగనైన సృష్టియని చెప్పుటకు వీలులేదు. దాని కంతకుముందే, వివిధములగు పూర్వరూపము లున్నవి. ఆయా కాలమున నవి పరస్పర సాహచర్యమును — పరివర్తనమును జెందుచుండినవి. కాని యా సాహచర్యము సరసముగ నడిచి యుండలేదు. గాసట బీసటగా బడియుండెను. బంగారమంతయు మూసలో నున్నది. చక్కగా కరగించి పోతపోయువాడు గావలెను. సరసమైన జాతికి స్వభావసిద్ధమైన నృత్తగీతాదులయందలి యనురాగము కేరళీయులకు పరంపరాగతమే. "చాక్కియార్ కూత్తు", "కూడి ఆట్టమ్", "పాఠకం" మొదలైనవి వారి కళాభిరుచియొక్క వేలు వేలు నిదర్శనములు. చేరులు ప్రాచీనకాలము నుండియు యుద్ధ విద్యయందాసక్తిగలవారు; ఆరితేరినవారును. కనుక, యుద్ధప్రక్రియతో సాజాత్యమున్న "పడయణి", "వేలకళి" మొదలైన సామూహిక కళావినోదములయందును వారి కభిరుచి కద్దు. వీని యన్నిటిలోను ఆ జాతి తమకు ప్రత్యేకమైన స్వభావములను, ఆచారవిశేషములను, మానసిక వికారములను వ్యక్తీకరించికొన్నది. తర్వాతవచ్చిన 'ఆట్టకథా' సాహిత్యము వీని వికాసమే యనవచ్చును.

మొదటినుండియు వారి కావ్యసాహిత్యముతోడి సంబంధము హెచ్చు. అది కాలక్రమమున జెరిగినదే గాని తఱుగలేదు. అందుచే గీర్వాణవాసనలు భావాభిరామముగ మలయాళసాహిత్యమున వీచి కొట్టినవి. పురాణములు, కావ్యములు, శాస్త్రములు, వీరియందా దేశీయుల కభినివేశము రాగరాగ హెచ్చయ్యెను. 'చాక్కియార్ కూత్తు'లలోని ప్రవచన పద్ధతి దేశీయమే. కాని దానిలోని కథావస్తువు, కవిత్వము, సంస్కృతమునుండి తీసికొన్నవే. 'కూడియాట్ట'మందు గీర్వాణనాటకములనే యుపయోగించికొనుచుండిరి. రాగ రాగ జయదేవుని గీతగోవిందము వారి నాట్యరంగములలో నగ్రస్థానమును సంపాదించికొన్నది. అది నూతనమైన మఱికొన్ని సృష్టులకు దారిసూపెను. దాని పరిణామమే "కృష్ణనాటము". దీని నిర్మాత 'కోజికోడు' మానవేదరాజు. ఇతని కాలము కొల్లవర్షము తొమ్మిదవ శతాబ్దములోని ద్వితీయపాదము (క్రీ. శ. 1725) గీతగోవిందము — మఱికొన్ని కేరళీయుల స్వభావవిశేషములు పోతబోసికొని పుట్టినది 'కృష్ణనాట్టము'.

కృష్ణనాట్టము పుట్టినకాలము కేరళములో నంత శాంతమైనది గాదు. సామాజికపరిస్థితి యస్వస్థముగ నుండెను. చిన్న చిన్న రాజులు, చిల్లర దేవుళ్లుగా తమలో దామ పందెములు వేసికొనుచున్న కాలమది. సామూహికములైన కళల కిట్టి కాలమే తగినదా! యనిపించును. యుద్ధములు, రాష్ట్రీయ భావములు చెలరేగుచున్నపుడు, మనుష్యునిలోని యుత్సాహము, వినోదపరత యెక్కువగును. ఈ చిత్తవృత్తి నవకాశముగా గొనియే కేరళములో నభినయవిద్య వర్ధిల్లినదని చెప్పవచ్చును.

'కృష్ణనాట్ట'ముతో మాత్రమే జనుల కళాభిరుచి తృప్తిపడలేదు. 'చాక్కియార్ కూత్తు'న కంటెను, 'కూడియాట్ట'మున కంటెను దీనిలో గాంభీర్య మెక్కువయే. భక్తి — శృంగారాది రసముల స్ఫురణయు తగి

నంత యున్నది. కాని, వారి కళాపిపాసను దృప్తిపరచుటకు గావలసిన యున్నిహంగులును దీనిలో లేవు. 'కృష్ణనాట్టము' సంస్కృతనాటము, అందుచే సామాన్యులకు దానిలో ముక్కుడూ అతలేదు. భాషలో మార్పు గావలని వచ్చినది. కేరళీయులు యుద్ధప్రియు లంటిమి. కనుక వీర రౌద్రాది రసములు తృప్తిగాలేని కళలపై వారి కభిమానము తక్కువ. భారతజాతి హృదయమైన ధర్మప్రవణతయు—వారికి ప్రాణప్రదమైనదే. 'కృష్ణనాట్ట'మున నున్న సంగీతము కేళీయముగాదు. ప్రత్యేకమైన వారి నాట్యముల కందులో చోటు లేకుండెను. ఇట్టివే మరికొన్ని యతృప్తులు. వీనిని దీర్చుటకే 'రామనాట్టము' పుట్టినది. దీనితో నీ కొఱతలు గొంతవఱకు దీఱిన వనవచ్చును. 'రామనాట్ట'ముకర్త 'కొట్టారక్కర త్తంబురాన్'. ఏడు దినముల కథయిది. పైదానికంటె యిది కొంత విలక్షణము. మణిప్రవాళశైలిలో గథావతరణ మొనర్పబడినది. పాటలు మలయాళమందే యున్నవి. అభినయము గృష్ణనాట్టమున కంటెను శాస్త్రీయమైనది. రామకథయే ధర్మార్థ ధర్మోపదేశ ప్రవణముగదా! శృంగార, వీర, కరుణాది రసముల కది యునికిపట్టు. కనుక 'రామనాట్టము' సామాన్యజనుల దృష్టి నెక్కువగ నాకర్షించెను. కాని యది నేటి 'కథకళి' ప్రదర్శనమువలె నుండలేదు. వేషవిధానము అభినయరీతి, వాద్యమేళము—వీనిలో నింకను గొఱత లెన్నియో యుండినవి. పాత్రల కౌచిత్యము చాల తక్కువగ నుండెను. కథాపాత్ర లందులో సంభాషించెడివి; పాడెడివి. 'వేట్టత్తురాజు' గొంత సవరించెను. 'పురాణపురుషుల వేషధారణ మిట్టు గంభీరముగ నుండవలె'నని యతడు శాసించినాడు. వారి మనోవికారములను సూచించు మానాభినయమును గూడ నిర్దేశించినది యాతడే. అతని తరువాత 'తలప్పిల్లి' దేశప్రువాడైన 'కప్లింగాట్టు నంబూరి'యు, అతనికి సమకాలికుడైన 'కల్లడికొక్కొట్టు నంబూరి'యు గొన్ని మార్పులు దెచ్చిరి. వారిమార్పులు ముఖ్యముగ వేషవిధానమందు; అభినయమందు. ఇవి జరగినది యాజనుల యాచారవిశేషములను, అభిరుచులను ననుసరించియే. వీరి తరువాతకూడ నప్పు డప్పు డెన్నియో తీర్పులు, చేర్పులు, జరిగి నేటి కథకళి స్వరూపమునకు వచ్చినది. కేరళీయు లింతగా ప్రేమించుకళ మరియొకటి లేదు. దీనిని వారు దేశదేశములకును ప్రచారము చేసినారు. వారి నాట్యరంగ మించుమించు మన 'తైలు నాటక'ముల పద్ధతిగనే యుండును. పాత్ర లెప్పుడును మాటాడవు. అప్పుడప్పుడు దమ మనోవికారములను దెలుపుటకు గొన్ని ధ్వనులను మాత్ర మొనర్చును. నాట్యరంగమునకు గుడియోడములలో రెండు భద్రదీపము లుండును. వానినిండ తైలమునుబోసి—దీపమును ముట్టింతురు. ఆ దీపములకు వాడునది 'వేగు చెవగనూనె'యే. వానికి దప్ప యాతైలమును సామాన్యముగ నితరములకు వాడరు. 'కథకళి'లో ముఖ్యమైనది వేషరచన. ఆ వేషమును దీర్చుకొనుటకు గొన్నిగంటలు పట్టును. రంగులు కలుపుట, వానిని ముఖమున కంటించుట, వస్త్రములను ధరింపజేయుట మొదలగువానినే వృత్తిగా జేసికొని బ్రతుకువారు గొంద రాదేశమున నున్నారు.

రామనాట్టముగాని, కృష్ణనాట్టముగాని సాహిత్యసృష్టితో నంత గొప్పవిగావు. ఈ నడుమ వాని నాడుట కూడలేదు. కాని, చారిత్రకముగ వానికి గల ప్రాధాన్యమును మాత్రము ద్రోసివేయుటకు వీలులేదు.

'కొట్టయ త్తంబురాన్' ఆటకథా సాహిత్యమునకు సాహితీగౌరవమును గలిగించినవాడు. ఆతడు—కవితాహృదయ మున్న యొక వ్యక్తియున్నడు. కిర్మీరవధలో నాతని కథావతరణ మిట్టున్నది?

"మార్గే తత్ర వఖంపచోష్మల రజః
పుంజే లలాటంతప
గ్రీష్మర్త్వగ్యుతి తామ్యదాననసరో
జాతం విలోక్యాదరాత్,
వాతోద్ధూలిత ధూళిజాల మసృణ
చ్ఛాయాం సధర్మాత్మజో
మధ్యాహ్నే పరిదూయమానహృదయాం
తా.మబ్రవీ ద్ద్రౌపదీం."

దీనికి ద్రౌపది యిచ్చిన ప్రత్యుత్తరమునకు గథావతరణ మీ క్రిందిశ్లోకము.

"దీనదైన్య దమనం దయితా సా
శృణ్వతీ సుమధురం ప్రతివాక్యం,
భారతీ మితి నరేంద్ర ముదారాం
అబ్రవీ ద్ద్రుపదరాజతనూజా."

పై రచన సంస్కృత కవులకంటె నెందులోను దీసిపోలేదు. కాని, యిది ప్రవాహమైన యాలంకారిక పద్ధతిలో వచ్చిన రచన. అగాధమైన మనుష్యస్వభావమును వివేచించుటయందును, జీవిత నిరూపణమునం

# కథకళీ సాహిత్యము

గాను, పాత్రసృష్టిలోని చాతుర్యమందును ఆ కవికి గొప్పస్థానములేదు. సహృదయుడైన యొకానొక పండితుని ప్రతిభావిలాసము మాత్రమా రచనలలో పుంజుకొని యుండును. శబ్దార్థాలంకారములను సమానమైన యధికారముతో నతడు వాడుకొనెను. చక్కని వ్యుత్పన్నుడాతడు. ముఖ్యముగ వాచ్యకవి. శబ్దమాధుర్యము, గొంత భావగాంభీర్యమును మాత్రమే దృష్టిలో నుంచికొని నడచినాడు. 'నివాతకవచ—కాలకేయ వధ' యాతని మరియొక యాట్టకథ. తపోనిష్ఠుడైన యర్జునుని కడకువచ్చుచున్న యూర్వశి నాతడు వర్ణించినాడు. అది యాతడు తానై చేసికొన్న స్వకవితా వ్యాఖ్యానము. ఆ శ్లోక మిది:

సులలిత పదవిన్యాసా
లలితాలంకార శాలినీ మధురా,
మృదులాఽపి గహనభావా
మూర్తిరివార్వశీ విజయం"

ఈ లక్షణములు సర్వత్ర యాతని రచనలో మనము చూడవచ్చును. సంస్కృతమేమి, మలయాళమేమి, రెంటిపై నాతని కధికారమే యున్నది. పాటలు లలితమైన మలయాళములో నుండును. శ్లోకములు ప్రౌఢసంస్కృతము. రెంటిలోను శబ్దానుగతమైన యొక సంగీతము నాతడు పోషించును.

"కాలే కదాచిదహ కామినదానుకూలే
మాలేయ మారుత విలోలితమాలతీకే"

అను శ్లోకమును చదువునప్పుడు సంగీతము రానివారు కూడ రాగాలాపమునకు దొరకొందురనుటలో నాశ్చర్యములేదు. ఆతని పాటలు మధురమైనవంటివి. ఆ మలయాళము మణిప్రవాళశైలివలెనే నడచును. కిమ్మీర రచనలో ధర్మరాజు ద్రౌపదితో నిట్లన్నాడు.

పాట—"బాలే! కేళ్ నీ మామకవాణీ
కల్యే కల్యాణీ!
పాలోలుం[1] మొజి మార్కులతిలకే
పాంచాలాధిప సుకృత విపాకే ||బాలే||
కాలాంబుదరుచి తేడుం[2] విపినే
కామిని వన్నతి[3] నాలతిగహనే
దోలాయిత మిహ మామకహృదయం
లోకోత్తరుణశాలిని! సదయం! ||బాలే||
తళిగున్న[4] గృహచంక్రమణేన
తళి[5]రొడిడయుం తవపదయుగళం ||బాలే||
కళమొజి[6] మానినియుం ముడిమాలే
కథమిహ సహతే కానన చరణం ||బాలే||
వికసతి దినకర కిరణైరధికం
[7]వికసోడితర సరోరుహనివహం |
శుకభాషిణి! బత! తవముఖ సుమం
సుందరి! వాడి[8] త్తున్నతి వేలం
మణిమయసదనే మోహనశయనే
మణిమియ[9] లున్నవ కుసుమాస్తరణే
మదనరసేన రమిచ్చి[10]రున్న
[11]మను మొజి! నాజుల[12] నెంగినె విపినే ||బాలే||

పై పాట జనపదంపాలో నెక్కుడు ప్రచారములో నున్నది. ఈ రచనలో పది పదముల కర్థము తెలిసినచో దక్కిన దంతయు సంస్కృతమే. శృంగారమున్నచో నౌచిత్యమును బక్కకు నెట్టి యొకవలుమారము సంస్కృతకవుల దురభ్యాసము గూడ "మదనరసేన రమిచ్చీడుం నీ" యను పాటయందు నుండనే యున్నది. కాని రామనాట్ట కృష్ణనాట్టములనుండి యాట్టకథా సాహిత్యమును కవితామార్గమునకు దిద్దినకీర్తి యాతనిదే. ఇతని రచనలలో 'బకవధము,' 'కిమ్మీరవధము', 'నివాతకవచ కాలకేయవధము' 'కల్యాణ సౌగంధికము' మొదలైనవి విపులప్రచారములో నున్నవి.

[సశేషము]

---

1. పాలవంటి మాటలుగలవారు. 2. తిరుగునట్టి 3. వచ్చుచున్నది. 4. వాడిపోవు. 5. చిగురుటాకును బోలు 6. మధురభాషణములుగల స్త్రీలతలపై మాల్యము వంటిదానా! 7. అంగముగా. 8. వాడిపోవును, 9. మెత్తనివంటి చిత్రములైన పూలపాన్పుపై. 10. రమించి వేయు 11. తేనె వంటి మాటలుగలదానా! 12. అడవిలో నెట్లు తిరిగెదవు?

# సాహితీ సుగతుని స్వగతం

పఠాన్యం లేనిక ప్రమాదాలు మహాకావ్యాలలో సయితం పాఠాంతరాలు కల్పిస్తూ, అపార్థాలకు అవకాశమిస్తూ, పాఠకులను భ్రాంతిపారావారంలో పడదోసేవి. నేను ఆ విధిని ముద్రణదోషాలు తు. చ. తప్పకుండా నిర్వర్తిస్తున్నాయి. ఈ ముద్రణ దోషాలలో అక్షరానికి మరొక వింతరూపం పడటం అలా ఉంచగా, ఒకప్పుడు పంక్తి మధ్యన కొన్ని అక్షరాలు లోపించి శూన్యం కనిపించడంవల్ల చదువుతున్నవారు అకస్మాత్తుగా 'మాన్‌హోల్'లో పడి మరుగైపోయినట్లు, అన్నం తింటున్నవారు హఠాత్తుగా 'కటక్' మని రాయి కొరికి దిగ్భ్రమచెందిపోయినట్లు, నవ్వుతూ నవ్వుతూ చతికిలపడి గతుక్కుమనటం, కొంతసేపటికి తెప్పరిల్లుకోవటం పాఠకులకు తెలిసినవిషయమే. అయినా ఈ అక్షర దోషాలు రాక్షసాలై మన బుద్ధిని పట్టుకుని వేలాడేసినప్పుడు మాత్రం వెర్రెత్తిపోతుంది. లోకసభకు తొలి కథ అని పడితే ఎలా ఉంటుంది?

భారతంలో అరణ్యపర్వంలో ద్రౌపది యుధిష్ఠిరునికి నీతిబోధ చేసే ఘట్టం. "కర్మఫలంబులు దైవమానుష సిద్ధంబులయినను బుద్ధిపూర్వోత్సాహ సముపార్జితంబులయిన నవి సుస్థిరంబులయి సురక్షితంబులయి వర్ధిల్లు. నిరీహమానుండయి దైవపరుండయినవాడు నీటిలోని యానపాత్రంబునుంబోలె నవసన్నుండగు గావున కర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుడవయి నీ యనుజుల పరాక్రమంబునం బరుల జయించి మనకుందలి యర్థకృశత్వం బపనయింపుము "(అరణ్య-ప్రథమ-236) అని యాజ్ఞసేని హితవాక్యం.

"అనీహమానుండయి దైవపరుండయిన వాడు నీటిలోని యానపాత్రము బోలె" ఎందుకు అవసన్నుడవుతాడు.? యాన పాత్రమంటే ఓడ. నీటిలోని ప్రతి ఓడ పగిలి మునిగిపోతే సముద్రయానం ఎప్పుడో ఆగిపోయేది. కనుక 'యానపాత్ర'మున్న చోట ముద్రారాక్షసమేమో తెలుసుకోవడానికి మూల సంస్కృత భారతం చూడవలసివస్తుంది.

'యోహి దిష్ట ముపాసీనో నిర్విచేష్టః సుఖం శయేత్,
అవసీదేత్స దుర్బుద్ధిః ఆమో ఘట ఇవోదకే.'
(వన-అధ్యా 32-శ్లో 14)

దైవాన్ని నమ్మి అకర్మణ్యుడై సుఖంగా నిద్రపోయే దుర్బుద్ధి ఆమఘటంవలె—పచ్చికుండవలె—ద్రవిస్సిపోతాడని వ్యాసులన్నారు. నన్నయగారు "ఆమపాత్రంబునుంబోలె అవసన్నుండగు" అని మూలానుయాయిగా అనువదించారు. కాని, మన ముద్రారాక్షస మంత్రి నీటిలోని యాను పాత్ర యేమిటని ఆలోచించి 'ఆమ'ను కేసులో వేసి 'యాన'ను బిగించాడు చెప్పలో. దీనితో అర్థం పాడయిందని గ్రహించలేదు.

శృంగార నైషధంలోని భోజన వర్ణన:
"ఆకుపచ్చల్లి చవిమాచి రాదిరమున
పొగలు నెగయుగ నాసికాపుటము లెందు
ఎర్రవనమున..............."

ఇక్కడ ఎర్రవనం అన్నప్పుడు దకు మారు వ పడ్డది. ఎర్రదనమంటే తీవ్రత, కారం. ఆ అర్థాన్ని ఎవరు వేయాలా?

ముద్రాపకులు స్వతంత్రించి ఉత్తమపాఠాలు అధస్సూచికలోను, చెత్తపాఠాలు పైనను ఇవ్వటం వల్ల కూడా యథాశక్తి అపార్థాలు పుట్టించి పుణ్యం కట్టుకుంటున్నారు.

భారతంలో అరణ్యపర్వంలో భీముడు ధర్మరాజుకు హితం చెప్పే ఘట్టం: "శూద్రాన్నంబునందలి దుగ్ధంబునుంబోలె సుయోధనురాజ్యంబు దూష్యంబు బలుమ పౌరజానపదబ్రాహ్మణాదులు నీకనురక్తులయి భవద్రాజ్యంబ వలచియుండుదురు." (అరణ్య-ప్రథమ-252) 'శూద్రాన్నంబునందలి' అనే చోట 'శ్వదృతి యందలి' అనే పాఠం అధస్సూచికలో ఇచ్చారు. పైవాక్యాలలోని 'శూద్రాన్నంబునందలి దుగ్ధంబునం బోలె' అనేది తిక్కననాటితో ఏమైనా అన్వయిస్తున్నదా? పదాలలో తప్పేమీ లేదు. పండితార్థం సంతృప్తికరంగా లేదు. సంస్కృతమూలం సందర్శించనిదే పసిపట్టేట్టు లేదు అర్థం!

"పౌరజానపదా స్సర్వే ప్రాయశః కురునందన,
సవృద్ధబాలసహితా శ్శంసంతి త్వాం యుధిష్ఠిర.
శ్వదృతౌ క్షీరమసక్తం బ్రహ్మ వా వృషలే యథా"
సత్యం స్తేనే బలం నార్యాం రాజ్యం దుర్యోధనే తథా.
(వన-అధ్యా - 33, శ్లో-80, 81.)

మూలంలో దుర్యోధనుని రాజ్యానికి ఎన్ని ఉపమానాలున్నాయో చూడండి శ్వదృతిలోని క్షీరం, వృషలుని బ్రహ్మ, దొంగసత్యం, ఆడదానిబలం. 'శ్వదృతౌ సారమేయ చర్మకోశే. బ్రహ్మవేదః' అని నీలకంఠాచార్యుని వ్యాఖ్య. దుర్యోధనునిరాజ్యం కుక్కతోలు సంచిలో నింపిన పాలలాగ దూషితమన్నమాట. ఇంత చక్కని పాఠం ఎలా కిందికి పోయిందో!

ఈ ముద్రారాక్షసులు నిఘంటువులలోను తల దూరుస్తున్నారు. మనం వీరిని ఎంత త్వరలో అంతంచేస్తే అంత శ్రేయస్సు.

—రామచంద్ర.

# దమయంతి వాక్చాతుర్యం

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

ఆంధ్ర ప్రబంధాలలో శ్రీనాథుని శృంగార నైషధానికి ఒక విశిష్టస్థానం ఉన్నది. ఇది శ్రీహర్షుని సంస్కృత నైషధీయ చరితానికి అనువాదమే అయినా శ్రీనాథ మహాకవిచేతిలో ఒక అనర్ఘభూషణంగా తీర్చబడినది. అనేక ఘట్టాలలో ఔచిత్యాన్ని పాటించి శ్రీనాథుడు ఆంధ్ర నైషధానికి ఎన్నో మెఱుగులు తెచ్చినాడు. దీని తరువాత వెలువడిన సుమారు ప్రౌఢాంధ్రప్రబంధాలకు ఇది గురుస్థానమూ — మార్గదర్శకమూ కూడా అయి ప్రకాశించినది. పెద్దనాగారు శ్రీనాథుని అడుగుజాడలలో నడవబట్టే వారి కావ్యాలు మహనీయమై సహృదయుల ఆదరానికి పాత్రములైనవి. శ్రీనాథుడు కవిత్రయం వారి కావ్య మార్గాలను అనుసరించి — ఆ ముగ్గురిలోని కవితా గుణాలను చేకూర్చుకొని ఒక విశిష్టమైన ఆంధ్రప్రబంధ మార్గాన్ని నెలయించిన మహాశిల్పి కనుకనే ఈతని శృంగార నైషధం ఒక రసభావౌచిత్య నిధి అయినది. అందులో కూడా చతుర్థాశ్వాసానికి ఒక ప్రత్యేకత వున్నది. అభిజ్ఞానశాకుంతలములో నాలుగో అంకానికిచ్చిన గౌరవం నైషధంలో నాలుగో ఆశ్వాసానికీయవచ్చు. ఇందులో నలదూత్యం ప్రధాన కథాఘట్టం. నైషధానికి నాయికానాయకులైన నలదమయంతులిరువురూ, ఇక్కడ పరస్పరం సంభాషిస్తారు. అయినా దమయంతికి మాత్రం ఎదురుగా నలుడని తెలియదు. తెలియకపోవడంవల్లనే ఆమె సంభాషణ మిక్కిలి విచిత్రంగానూ — ప్రతిభావంతంగానూ — ప్రౌఢంగానూ సాగుతుంది. ఇందులో నలదూత్యం ప్రధానమయి ఆతని సంభాషణకే ప్రాధాన్యం వున్నా, దమయంతి వాక్చాతుర్యం కూడా మిన్నుముట్టినదనే చెప్పవలె. అందుకే ఆమెను "నానావిధ చిత్రవాక్యరచనాచణ" అని కవి ముందుగానే సూచించినాడు.

దమయంతి ఇదివరకు నలమహారాజును ప్రత్యక్షంగా చూడలేదు. హంస చేసిన వర్ణనను బట్టీ, వ్రాసి చూపిన చిత్తరువును బట్టీ ఆమెకు నలుని రూపురేకలు కొద్దిగా తెలుసు. ఆమె నిరంతర ధ్యానం చేత నలుణ్ణి మిథ్యావలోకనం చేస్తూనే వున్నది. దేవత లిచ్చిన శాంబరితో నలుడు అంతఃపురప్రవేశం చేసి శాంబరిని పరిత్యజించి దమయంతికి దర్శన మిచ్చినాడు. చూచీ చూడడంతోనే కంతుడో — జయంతుడో అనుకొన్నది. ఇంకా పరికించి చూచి హంస చూపిన చిత్రంతో రూపం సంవదించడంవల్ల నిషధరాజేమో అని కూడా అనుమానించింది. అయితే, అతను ఈ శుద్ధాంతంలోకి ఎలా రాగలుగుతాడు? అని సాద్భుతంగానూ, సకౌతుకంగానూ, సానురాగంగాను చూస్తూ ధీరోదాత్తతనే ప్రకటించినది. చెలికత్తెలు పరపురుష సన్నిధితో ఊరకున్నారు. "నానావిధ చిత్రవాక్యరచనాచణ" అయిన ఆమె మాత్రం ముఖపద్మం కొద్దిగా వంచుకొని అతిథి సంభావనావిధానాన్ని పరిగ్రహించి, ఇలా అన్నది:

"అనఘ! యిదె హేమరత్నసింహాసనంబు
ఇచ్చ గలదేని కూర్చుండు మిందు వచ్చి
కాక కార్యాంతరాసక్తి కారణముగ
వెడలఁదలఁచినవాఁడవో యేటికైన."

తానా, అంతఃపురాంగన. అందులోనూ కన్య. వచ్చినవానికి అతిథిసపర్యలు చేసి గౌరవించాలి. అందుకే సంబుద్ధిగాను చమత్కారంగాను "మీ రెక్కడికన్నా పోవలసివున్నదేమో నాకు తెలియదు. కూర్చోదలచుకొంటే ఆ హేమరత్న సింహాసనం మీద కూర్చోవచ్చు." అన్నది. ఇలా అన్నందువల్ల మర్యాదకూ భంగం కలుగదు. కూర్చోమని తాను అర్థించినట్లూ కాదు. ఇష్టంవుంటే కూర్చోవచ్చు. లేకపోతే దయచేయనూ వచ్చు అన్నమాట. అంతఃపురంలో వున్న కన్య సఖీసముకంలో ఇంతకంటే ఎక్కువగా అతిథిని ఎలా గౌరవిస్తుంది? ఈ దమయంతీవాక్కు ఔచిత్యానికి జీవగఱ్ఱ. ఇందులో 'అనఘ' అన్న సంబోధన ఎంతో సార్థకం. ఆయన అనఘుడయి ఎటువంటి పాపచింతనలను హృదయంలో తావీయకుండ ఇక్కడ మెలగవలె. లేకపోతే ప్రమాద మన్నమాట.

తరువాత "నీ వెక్కడనుండి ఎక్కడికి పోతున్నావు? పేరేమి? ఈ శుద్ధాంతంలోకి ప్రవేశించే అవకాశం ఎలా చిక్కింది? ఇంత సాహసం చేయడానికి మమ్ము ధన్యులను చేయడమే ఫలమా? (ఇంకేమన్నా వున్నదా?) ద్వారపాలకుల కన్నుగప్పి, అంతిపురిలోకి వచ్చే శక్తి

ఎలా చేకూరింది? నీవు నలకూబరుడవా, మన్మథుడవా, జయంతుడవా, చంద్రుడవా? ఇన్ని మాట లెందుకు? 'నిజము దప్పక చెప్పుము నిశాపతివో?' నీ పుట్టుకకు కారణమై యే వంశము చందమామను గన్న పాలసముద్రంతో ప్రతిఘటించిందో చెప్పు. నీవు ఎవరికి అతిథివైతావో వారు ధన్యులు కదా? చందమామలోని సౌకుమార్యం, సముద్రంలోని గాంభీర్యం, మేరు పర్వతంలోని స్థైర్యం, మన్మథుణ్ని జయించే నిర్వికారమైన ఆకారం నీకు తప్ప ఎవ్వరికైనా వున్నదా? మేము కృతార్థుల మైనాము. మా జన్మలు సఫలమైనవి. మా కన్నులకి భాగ్యం చేసుకొన్నవి. చెవులు మీ వృత్తాంతం విన్నానని కుతూహలపడుతున్నవి. వాటి కింత వాగమృతం ప్రసాదించుము." అంటూ ఒక తియ్యని వుపన్యాసం చేసింది. ఈ వుపన్యాసంలోని ప్రతి అక్షరమూ దమయంతివాక్యరచనా నైపుణ్యానికి నిదర్శనమే. ఎంతో అర్థగాంభీర్యాన్ని యీ మాటలలో కవి వుపనిబంధించినాడు.

ఈ దమయంతీవాక్యాలు నలునికి చెవులలో అలంకరించుకునే కమ్మతావులపూలై మన్మథుని బాణాలు లాగ మనస్సులో నాటుకొన్నవి. తరువాత సింహాసనం మీద కూర్చుని, "నేను దిక్పాలురవద్దనుండి దూతగా నీకు అతిథినై వచ్చాను. నా పని నెరవేర్చితే అదే నాకు అతిథిసత్కారం.

"ఉల్ల మిప్డు డెక్కెమై యున్నయదియేమి?
ఉచితం బౌనె సేవరహస్యమునకు?
వింతవారలు లేరుగా యింతినంతి?
ఉనికి మనవారలే కదా యున్నవారు?"

అన్నాడు నలుడు. ఇలా అతడు దమయంతిని మంచి మంచి మాటలతో అభిముఖురాలిని చేసుకోవడానికి ప్రయత్నించినాడు. ఇక్కడ వింతవారలు లేరుగా అనీ, ఉన్నా రంతా మనవారలే కదా అనీ, ఆమెను తన ఆప్తకోటిలోకి చేర్చుకొన్నాడు. దీన్నిబట్టి ఆ వ్యక్తి ఇదంతా తన మేలుకోసమే చేస్తున్నాడని దమయంతి అనుకోవాలి. అందుకే "మనవారలే కదా" అని కలుపుగోలుతనం చూపినాడు.

తరువాత ఇంద్రయమవరుణాగ్నులు నలుగురూ ఆమెను పెండ్లాడ గోరుతున్నారని చెప్పి, వరుసగా ఒక్కొక్కరి విరహావస్థను సవిస్తరంగా వర్ణించినాడు. నలుని వాక్చాతుర్యం వివరించడం వ్యాసోద్దేశ్యం కాదు గనుక ఆ విస్తరం ఇక్కడ ప్రస్తావించను. నలుడు దిక్పాలక చతుష్టయంయొక్క విరాళిని వర్ణించి, చివరకు నలుగురిలో ఎవరినో ఒకరిని వరించమని దమయంతిని కోరినాడు. ఆమెకీ అనావశ్యకోపన్యాసం విసుగు పుట్టించింది. అక్షిభ్రూ విక్షేపంతోనే అనాదర భావం సూచించి, ఆ దిక్పాలక సందేశాన్ని అలక్ష్యంగా ఆకర్ణించి అన్నది:

"ప్రశ్నమొక్కటి యొక్కటి ప్రతివచనము
యుక్తి యనుకూలమైయుండ దుభయమునకు
నేను నీవంశనామంబు లెవ్వి యనిన
ఎవ్వరినో ప్రస్తుతించితి వింతతడవు.
"అధికతరులైనగాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీ వంశకథలయందు,
చిప్పిగొన్న కేదారికా నప్పి దీఱ
సలిలపూరంబు హితవో? రాజ్యంబు హితవో!

"ఏను జేసిన ప్రశ్నంబునకు నుత్తరంబు నీ మీద నప్పయియున్నది. ఇప్పుడైన నా ఋణంబు తీర్చుకొనుము భవాదృశంబైన నాయకరత్నంబు నే వంశంబు భరించె? ఏ వర్ణంబులు నీ పుణ్యనామంబునకుం బ్రకాశకంబు లైనవి?" ఈమాటలు పరిమితాలు — సాలంకారాలు — సహేతుకాలున్నూ. నీ వంశకథలమీద కౌతుకము అనే మాటలో అంతరాంతరాలలో దమయంతికి నలునిమీద ఉన్న అనురాగం వ్యక్తమవుతున్నది. నెయ్యి పలుకల వస్తువైనా, నీరం కావలసినవారికి అది ఎలా పనికి వస్తుంది — అని దేవతల గొప్పదనానికి ఆమె అంజలి పట్టింది. నలుడన్నాడు "చెలువా, నా వంశ వృత్తాంతం అలావుంచు. ఎందుకంటే, నా వంశం గొప్పది అయినట్లయితే, నేను నికృష్టమయిన దూతకార్యం నెరపడానికి వచ్చినాను గనుక అది చెప్పకోవడం హీనం. నిజంగా హీనమే అయితే చెప్పకోవటం ఏమంత గౌరవం? అయినప్పటికీ నీవు రాజపుత్రివి, మాననీయురాలవు కనుక మైత్రికి అడ్డుసేయకుండా ఈ మాత్రం చెబుతున్నా గ్రహించు. నేను మనుజవిభుడనే. ఎవరున్నా తమ పేరు తాము చెప్పుకోవటం ఆచార విరుద్ధమూ దోషమూను. కాబట్టి పేరడిగే ప్రయత్నం మాత్రం చేయకు. అదిగాక మనం ఇప్పుడు ఎదుటబడి మాట్లాడుకొంటున్నాము. ఈ సమక్షవ్యవహారానికి యుష్మదస్మత్ (నీ-నా) పదములే చాలుగదా!" అన్నాడు.

ఈమాటలు దమయంతికి కష్టం కలిగించేవే. అయినా సమయోచితంగాను, సారస్యంగాను ఆమె అన్నది: "కులం పేరుచెప్పి, నీపేరు చెప్పకపోవడం మర్యాదరించినట్లా యేమి? నీవు మమ్ము వంచించాలనుకొంటే, మేము నిన్ను వంచించలేమా? పేరు

## దమయంతి వాక్చాతుర్యం

చెప్పటమే నీ కనాచారమయితే, నీతో మాటలాడడం కూడ న్యాయమా యేమిటి?

"అన్యపురుషులతోడ నెయ్యంపుగోష్ఠి
యధిప! మముబోటి రాజకన్యకల కగునె?
అది కులాబలాచార సహోపవాస
హోతి సాహస కౌతూహలావసథము."

"తగవే కులకన్యలకును
మగవారలతోడ రూప మహనీయులతో
మిగులంగ దడవు లోపలి
నగవులలో మాటలాడ నయతత్త్వనిధీ!"

నలుడు పేరు చెప్పడం శాస్త్రాచార విరుద్ధమన్నాడు. దానికి ప్రతిగా దమయంతి రాజకన్యలు అన్యపురుషులతో గోష్ఠిచేయుట — అది నెయ్యపుగోష్ఠియే అనుకోండి, కులస్త్రీల ఆచారానికి విరుద్ధమన్నది. కులకన్యలు మగవాళ్లతో మాటలాడడం తప్పు. అందులోనూ వాళ్లు రూపమహనీయులయితే మరీ తప్పు. ఒకవేళ అనివార్యంగా మాటలాడవలసివచ్చినా ఎక్కువసేపు మాటలాడడం ఇంకా పెద్ద తప్పు. లోపలినగవులలో మాటలాడుట అసలు క్షమించరాని తప్పు. ఈ విధంగా కులకన్యకలకు - మగవారలతో - రూపమహనీయులతో - మిగులంగతడవు- లోపలినగవులు- అనేపదాలు ఒకదానికంటే ఒకటి బలవత్తరాలై ఆ సంభాషణయొక్క అనౌచిత్యాన్ని అధికాధికంగా నిరూపిస్తున్నవి. వీటన్నింటికీ జీవంగా వున్నది 'నయతత్త్వనిధీ' అనే సంబోధన. నీవు నీతి నెరింగినవాడవు కనుక దీనికి వ్యాఖ్యానం అవసరం లేదయ్యా! అని కూడ సారాంశం. మిగులంగ తడవు మాటాడరాదు. కాబట్టి ఏదో ఇంతవరకూ మాట్లాడినాను; చెప్పినవి విన్నాను. ఇక నీవు సెలవు పుచ్చుకో మహానుభావా - అని కూడ ధ్వని.

దమయంతి ఇలా అనేటప్పటికి నలుడు విస్తుపోయినాడు. ఇంతవరకు ఆమె "త్రిజగన్మోహన మహాపద్మ తిలక" అని మాత్రమే అతనికి తెలుసు. ఇప్పుడు లోకోత్తరమయిన వాక్చాతుర్యం, ప్రతిభా, తార్కికశక్తి, వాకట్టుకట్టే నేర్పు కలదని అర్థమయింది. కనుకనే ఆమె "ప్రతిబంధిరచనాచాతుర్యాన్ని" మనస్సులో మెచ్చుకొన్నాడు. ప్రత్యుత్తరం చెప్పాలని తపుకొన్నాడు. మనస్సు కేమీ పాలుపోలా. ఆలోచన తట్టనేలేదు. ఇక వోడిపోయినా నను కొన్నాడు కాబోలు పాపం, కన్నులతో చిన్నగా నవ్వి మళ్ళీ పూర్వం చేసిన వుపన్యాసానికే వుపక్రమించినాడు. కొంత చెప్పి చివరికి

"బాలిక! నామీద గడు గృపావిలసనంబు
నాటి చూచిన చూపు మన్ననయె చాలు
నాకుగా నాదరింపుము నాకవిభుల
హస్తములు మోడ్చి వేడెద నాదరమున."

సకారణంగా వాదించలేనపుడు - నచ్చచెప్పలేక పోయినపుడు మానవుడు "ఏదో ఎలాగో అలా ఈ పని కాస్త సాగించుమా; నీకు దణ్ణం పెడతాను. నన్ను గూర్చి అయినా ఇది నెరవేర్చుమా" అనడం సహజం. ఈ నలుని ప్రార్థన ఆ రీతిగానే వున్నది. దమయంతి మాటలకు సమాధానం చెప్పలేక వోడిపోయినాడనేది స్పష్టం. ఇంతగా లోబడి వేడుకుంటే, మరి దమయంతి ఎలా తిరస్కరిస్తుంది? అందుకనే.

"అలంతినవ్వు ప్రగల్భతాహంకరణము
కొదుకొనకుంట వాచావిగర్హణంబు
పలుకకుంట తిరస్కారకలనముద్ర
గాన ప్రత్యుత్తరం బిచ్చుదాన నీకు"

అని నవ్వు ముచ్చటగా మూడుకోణాలు చూపి ప్రత్యుత్తరం చెప్పినది. దేవతలను వరించనే వరించనన్నది. నేను నలపతివ్రతనన్నది. చిట్టచివరకు తన ప్రతిజ్ఞను ఇలా వినిపించినది.

"వినుమిదె నాదు ప్రతిజ్ఞతెఱంగు, ను
ర్వీనాథ యే నైషధే
ంద్రు నవశ్యంబు వరింతు, నాతడె నా
థుం డాత్మకు నొల్లడే
ననుమానింపక యిత్తు నవ్విభునకుం
ప్రాణంబు సద్భక్తిమై
ననలోద్బంధన వారి శస్త్ర విషా
వ్యాపార పారీణతన్."

దమయంతి ఇలా తన నిశ్చయాన్ని ప్రతిజ్ఞాపూర్వకంగా వెల్లడించినా, నలుడు ఊరుకుండలేదు. ఇంకా ప్రయత్నించే చూస్తున్నాడు. న్యాయంగా ఇంకొకరైనట్లయితే దమయంతి ప్రతిజ్ఞావాక్యం విన్న తరువాత ఆ ప్రశంస ఎత్తరు. ఎత్తకూడదు. నలుడు తానుకూడ దమయంతిని వలచినవాడు కాబట్టి తన్ను క్రుద్ధదేవతలు శిక్షిస్తారో అని గట్టి ప్రయత్నం చేసి మరీ చూస్తున్నాడు.

"ఇలు పేదయింటి కేటికి
వెలుతెంచు నిధాన? మట్లు వెలుతెంచినయే
నిలుపేద యభాగ్యత దలు
పిలిపోగనిడుగాక చొరగనిచ్చునె దానిన్."

అనీ, ఇంకా ఎన్నో విధాలుగా చెప్పి చూచినాడు. దమయంతి నలుడు తన్ను పెండ్లాడక పోయినట్లయితే, ఏరీతిచేనైనా సరే మరణిస్తానన్నది. దానికి నలుని సమాధాన మిది—"నీవు ఉరిపెట్టుకొని చచ్చితే అంతరిక్షమే లేదా ఇంద్రునికి దక్కుతావు. అగ్నికాహుతి అయినచో వానికొక్కడై చేతిలో పడుతుంది. నీటబడి మరణించినట్లయితే వరుణునికి చిక్కగలవు. ఎలా ప్రాణాలు విడిచినా యమదర్శనం తప్పదు. కావున, వాని అదృష్టం ఫలిస్తుంది. కనుక ఎవరినో ఒకరిని వరించి నామాట దక్కించు, దివ్యభోగాలు పొందు."

ఈమాటలు వినీవినకుండా దమయంతి సవిషాదంగా అన్నది.

"నీ చరితంబు చూడ నతి
విస్మయ మయ్యెడు; లోకపాలురు
ర్వాచికమాచికొంకక ప
రంపర దూర్చెద వటి మాటికి
న్నా చెవులందు; నీకు దగు
నా యిటు సేయఁగ? దప్పనంటి, బా
ధాచరణంబునై జనక
దా! తలపోయ కృతాంతదూతికిన్."

నలుడు యమునికూడ దూతగా వచ్చినాడు కనుక, యమదూతవలెనే బాధిస్తున్నాడట. ఎంత సందర్భోచితమైన తిట్టు. తిట్టు అనడానికిన్నీ వీలుగాని నిజమైనతిట్టు. ఇంకా ఇలా అన్నది:

"ఇది యొల్లి కల్యాణ మేతెంచుచున్నది
ఈ యవాచిక వార్తలిపుడు మాను,
వర్ణింపు నిషధభూవరుని నోపుదువేని
నీ దోష మఖిలంబు నీడలు గాన,
ముందు నీ విచ్చోట నూఱట నేడెల్లి
సురల కిడ్డేమి వేగరము వచ్చె,
నలునిరూపచ్ఛాయ దిలకించె నీయందు
హంసచూపిన చిత్రమాత్మదం ప
హస్తములు మోడ్చి వేడెద ననఘ నిన్ను
మాను మిటఁబట్టి యే నీకు మాన్య నేని
పాకశాసన ముఖ్య దిక్పాలవర్య
పాణిపీడన కార్యసంప్రార్థనంబు."

"అవాచికవార్తలు — మాను" అన్నపదం అవాచ్యప్రసంగాలు మానుమన్నట్లున్నది. నైషధునివర్ణింపుమన్నందున ఆమె నలవర్ణన కుతూహలం వ్యక్తమవుతున్నది. హస్తములు మోడ్చి వేడడం స్వయంగా నలుడు నేర్పినదే. అతడు స్వకార్యసిద్ధికి నమస్కారం ప్రయోగించినాడు. తానున్నూ అంతు కాపని చేయవద్దా మరి?

అయినా నలుడు వదలిపెట్టలేదు. "ఇంద్రునికి కల్పవృక్షం వున్నది. దాన్ని యాచించి అతడు నిన్ను పొందగలడు. అగ్ని యజ్ఞంచేసి దానికి ఫలంగా నిన్ను పొందవచ్చు. యముడు తనవద్దవున్న అగస్త్యుని ద్వారా వశముగా నిన్ను సంపాదించుకోవచ్చు. వరుణుడు కామధేనువుద్వారా నిన్ను రప్పించుకోవచ్చు. కనుక ఎవరినో ఒకరిని వరించు. అలా కాక దేవతలకు కోపంతెప్పిస్తే కార్యాలకు విఘ్నాలుకూడ వాటిల్లును సుమా!" అన్నాడు. చివరిమాటతో రేపు జరుగబోయే స్వయంవరంగూడ విఘ్నం కావచ్చుననీ, నలవరణం విఘ్నం కావచ్చుననీ కూడ భయపెట్టినాడు. ఈ నలదూత్యఘట్టంలో నలుడుకూడ వాక్చాతుర్యంలో ఏమీ తీసిపోలేదు. అయినా అతడు ప్రౌఢుడూ, పురుషుడూ కాబట్టి విశేషంలేదు. దమయంతి వాగ్వైచిత్రియే యిచ్చట ప్రశంసార్హం.

దేవతలు "తాను చచ్చినా బ్రతికినా వదలిపెట్టర"ని నలుడు చెబుతున్నాడు. దమయంతికి ఇక గత్యంతరం లేకపోయింది. అటువంటిస్థితిలో స్త్రీలకు ఏడుపు దక్క శరణ్యంలేదు. ఏడిస్తేగాని వారి హృదయవేదన తీఱదు. కనుక ఆమె —

"వేదయ్యప్రసలు నిగుడంగ వెక్కివెక్కి
యేడ్వదొడఁగె లతాంగి పృథ్వీశు ప్రేమ
మృదుల పరిదేవనాతురోన్నిద్రమధుర
కంఠకాకలికార కోకిలి యనఁగ"

ఏడ్చినది. ఈ పరిదేవనం నలుని తలక్రిందులుచేసినది. అతడు తన్ను దివిజులనూ, దేవకార్యాన్నీ మరచిపోయి ఇట్లన్నాడు:

"ఏమిటికేడ్చెద వానన
తామరసం బెత్తి చూడు తరుణీ నన్నున్
కోమలకటాక్షవీక్షా
దామకమున వీరసేను తనయుని నలునిన్."

ఇందాకటినుండి దాచిదాచి యుంచిన గుట్టు బట్టబయలయినది. అది అల్లగుటకు నలుడు కారణముకాదు. దానినే అతడిట్లు సమర్థించుకొన్నాడు.

"వగవ నేటికి, నేమనవచ్చు నిపుడు?
చేతనాహాని గార్యంబు చిన్నవోయె
జేతనాహాని దైవంబుచేత వచ్చె
దైవగతి దాఁటగవచ్చునే దేవతలకు?"

# దమయంతి వాక్చాతుర్యం

ఇంతవఱకు స్పష్టాస్పష్టంగా వున్న విషయం తేట తెల్లమయినది. తాను కామించిననలుడే తనయెదుట నిలబడి ఇంతసేపూ మాటలాడినాడు. ఇంతకన్న ఆమె కేమికావలెను? ఇక ఆమె సింహాసనం దిగి తెరచాటుకు పోయినది. ఇందాకటివలె ఎదురుగావుండి మాటాడడం భావ్యంకాదు. ఆమెను సిగ్గు పైకొన్నది. చెలికత్తె చేత ఇలా అనిపించింది. తన చిత్రవాక్యరచనాచణత్వం తేటపడేటట్లు

“అర్థిసాధారణమునకు నభయ మిత్తు
వజ్రపాతంబు ఘోరమై వచ్చినపుడు,
అతను పూర్ణదూపులకు భయంబందియున్న
నాకు నభయంబు సేయసేయ నీకు బరువె?”

ఈవిధంగా ముగ్ధ అయిన దమయంతి వయసులో ముగ్ధత్వాన్ని, వాక్కులలో ప్రౌఢత్వాన్నీ ప్రకటించి ఒక అసాధారణ కావ్యనాయికగా పేరు గాంచినది. కవి నలదూత్యకథాదిలో బీజప్రాయంగా సూచించిన దమయంతియొక్క “నానావిధ చిత్రవాక్య రచనాచణత్వ”న్ని నలదూత్యం అంతమయేవఱకు సముచితంగా పోషించి ఫలింపజేసినాడు. శాకుంతలంలో చతుర్థాంకం చదివేటప్పుడు పొందే దివ్యానుభూతినే, నైషధంలో చతుర్థాశ్వాసంలోని ఈనలదూత్యం చదివేటప్పుడున్నూ పాఠకుడు పొందుతాడు. హంసదూత్యంలో కూడ దమయంతి వాక్చాతుర్యం కనబడుతున్నప్పటికీ, అది ఇంతగా పరాకాష్ఠను పొందదు. పొందే అవకాశమున్నూ దానికి లేదు. ఇక్కడ నలునికీ—ఈమెకూ వాగ్వాదం జరుగుతుంది కనుక ఈ దమయంతీ భాషణంలో ప్రత్యేకతవున్నది. మొత్తం మీద అక్కడా ఇక్కడా కూడ దమయంతియొక్క అగాధనలానురాగం, ఆత్మ నిశ్చయం, ప్రతిజ్ఞా తత్పరత్వం సువ్యక్తములవుతూనే వున్నవి. ఇక్కడే దమయంతి రాజకన్యగా ఎంతగానో రాణించింది. ఆత్మగౌరవాన్ని కాపాడుకొన్నది. అంతఃపురంలో పరపురుషుణ్ని అతిథిగా సత్కరించి, ఎలా భాషించి గౌరవార్హురాలు కావాలో అలా అయినది. దమయంతియే కాక నలుడుకూడ లోకోత్తరమయిన మనశ్శుద్ధి కలవాడని నిరూపించుకొన్నాడు. దమయంతి ఏడ్చేవరకు గూడ ఆమెకు ఒత్తి ఒత్తి దిక్పాలసందేశాన్ని వినిపిస్తూనే వున్నాడంటే అతని నిస్స్వార్థ కార్యదీక్ష ఎలాంటిదనవచ్చు! అందుకే నలదూత్యాంతంలో వారికి సంధాత అయిన దివ్యహంసం వచ్చి ఇద్దరినీ ఓదార్చి, నలుణ్ని ప్రశంసించింది కూడాను.

“అమ్మ! దమయంతి! యువతిరంగమ్ములోన
గాను పందియు వీతంబు మగను నీవు,
నాడె దా నానతిచ్చినవాడు బ్రహ్మ
తద్వచనమున కన్యథాత్వంబు గలదె!”

నలుని గూర్చి—

“నీయంతఃకరణంబు నిర్మలము, వ
ర్ణింపంగ శక్యంబె నీ
ధీయుక్తత్వంబు? జగత్ప్రసిద్ధములు నీ
పుణ్య ప్రభావంబు, లే
లా యీలాగున చింత నొందెదవు? కా
ర్యావాప్తియౌ గాదటే!
యా యింద్రాదులు నీ నిజం బెఱుగరే
యజ్ఞారితంశాగ్రణీ!”

రాజహంసం ఇలా ఇద్దరినీ ఓదార్చిపోయిన పిమ్మటనే వారు తేరుకొన్నారు. చివరకు దమయంతి తిరస్కరిణీ తిరోహితయైయుండి నలునితో స్వయంగా ఇలా అన్నది కూడా—

“ఒరజనీకరాన్వయ ప
యోధినిశాకర! యే బలిద్విషన్,
గూరిమి మీఱ నొక్కరుని
గోరి వరింపక, నున్నవారి కె
వ్వారికి నెగ్గుగా దలప
వచ్చునె? నిన్ను వరింతునెల్లి బృం
దారకులు న్కృపాలుగను
దక్కినవారును జూచుచుండగన్.

“ఎల్ల లోకధర్మంబుల నెఱిగియుండి
యేలసేయుదు రమరేంద్రు లీరసంబు?
నాది వారికి వందనం బాచరించి
తదనుమతి నిన్ను వరియింతు దథ్య మిదియ.”

దమయంతి చెలికత్తెతో చెప్పిపంపిన “అర్థిసాధారణమునకు నభయమిత్తు......” అన్నమాట చాతుర్యముతోను, అలంకారముతోను గూడుకొన్నది. ఈ తుదిమాటలు నిరలంకారంగా హృదయగతసత్యాన్ని సముఖంలో స్వయంగా ఆవిష్కరిస్తూ పలికినట్టివి. “ఒకవేళ దేవతలకు నీవు భయపడుతున్నావేమో! అలాంటిదేమీ వద్దు. ఇది నా ఆత్మనిశ్చయం. దేవతలుగూడ ఏమి చేయడానికీ వీలులేదు వారు ఎల్ల లోకధర్మములూ ఎరిగినవారు. లోకధర్మజ్ఞు లయినవారు దేవమానవలోక బాంధవ్యాన్ని ఎలా హర్షిస్తారు? అదీ కాక, నాకు ఇష్టంలేనపుడు వారు నన్ను బలాత్కరించి నా అభిప్రాయానికి వ్యతిరేకం చేస్తారా? అలా చేసినట్లయితే వారు లోకధర్మజ్ఞులవుతారా?” అని కూడ దమయంతి వ్యంగ్యంగాను, గంభీరంగాను తన అభిప్రాయాన్ని సూచించింది.

ఈ ఘట్టంలో శ్రీనాథకవిసార్వభౌముని “పదప్రసిద్ధధారాశుద్ధి” మొదలైన కవితాగుణాలు గూడ ప్రకృతకథా పరిపోషకాలైనవి.

# చల్లగా చేతులు చాపుతున్న చైనా

రాజకీయ విద్యార్థి




“విషయానంతరో రాజా
శత్రుః మిత్ర మతఃపరం,
ఉదాసీనః పరతరః......
...............”

పొరుగురాజు మనకు శత్రువు, వాని పక్కవాడు మిత్రుడు, అతని పక్కవాడు ఉదాసీనుడు — తటస్థుడు - అన్నది ప్రాచీన రాజనీతి. ఈ నీతిని అనుసరించే కాబోలు ఉన్నట్లుండి చైనా మాకు మిత్రరాజ్యాలతో వివాదానికి దిగినట్లు తోస్తున్నది! ఇటీవల జరుగుతున్న కొన్ని ఘటనలను పరిశీలించగా, చైనా తన ప్రాణమిత్రమైన భారతదేశం సరిహద్దులను అతిక్రమించి భారతప్రాంతాలపై దురాక్రమణ జరిపి, చరిత్రనే కాదంటున్నది. చారిత్రకంగా, భౌగోళికంగా, నైతికంగా, చైనాతో చేసుకొన్న ఒడంబడికల ప్రకారంకూడా బ్రిటిషువారు వదలివెళ్లిన భూభాగం ముమ్మాటికీ మనదే అయినా, సరిహద్దులోని 32 వేల చదరపు మైళ్ళ మన ప్రాంతం తనదేనని చైనా నేడు వాదిస్తున్నది.

చైనా భారత ప్రాంతాన్ని కబళించ యత్నిస్తున్నట్టు వార్తలు పొక్కిన మరుక్షణంలోనే అటు పాకిస్తాన్ కూడా తన గగనక్షితిని చైనా జెట్ విమానాలు అతిక్రమించినట్లు ఆరోపించింది.

ఇండియాగా పాకిస్తాన్‌తోపాటు అరబ్ రిపబ్లిక్ పైనా చైనా కత్తి కట్టినట్లు కనిపిస్తున్నది. సిరియాలో నిషేధింపబడిన కమ్యూనిస్టుపార్టీ నాయకుడు బాగ్దాష్ స్వదేశం నుంచి పారిపోయి కొంతకాలం తూర్పు యూరోపులో గడిపి, గడచిన నెల 28వ తేదీన చైనా రిపబ్లిక్ వార్షికోత్సవాలనుంచు పెకింగులో మహోత్సాహంగా ప్రత్యక్షమయ్యారు. చైనా ప్రధాని చౌఎన్‌లై ఆయనను సభవారికి సినిమా హీరోగా పరిచయం చేయడం, ఆయన సిరియా దేశం అమెరికన్ తొత్తుల ఆధిపత్యంలో ఉన్నదని ప్రసంగించడం, దానికి నిరసనగా అరబ్ రిపబ్లిక్ ప్రతినిధి సభనుంచి నిష్క్రమించడం, పెకింగు దర్బారు అరబ్ రిపబ్లిక్ ఆక్షేపణ తెలుపడం ప్రపంచానికి తెలిసిన విషయాలే.

మాకు మిత్రరాజ్యాలతో పెకింగు ఒక్కుమ్మడిగా దురుసుగా ప్రవర్తిస్తున్నందుకు కారణం ప్రధాని నెహ్రూ అన్నట్టు బలదర్పమే అయి ఉండాలి. “మన దేశమూ క్రమంగా శక్తిమంతమౌతున్నది. మనశక్తి పెరుగుతున్న కొద్దీ వినమ్రతకూడా వృద్ధిపొందుతుందని ఆశిస్తున్నాను” అన్నారు నెహ్రూ. ఈ భావానికి అనుగుణంగానే చైనా రిపబ్లిక్ వార్షికోత్సవాలకు ఆయన పంపిన సందేశంలో “చైనా అభ్యున్నతిని నేనూ, నా ప్రజలూ హృదయపూర్వకంగా కోరుకొంటున్నాము. ఇకముందుకూడ మనమైత్రి కొనసాగగలదని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను” అని అన్నారు.

భారతదేశం ఇంతగా సౌహార్దం చూపుతుండగా చైనాయే కాదు భారత కమ్యూనిస్ట్‌పార్టీ అయినా

ప్రతిపాదర్థం మాపడం లేదు. ఇండియా చైనాలకు సరిహద్దుగా ఉన్న మెక్ మాహన్ రేఖవిషయమై పట్టుబట్టవద్దని మన నెత్తురే ఒంటపాగుతున్న భారతకమ్యూనిస్టులు భారతప్రభుత్వానికి హితవు చెబుతూ ఈనుగ్యనే తీర్మానం చేశారు. చైనా ప్రధాని చౌఎన్లై 1956 లో మన దేశానికి వచ్చినప్పుడు మన ప్రధానితో జరిపిన ముఖాముఖి చర్చలలో మెక్ మాహన్ రేఖను ఇండియా చైనాల సరిహద్దుగా అంగీకరించాడు; తదనంతరం స్వదేశానికి తిరిగివెళ్ళినతర్వాత మాట తప్పాడు. మెక్ మాహన్ రేఖ ఈనాటిది కాదు. నాలుగు దశాబ్దాలుగా అమలులో ఉండి చరిత్రకెక్కినట్టిది; ఇది చైనా బ్రిటిష్ ప్రభుత్వాలకు జరిగినట్టి ఒప్పందం.

1913-14 లో సిమ్లాలో జరిగిన చైనా టిబెట్ బ్రిటిష్ ప్రభుత్వాల ప్రతినిధుల సమావేశంలో ఈ రేఖ నిర్ణయించబడింది. బ్రిటిష్ ప్రభుత్వంపక్షాన అప్పటి భారతవిదేశాంగ రాజకీయ వ్యవహారశాఖ కార్యదర్శి సర్ ఆర్థర్ హెన్రీ మెక్ మాహన్, చైనా ప్రతినిధిగా ఇవాన్ చెన్, టిబెట్ తరఫున దలైలామా ప్రధానమంత్రి ఆ సమావేశంలో పాల్గొన్నారు. టిబెట్ ప్రతిపత్తికి సంబంధించి పడిపోయిన అధికారాల వంటబట్టి కుదుర్చుకున్నారు. తొమ్మిదవ అధికరణంలో ఈ సరిహద్దు రేఖ ప్రస్తావం ఉంది. భూటాన్ ఈశాన్యాగ్రం నుంచి ఎగువ బర్మాదాకా 850 మైళ్ళ పొడవున వ్యాపించిన ఈ ఎల్లను 'మెక్ మాహన్ రేఖ' అన్న పేరుతో దేశపటంమీద గీశారు. కాని, ఈ రేఖ వ్యాపించిన ప్రాంతం దుర్గమమైనది గనుక, భారతదేశప్రాంతాలకు 100 మైళ్లు అవతలగా ఈ సరిహద్దు ఉంటుందని నిర్ణయించుకొన్నారే గాని, సీమాచిహ్నాలేమీ పెట్టుకో లేదు. ఆ ప్రాంతాన్ని పరిశీలించిన సర్ చార్లెస్ బెల్ దేశపటంమీద ఎర్రసిరాతో బండగా ఒక గీత గీచి "ఇది సరిహద్దు" అని నిర్ధరించాడు కాని, కచ్చితమైన సీమాచిహ్నాలేమీ లేవని ఇదివరకే తెలుసుకున్నాము. దీనిని టిబెట్ ప్రధాని స్వల్పమైన మార్పులతో అంగీకరించాడు. చైనా ప్రతినిధి ఒప్పందం ముసాయిదాపై సంతకం చేశాడు.

మరికొంత ఎగువకు వెళ్ళితే కాశ్మీర్ - టిబెట్ ఎల్లలలోని కాశ్మీర్ప్రాంతంపైకూడా చైనా కన్ను వేసినట్టు స్పష్టమౌతున్నది. కాశ్మీర్ టిబెట్ సరిహద్దు పదకొండు వందల మైళ్ళ పొడవు. అక్కడి కొండవాగులనుబట్టి ఈ ఎల్లలు నిర్ణయించబడ్డాయి. ఈ ఎల్లలలను దేశదేశాలవారు మూడు శతాబ్దాలకు పైగా ఆమోదించారు. లడఖ్ కు, టిబెట్ కు 1684 లోను, 1842 లోను జరిగిన ఒడంబడికలు కూడా ఈ ఎల్లలను ధ్రువపరిచాయి.

చైనా బర్మాతో 1956 లో సంధి చేసుకున్నప్పుడు మెక్ మాహన్ రేఖను చైనాప్రధాని ఒప్పుకున్నాడని బర్మాప్రధాని థాకిన్ నూ తెలిపాడు.

సర్ చార్లెస్ బెల్ అనే రాజనీతిజ్ఞుడు టిబెట్ ను గురించి 1924 లో వ్రాసిన గ్రంథంలో మెక్ మాహన్ రేఖను చైనా అంగీకరించిందని, సిమ్లా సమావేశంలో టిబెట్ లోని భాగాలనుగురించి తగాదా వచ్చిందే కాని ఈ రేఖపైన లేదని వ్రాశాడు.

1947 నుంచి 50 దాకా లాసాలో మన ప్రతినిధిగా ఉన్న హ్యూ రిచర్డ్ సన్ ఇటీవల 'లండన్ టైమ్స్'లో ఒక లేఖ వ్రాశాడు. దానిలో (1) సిమ్లా సమావేశం వివరాలు నేను ప్రకటిస్తే సరిపోతుందని, (2) సర్ చార్లెస్ బెల్ తన రెండు పుస్తకాల్లోను మెక్ మాహన్ రేఖ అంగీకృతమైనట్టు వ్రాశాడని, (3) ఈ బెల్ సిమ్లా సమావేశానికి ముందే లాసాకు వెళ్ళి మెక్ మాహన్ రేఖ విషయమై చర్చించాడని, అప్పటి నుంచే అది న్యాయశాస్త్రరీత్యా సరిహద్దుగా పరిగణించబడిందని, సిమ్లా ఒడంబడికపై చైనాతర్వాత సంతకం చేయకపోవడానికి కారణం టిబెట్ ప్రాంతంపై అభిప్రాయభేదంతో నేకాని, ఇండియా సరిహద్దు విషయమై కాదని రిచర్డ్ సన్ తెలిపాడు.

1919 లోను చైనా టిబెట్ ల వివాదం జరిగినప్పుడు ఇండియా సరిహద్దుపై వివాద ప్రసక్తే లేదు. లోటిబెట్, వెలి టిబెట్ సరిహద్దులను గురించి అప్పుడు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో చైనాప్రభుత్వం మెక్ మాహన్ రేఖను తాను గుర్తిస్తున్నట్లే వ్యవహరించింది.

1954 లో టిబెట్ పై ఇండియా చైనాలకు ఒడంబడిక జరిగినప్పుడూ చైనా ఈ మెక్ మాహన్ రేఖకు గాని, కాశ్మీర ఎల్లల ఒప్పందానికి గాని ఎలాటి అభ్యంతరమూ చెప్పలేదు. దీనినిబట్టికూడా మెక్ మాహన్ రేఖను చైనా గుర్తించినట్టు మరొకసారి ధ్రువపడింది.

సరిహద్దుచరిత్ర సాక్ష్యం ఇంత స్పష్టంగా మనకు అనుకూలంగా ఉన్నా, చైనా వేటినీ సరకుచేయక మన ప్రాంతాలపై దురాక్రమణకు పూనుకుంది. ఈ దురాక్రమణ ఉభయదేశాల శాంతియుతసహజీవనానికి పంచశీల ప్రవచింపబడిన కొన్ని నెలలకే తొలిసారిగా ప్రారంభం కావడం ఆశ్చర్యకరం. 1954 లో నే ఈ

# చల్లగా చేతులు చాపుతున్న చైనా

రాజకీయ విద్యార్థి




"విజిగీషోరనంతరో రాజా
శత్రుః మిత్ర మతః పరం,
ఉదాసీనః పరతరః.......
..............."

ఏ పొరుగురాజు మనకు శత్రువు, వాని పక్కవాడు మిత్రుడు, అతని పక్కవాడు ఉదాసీనుడు —తటస్థుడు - అన్నది ప్రాచీన రాజనీతి. ఈ నీతిని అనుసరించే కాబోలు ఉన్నట్టుండి చైనా మూడు మిత్రరాజ్యాలతో వివాదానికి దిగినట్టు తోస్తున్నది! ఇటీవల జరుగుతున్న కొన్ని ఘటనలను పరిశీలించగా, చైనా తన ప్రాణమిత్రమైన భారతదేశం సరిహద్దులను అతిక్రమించి భారతప్రాంతాలపై దురాక్రమణ జరిపి, చరిత్రనే కాదంటున్నది. చారిత్రికంగా, భౌగోళికంగా నైతికంగా. చైనాతో చేసుకొన్న ఒడంబడికల ప్రకారంకూడా బ్రిటిషువారు వదలివెళ్ళిన భూభాగమంతా ముమ్మాటికీ మనదే అయినా, సరిహద్దులోని 32 వేల చదరపు మైళ్ళ మన ప్రాంతం తనదేనని చైనా నేడు వాదిస్తున్నది.

చైనా భారత ప్రాంతాన్ని కబళించ యత్నిస్తున్నట్టు వార్తలు పొక్కిన మరుక్షణంలోనే అటు పాకిస్తాన్ కూడా తన గగనవీథిని చైనా జెట్ విమానాలు అతిక్రమించినట్లు ఆరోపించింది.

ఇండియా పాకిస్తాన్‌లతోపాటు అరబ్ రిపబ్లిక్ పైనా చైనా కన్ను కట్టినట్లు కనిపిస్తున్నది. సిరియాలో నిషేధించబడిన కమ్యూనిస్టుపార్టీ నాయకుడు బాగ్ దాష్ స్వదేశం నుంచి పారిపోయి కొంతకాలం తూర్పు యూరోపులో గడిపి, గడచిన నెల 28వ తేదీన చైనా రిపబ్లిక్ వార్షికోత్సవాల సందర్భంగా పెకింగులో హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. చైనా ప్రధాని చౌ-ఎన్-లై ఆయనను సభవారికి సిరియా నాయకుడుగా పరిచయం చేయడం, ఆయన సిరియా నేడు అమెరికన్ తొత్తుల ఆధిపత్యంలో ఉన్నదని ప్రసంగించడం, దానికి నిరసనగా అరబ్ రిపబ్లిక్ ప్రతినిధి అభినందన సభనుంచి నిష్క్రమించడం, పెకింగు దర్బారుకు అరబ్ రిపబ్లిక్ ఆక్షేపణ తెలుపడం ప్రపంచానికి తెలిసిన విషయాలే.

మూడు మిత్రరాజ్యాలతో పెకింగు ఒక్కుమ్మడిగా దురుసుగా ప్రవర్తిస్తున్నందుకు కారణం ప్రధాని నెహ్రూ అన్నట్టు బలదర్పమే అయి ఉండాలి. "మన దేశమూ క్రమంగా శక్తిమంత మవుతున్నది. మనశక్తి పెరుగుతున్న కొద్దీ వినమ్రతకూడా వృద్ధిపొందుతుందని ఆశిస్తున్నాను" అన్నారు నెహ్రూ. ఈ భావానికి అనుగుణంగానే చైనా రిపబ్లిక్ వార్షికోత్సవాలకు ఆయన పంపిన సందేశంలో "చైనా అభ్యున్నతిని నేనూ, నా ప్రజలూ హృదయపూర్వకంగా కోరుకొంటున్నాము. ఇకముందుకూడా మనమైత్రి కొనసాగగలదని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను" అనీ అన్నారు.

భారతదేశం ఇంతగా సౌహార్దం చూపుతుండగా చైనాయే కాదు భారత కమ్యూనిస్టుపార్టీ అయినా

ప్రతిసౌహార్దం చూపడం లేదు. ఇండియా చైనాలకు సరిహద్దుగా ఉన్న మెక్ మహాన్ రేఖవిషయమై పట్టుబట్టవద్దని మన నెత్తురే ఒంటపాగుతున్న భారతకమ్యూనిస్టులు భారతప్రభుత్వానికి హితవు చెబుతూ ఈమధ్యనే తీర్మానం చేశారు. చైనా ప్రధాని చౌఎన్‌లై 1956 లో మన దేశానికి వచ్చినప్పుడు మన ప్రధానితో జరిపిన ముఖాముఖి చర్చలలో మెక్‌మహాన్ రేఖను ఇండియా చైనాల సరిహద్దుగా అంగీకరించాడు; తదనంతరం స్వదేశానికి తిరిగివెళ్ళినతర్వాత మాట తప్పాడు. మెక్ మహాన్ రేఖ ఈనాటిది కాదు. నాలుగు దశాబ్దాలుగా అమలులో ఉండి చరిత్రకెక్కినట్టిది; ఇది చైనా బ్రిటిష్ ప్రభుత్వాలకు జరిగినట్టి ఒప్పందం.

1913-14 లో సిమ్లాలో జరిగిన చైనా టిబెట్ బ్రిటిష్ప్రభుత్వాల ప్రతినిధుల సమావేశంలో ఈ రేఖ నిర్ణయించబడింది. బ్రిటిష్ ప్రభుత్వంపక్షాన అప్పటి భారతవిదేశాంగ రాజకీయ వ్యవహారాల కార్యదర్శి సర్ ఆర్థర్ హెన్రీ మెక్‌మహాన్, చైనా ప్రతినిధిగా ఇవాన్ చెన్, టిబెట్ తరఫున దలైలామా ప్రధానమంత్రి ఆ సమావేశంలో పాల్గొన్నారు. టిబెట్ ప్రతిపత్తికి సంబంధించి పదకొండు అధికరణాల ఒడంబడిక కుదుర్చుకున్నారు. తొమ్మిదవ అధికరణంలో ఈ సరిహద్దు రేఖప్రస్తావన ఉంది. భూటాన్ ఈశాన్యాగ్రంనుంచి ఎగువ బర్మాదాకా 850 మైళ్ళ పొడవున వ్యాపించిన ఈ ఎల్లను 'మెక్ మహాన్ రేఖ' అన్న పేరుతో దేశపటంమీద గీశారు. కాని, ఈ రేఖ వ్యాపించిన ప్రాంతం దుర్గమమైనది గనుక, భారతదేశప్రాంతాలకు 100 మైళ్లు ఆవలగా ఈ సరిహద్దు ఉంటుందని నిర్ణయించుకొన్నారే గాని, సీమాచిహ్నాలేవీ పెట్టలేదు. ఆ ప్రాంతాన్ని పరిశీలించిన సర్ చార్లెస్ బెల్ దేశపటంమీద ఎర్రసిరాతో బండగా ఒక గీత గీచి "ఇది సరిహద్దు" అని నిర్ధరించాడు కాని, కచ్చితమైన సీమాచిహ్నాలేమీ లేవని ఇదివరకే తెలుసుకున్నాము. దీనిని టిబెట్ ప్రధాని స్వల్పమైన మార్పులతో అంగీకరించాడు. చైనా ప్రతినిధి ఒప్పందం ముసాయిదాపై సంతకం చేశాడు.

మరికొంత ఎగువకు వెళ్ళితే కాశ్మీర్ - టిబెట్ ఎల్లలలోని కాశ్మీర్ప్రాంతంపైకూడా చైనా కన్ను వేసినట్టు స్పష్టమౌతున్నది. కాశ్మీర్ టిబెట్ సరిహద్దు పదకొండు వందల మైళ్ళ పొడవు. అక్కడి కొండ వాగులనుబట్టి ఈ ఎల్లలు నిర్ణయించబడ్డాయి. ఈ ఎల్లలను దేశదేశాలవారు మూడు శతాబ్దాలకు పైగా ఆమోదించారు. లడఖ్‌కు, టిబెట్‌కు 1684 లోను, 1842 లోను జరిగిన ఒడంబడికలు కూడా ఈ ఎల్లలను ధ్రువపరిచాయి.

చైనా బర్మాతో 1956 లో సంధి చేసుకున్నప్పుడు మెక్ మహాన్ రేఖను చైనాప్రధాని ఒప్పుకున్నాడని బర్మాప్రధాని థాకిన్‌నూ తెలిపాడు.

సర్ చార్లెస్ బెల్ అనే రాజనీతిజ్ఞుడు టిబెట్‌ను గురించి 1924 లో వ్రాసిన గ్రంథంలో మెక్‌మహాన్ రేఖను చైనా అంగీకరించిందని, సిమ్లా సమావేశంలో టిబెట్‌లోని భాగాలనుగురించి తగాదా వచ్చింది కాని ఈ రేఖపై రాలేదని వ్రాశాడు.

1947 నుంచి 50 దాకా లాసాలో మన ప్రతినిధిగా ఉన్న హ్యూ రిచర్డ్‌సన్ ఇటీవల 'లండన్ టైమ్స్'లో ఒక లేఖ వ్రాశాడు. దానిలో (1) సిమ్లా సమావేశం వివరాలు నేను ప్రకటిస్తే బయటపడుతుందని, (2) సర్ చార్లెస్ బెల్ తన రెండు పుస్తకాల్లోను మెక్ మహాన్ రేఖ అంగీకృతమైనట్లు వ్రాశాడని. (3) ఈ బెల్ సిమ్లా సమావేశానికి ముందే లాసాకు వెళ్ళి మెక్ మహాన్ రేఖ విషయమై నచ్చించాడని, అప్పటినుంచే అది న్యాయశాస్త్రరీత్యా సరిహద్దుగా పరిగణించబడిందని, సిమ్లా ఒడంబడికపై చైనాతరఫున సంతకం చేయకపోవడానికి కారణం టిబెట్ ప్రాంతంపై అభిప్రాయభేదంతోనే కాని, ఇండియా సరిహద్దు విషయమై కాదని రిచర్డ్‌సన్ తెలిపాడు.

1919 లోను చైనా టిబెట్‌ల వివాదం జరిగినప్పుడు ఇండియా సరిహద్దుపై వివాదప్రసక్తే లేదు. లోటిబెట్, వెలి టిబెట్ సరిహద్దులనుగురించి అప్పుడు జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలలో చైనాప్రభుత్వం మెక్ మహాన్‌రేఖను తాను గుర్తిస్తున్నట్లే వ్యవహరించింది.

1954 లో టిబెట్‌పై ఇండియా చైనాలకు ఒడంబడిక జరిగినప్పుడూ చైనా ఈ మెక్‌మహాన్ రేఖకు గాని, కాశ్మీర్ ఎల్లల ఒప్పందానికి గాని ఎలాంటి అభ్యంతరమూ చెప్పలేదు. దీనినిబట్టికూడా మెక్ మహాన్ రేఖను చైనా గుర్తించినట్లు మరొకసారి ధ్రువపడింది.

సరిహద్దుచరిత్ర సాక్ష్యం ఇంత స్పష్టంగా మనకు అనుకూలంగా ఉన్నా, చైనా వీటినీ సరకుచేయక మన ప్రాంతాలపై దురాక్రమణకు పూనుకుంది. ఈ దురాక్రమణ ఉభయదేశాల శాంతియుతసహజీవనానికి పంచశీల ప్రవచించబడిన కొన్ని నెలలకే తొలిసారిగా ప్రారంభం కావడం ఆశ్చర్యకరం. 1954 లోనే ఈ

ఎల్లలకే హాని రానుంది. 1957 నుంచే మన సరిహద్దులను చైనా అతిక్రమించింది. నిరుడు అతిక్రమణలు అధికమయ్యాయి. ఈ సంవత్సరం అప్పుడే నాలుగు సార్లు అతిక్రమణలు జరిగాయి; మన ప్రభుత్వం అధిక్షేపించింది.

ఈ వివాదం విషయమై చైనా భారత ప్రభుత్వాలకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల వివరాలపై భారత ప్రభుత్వం సెప్టెంబర్ 7 వ తేదీన అధికార పత్రాన్ని (వైట్ పేపరును) ప్రకటించింది. దీనిపై చర్చలలో మన పార్లమెంటు కూడా చైనా వైఖరిని విమర్శించింది. టిబెట్ సరిహద్దులోని సిక్కిం భూటాన్‌లపై చైనా చేయి చేసుకుంటే పోరు భగ్గుమంటుందని, వాటి ప్రాదేశికాధికారాల రక్షణబాధ్యత తనదేనని నెహ్రూ స్పష్టపరచారు. దీనికి సిక్కిం, భూటాన్ పరిపాలకులూ హర్షం ప్రకటించారు. యావత్ప్రపంచమే భారత ప్రభుత్వ వాదాన్ని బలపరుస్తున్నది. భారత కమ్యూనిస్టులు చైనాను వెనుక వేసుకు వచ్చారు గాని, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'ప్రావ్దా' కూడా ఇండియా చైనాలు సరిహద్దు వివాదాన్ని శాంతియుతంగా ముఖాముఖి చర్చలతో పరిష్కరించుకోవాలని సోవియట్ పెద్దలు అభిప్రాయపడుతున్నట్లు ప్రకటించింది. చైనా మాత్రం వివాదపరిష్కారం శాంతియుతంగా కావాలని ఒకవైపు ఉద్ఘోషిస్తూనే, మరొకవైపు మనమే దురాక్రమణపరులమని ప్రత్యారోపణలు చేస్తున్నది. ఆక్రమించుకొన్న స్థావరాలనుంచి వెనక్కు మరలకపోగా, మన సైనికదళాలనే వెనక్కు వెళ్ళమంటున్నది. మెక్‌మాహన్ రేఖ బ్రిటిషు సామ్రాజ్యవాదులు టిబెట్‌పై పెత్తనంకోసం కుట్రచేసి గీచిందని, దానిని పూర్తిగా మరచిపోయి, చరిత్ర తిరగ వ్రాయాలని వాదిస్తున్నది. అంతటితో ఆగక ఉత్తర ప్రదేశ్ ఎల్లలలో తన సైన్యాన్ని సమీకరిస్తున్నది; కొత్త విమానాశ్రయాలు నిర్మిస్తున్నది; దుష్ప్రచారం చేస్తున్నది.

విభిన్న సాంఘిక వ్యవస్థలుగల రాజ్యాలు స్నేహ సద్భావాలతో మనగలవని యావత్ప్రపంచానికి చైనా భారతాల మైత్రి ద్వారా చాటదలచి ఆశాభంగం పొందినందుకు, చైనా భారతాలు పరస్పర శత్రుత్వ దృష్టితో చూసుకొంటున్న దుస్థితి ఏర్పడినందుకు నవీన్ నగర కాంగ్రెస్ మహాసభలో నెహ్రూ కంటతడి పెట్టగా, అఖిలభారత కాంగ్రెస్ సంఘం కొద్దిపాటి మార్పులతో సరిహద్దు వివాదం పరిష్కరించుకోవాలని తీర్మానించగా, ఐక్యరాజ్యసమితిలో చైనా సభ్యత్వానికి మనం నేటికీ ప్రయత్నిస్తుండగా, చైనా ప్రవర్తించవలసింది ఇలాగేనా?

చైనా దురాక్రమణకు కారణం ఏమిటని వాల్టర్ లిప్‌మన్ తర్కించి ఇలా అంటున్నారు: "చైనా విప్లవం అగ్నిపర్వతం వంటిది. ఒకప్పుడది ప్రశాంతంగా ఉంటుంది. ఒకప్పుడది పొగలు సెగలు భుగభుగమంటూ పగిలి లావాతో పరిసరాలను నింపివేస్తుంది. ఇండియా ఎల్లల అతిక్రమణ బహుశా టిబెట్ ఆక్రమణోద్వేగంతో జరిగినదే కావచ్చు."

"చైనా ప్రభుత్వం ప్రారంభించిన అభివృద్ధి కార్యక్రమాలు సవ్యంగా కొనసాగుతున్నట్లు లేదు. చైనా ప్రధాని చౌ-ఎన్-లై తన ప్రణాళికలు ఎలా దెబ్బతిన్నాయో ఇటీవలనే వివరించారు. ప్రజల మనస్సులో ఈ విషయమై నిస్పృహ కలుగకుండా సరిహద్దులలో వివాదాలు చెలరేగేటు చేసి, వారిలో "దేశభక్తి", ఉద్రిక్తత ప్రకోపింపజేయాలనే సంకల్పంతో చైనా ఈ దురాక్రమణలకు దిగింది". అని మరికొందరు రాజనీతిజ్ఞుల అభిప్రాయం.

"సోవియట్ ప్రధాని కృశ్చేవ్ ఉభయ దేశాల మైత్రిని కోరేవాడే. ఐసెన్‌హోవర్ అంతటి వానిని అగ్రనాయక సమావేశానికి ఒప్పించారు. మాస్కోకు మనుమలతో సహా అతనిని రమ్మని పిలుస్తున్నాడు. అలాంటివారు దూరం ఆలోచించి చైనా శ్రేయస్సును కోరి తన పలుకుబడితో యుద్ధాన్ని నివారించగలడా?" అని మరికొందరు వెర్రిగా ఊహిస్తున్నారు

మన ప్రాదేశికాధికారాల రక్షణకు మనం ఇతరులపై ఆధారపడటం వెర్రి కాక మరేమి? బలం లేని నీతి ప్రవచనాలు బలాదూర్! కనుక మనం తృతీయ ప్రణాళికలో చైనా సరిహద్దుల రక్షణకు, సైన్యం పెంపొందించే పథకాలకు ప్రాధాన్యం ఇవ్వాలి. "కర్ర గలవానిదే బర్రె" అనే సామెత కింకా బలం తగ్గలేదు.

"పరుల మేరల కొఱకు కాసపడను నేను
సూదిమోపినయంత నాచోటు విడువ
పోరుకోరను, కదిసిన నూరకుండ
నేది యెటులున్న ధర్మమే నాదు దీక్ష."

# కలగూరగంప

## పల్లవుల శిల్పశైలి

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిగారు భారతి ఆగస్టు సంచికలో పల్లవుల శిల్పశైలినిగురించి నేను వ్రాసిన దానికి సమాధానము వ్రాస్తూ, జటామకుటధారి పట్టుకున్నది గుడ్డకాదు. పాత్రమే అని, అంటే నేను జవాబు చెప్పడం అనవసరం. కాని కొమ్ములాంటి పాత్రకు నేలవైపు ముఖం ఉంటుంది. నీళ్లు పట్టేవారు ముఖాన్ని క్రిందుగా పట్టుకోవడం అసాధ్యం. అది పాత్రే గనుక అయితే పల్లవశిల్పంలో, ఆ ముని పాత్రను తల్లక్రిందుగా పెట్టి నీళ్ళు పట్టుకుంటున్నాడు. నాకది సమంజసంగా తోచలేదు పూర్వం కొంతమంది విమర్శకారు లన్నట్లు, అది గుడ్డ సూచించినట్లే నాకనిపించింది.

నిజంగా శిల్పములను మనము చూచునప్పుడు ఒకవిషయం గమనించాలి. "Art suggests but not represents or defines." అంటే కళ సూచిస్తుంది. అంతేకాని, నిర్ణయించదు. ఆ పయిని శిల్పం చేసిన పదార్థమునుసయితం గమనించాలి. పల్లవశిల్పములన్నీ గట్టిరాతివి. చిత్రలేఖనంలాగా, లేక కంచు ఇత్తడి మొదలయిన కొన్ని లోహశిల్పాలలాగా, రూపమును గట్టిరాతిలో అనేరీతిన భావిస్తూ, అనుభావితి మొనర్చడం దుర్లభం. గుడ్డ గుడ్డలాగ రాతిశిల్పంలో కష్టం. ఆ పయిన రేకులు రేకులలాగకూడా రాతిశిల్పంలో కష్టం. అవి రేకులను సూచించలేవు. మధ్యనున్న రాయిని చెక్కివేస్తే ఆ రేకులు నిలవవు. అందుచేత మధ్యనున్న రాతిని ఉంచవలసిన అవసరం ఏర్పడుతుంది. ఒక్కొక్కప్పుడు ఫోటోగ్రాఫులలోనూ, కాక దూరంనుంచి చూచినప్పుడు సయితం పార్శ్వంలో రేకులుగా ఉద్దేశించిన ఆ రూపాలు కొమ్ములలాగానూ, మరోరకంగా కూడా కన్పడవచ్చు. ఆ రేకులు అలా అనుకోవచ్చు కూడా. కాని శిల్పం రాతిశిల్పాల రూపం ఎరిగిన వారు అట్లు భ్రమపడే అవకాశం లేదు.

అయినా రాతిని మరిపించి, గొలుసులు, మొదలయినవి అద్భుతంగా శిల్పమయిన రాతిశిల్పాలు లేవా అని సందేహం కలుగవచ్చు. రాతిని మరిపించి రాతిలో చెక్కిన శిల్పాలు ఉత్తమమయినవి కావని అనేక విమర్శకారుల అభిప్రాయం. ఎందుకంటే, శిల్పి అప్పుడు తాను పూనుకున్న సృష్టికన్న, తన హస్తనైపుణ్యమునకే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాడు. ఆ శిల్పంవల్ల శిల్పి తెలివి మనకు తెలిసి, మనం అచ్చెరువు గందవచ్చు. కాని శిల్పం రసవంతం కానేరదు. పల్లవశిల్పాలు ఉత్తమ రచనలు.

అమంచర్ల గోపాలరావు.

## వాల్మీకి దేవాలయం

ఆదికవి అయిన వాల్మీకి మహర్షిని పూజించడం మనదేశంలోనే కాదు, విదేశాలలోను శతాబ్దాలనుంచే ఉంది. 7వ శతాబ్దంలో ఇండోచైనాలో వాల్మీకి మందిరం నెలకొల్పబడింది. ఇది ఇండోచైనాను 658-678లో పాలించిన ప్రకాశధర్ముని కాలంలో నిర్మితమైంది. దీనిలో వాల్మీకి విగ్రహం ప్రక్కన ఒకశాసనం కూడా చెక్కబడివుంది. ఆశాసనంలో వాల్మీకిని ప్రథమ ఛందః కారుని గాను. మహావిష్ణువు అవతారంగాను వర్ణించే శ్లోకం కూడా వుంది.

"యస్యశోకాత్సముత్పన్నం
శ్లోకం బ్రహ్మాభి పూజ(త),
విష్ణోః పునః పురాణస్య
మానుష స్యాత్మ రూపిణః"

(బరోడా యూనివర్శిటీ ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ జర్నల్ జూన్ సంచికలోని రెవరెండ్ సిదిల్కు గారి వ్యాసంనుంచి)

# గ్రంథవిమర్శనము

## శబ్దరత్నాకరము

[మూల నిఘంటుకర్త: శ్రీ బి. సీతారామాచార్యులు. పరిష్కర్త, అనుబంధకర్త: విద్వాన్ శ్రీ నిడదవోలు వెంకటరావుగారు. మూల నిఘంటు పుటలు: 868. అనుబంధం పుటలు: 122. ఆరవ ముద్రణం. వెల: 25 రూపాయలు. ప్రచురణ, ప్రాప్తిస్థానం: మద్రాసు స్కూలుబుక్ అండ్ లిటరేచర్ సొసైటీ, మద్రాసు.]

పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభంవరకు తెలుగు నిఘంటువులన్నీ సంస్కృత నిఘంటువుల ఫక్కీనే ఛందోబద్ధంగా నడిచాయి. తమ పరిపాలన సౌకర్యం కోసం దేశభాషలు నేర్వదలచిన పాశ్చాత్యులకు తమ భాషలలో ఉన్నట్లే వీటిలోను వర్ణక్రమానుసారంగా పదాలపట్టికలు సిద్ధపరచుకోవాలన్న తలపు తట్టింది. దానితో, దేశమంతటా దేశభాషలలోనే కాక సంస్కృతంలోను అకారాదిపట్టికల రూపంలో ఉన్న నిఘంటువుల రచన 19వ శతాబ్ది ప్రథమపాదంలో ప్రారంభమైంది. సంస్కృతంలో శబ్దకల్పద్రుమం, వాచస్పత్యం వెలసినవి.

ఈ పాశ్చాత్య సంప్రదాయంలో తెలుగులో నిఘంటు నిర్మాణం రెండు విధాలుగా సాగింది. మొదటిది: పరిపాలనకు అవసరమైన వ్యవహారపదాలపట్టిక. రెండవది: ప్రాచీన ప్రబంధాలపదాల పట్టిక. వ్యవహారపదాల జాబితాలో మొట్టమొదటిది విలియం బ్రౌన్ సిద్ధపరచిన "ఎ వొకాబులరీ ఆఫ్ జెంటూ అండ్ ఇంగ్లీష్" ఇది 1807 లో గ్రథితమై 1818 లో తొలి ముద్రణ పొందింది.

ఈ నిఘంటుకారుని లక్ష్యం మనదేశానికి వచ్చిన విదేశపాలకుల, వ్యాపారుల సులువే. కనుకనే ఈయన అప్పటి సామాన్యవ్యవహారపదాలను గ్రహించి వాటికి ఆంగ్ల పర్యాయాలిచ్చి వచనక్రియా కాలాల వివరణ చేశాడు. తెలుగు అర్థాలివ్వలేదు; కవి ప్రయోగాల జోలికి పోలేదు.

రెండవ విధం నిఘంటువుల ఉద్దేశం కేవలం కావ్యప్రబంధాల పదాలకే పట్టిక సిద్ధపరచి, అర్థాలు వివరించి, ప్రయోగాలు ఉదాహరించడం. ఈ నిఘంటువులలో మొదటిది మామిడి వెంకయ్య ఆంధ్రదీపిక. ఇది 1816 లో గ్రథితమై, 1848 లో ముద్రితమైంది.

కాగా, మొదటి పద్ధతి కాంబెల్, సి. పి. బ్రౌన్ మున్నగువారికి, రెండవది పండితులయిన సీతారామాచార్యులు మున్నగువారికి మార్గదర్శకమైనవి. నిజానికి ఈ రెండుపద్ధతులను సి. పి. బ్రౌను కొంతవరకు సమన్వయపరచాడు. కాని, ఆయన నిఘంటువు (బ్రౌణ్యం) శబ్దరత్నాకర పరిష్కర్తలు, అనుబంధకర్తలు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు పీఠికలో అన్నట్లు "వర్ణానుస్వార శకటరేఫములందు పాటింపబడకుండుట చేతను, అర్థములు తెలుగులో కాక ఇంగ్లీషు భాషయందు ఈయబడి యుండుట చేతను, వర్ణాంతరములన్నియును ప్రత్యేకముగా కాక, ఒక శీర్షిక క్రింద నీయబడుట చేతను" ఆంధ్ర కవిపండితలోకం ఆదరం పొందలేకపోయింది. దానిలోని లోపాలు సవరించి తెలుగు భాషా సంప్రదాయంతో ఒక నిఘంటువు నిర్మించాలని చిన్నయసూరిగారు పూనుకున్నారు. కాని అది మన దురదృష్టవశాత్తు పూర్తికాలేదు. కాగా సీతారామాచార్యుల శబ్దరత్నాకరమే పండితలోకంలో ప్రామాణికంగా ప్రసిద్ధి చెందినది.

ఆచార్యులు దీనిని 1860 లో ప్రారంభించి, 1885 లో పూర్తిచేసి, ముద్రించారు. తర్వాత ఇది ఐదుసార్లు పునర్ముద్రణ భాగ్యం పొందింది. ఇది ఆరవ ముద్రణం. ఒకే సంపుటంలో కవి ప్రయోగోదాహరణపూర్వకంగా, తెలుగులో అర్థవివరణతో ఉండడంచేత ఇది ఇంతగా మొదటినుంచి పండితాదరం పొందింది. కాని, దీని నిర్మాణకాలానికి నన్నెచోడుని కుమారసంభవం వంటి అపూర్వగ్రంథాలు లభించలేదు. కనుక వాటిలోని ఎన్నో పదాలు దీనిలో చేరలేకపోయాయి.

ఈ కారణంగా తర్వాత సూర్యరాయాంధ్రనిఘంటువు, వావిళ్ళ నిఘంటువు నిర్మాణం ప్రారంభమై, వాటిలో కొన్ని భాగాలు మాత్రమే వెలువడ్డాయి. వాటిలోను పెక్కు ప్రాచీనపదాలు చేరలేదు. ఈ వెలువడినవీ కొన్ని సంపుటాలుగా ఉండడంవల్ల, అందుబాటులో ఒకే సంపుటంగా ఉండకపోవడంవల్ల, శబ్దరత్నాకరమే అందరికీ శరణ్యమయింది. ఈ ముద్రణంలో శ్రీనిడదవోలు వెంకటరావుగారు మూలగ్రంథం చెక్కుచెదరనీక "ముద్రణాది దోషముల దిద్దుటయే గాక, కొన్నింటికి సవరణలు, వివరణలు" చేర్చారు. 170 పుటల అనుబంధంలో కొత్తగా ఇదివరకు ఉన్న నిఘంటువులు వదలిన అపూర్వపదాలను దాదాపు 5000

చేర్చారు. అనుబంధం నిర్మాణపద్ధతిలో ప్రధానాంశాలు ఇవి :

1. ఆంధ్రభాషా సంప్రదాయలక్ష్య లక్షణదృష్టి, నవీనభాషా తత్త్వశాస్త్రదృష్టి సమన్వితమై రచితమైంది ఈ అనుబంధం. నిఘంటు నిర్మాణంలో ఇది నూతనపద్ధతి అనవచ్చు.

2. తత్సమ, తత్సమాంధ్ర మిశ్రమ, తద్భవ దేశ్య, అన్యదేశ్యాలనే విభజన చేయబడింది. ఇది పూర్వనిఘంటువులలో లేదు.

3. ఈనాడు వ్యాకరణానికి లొంగనివనీ, పత్రికలవారు తమ ఇష్టంవచ్చినట్టు వ్రాసి అధ్వాన్నం చేస్తున్నారని అనే పెక్కు పదాలకు పూర్వప్రయోగాలు చూపారు.

4. అన్యదేశ్యాలు పెక్కు చేర్చారు.

5. చెప్పిన ప్రతి పదానికి కవి ప్రయోగం చూపారు.

6. దేశ్యపదాలకు సజాతీయమైన తమిళ, కన్నడ పదాలు చూపారు. అన్యదేశ్యాలలో ఇంగ్లీషు పదాలు వేరుగా ఇచ్చారు.

ఈ పద్ధతిని శ్రీ రావుగారు అఖండదీపం, అగస్త్యమంత్రం, అచిరాంశువు, అగుణవాన్, అనేకాగ్రత, ఉత్పిబం, ఎల్లారు, ఏకాంగి, కనుమలి, కటాహం, కలహారం, కౌసుంభరుచు, జనాంతికపనము, కొత్తిపే, ఘనంపాడు మొదలైన భారతాది కావ్యప్రయోగాలు చూపడం ఎంతైనా ప్రశంసనీయం.

సంఘంతోబాటే భాష మారుతూ ఎన్నో కొత్త పదాలను సంపాదించుకుంటుంది. అలాగైన సంస్కృతాదిభాషల పదాలు కూడా మానవముఖయంత్రంలో పడి మారిపోతుంటాయి. సంస్కృతిపదాలు మారినట్టుగా- అవీని ఉత్తరభాగంలోలాగ మరేవీ మారలేదనవచ్చు. ఈ కారణంగా మిశ్రసమాసాలు. వైరిసమాసాలు పుట్టాయి. పండితులు వాటిని ఎంత ఈసడిస్తున్నా, ప్రజలు, వారిని అంటిపెట్టుకున్న రచయితలు ప్రయోగించక మానరు. ఈ విప్లవం తెనుగునాడులో తొలి తెలుగురచన అయిన బసవపురాణకాలం నుంచీ జరుగుతూనేవుంది.

బెంగాలీలు "మహాముష్కిల్" అంటూ ఉంటే నాకు నవ్వువచ్చేది. వెంటనే మనకు మహాపెద్ద; మహామంచిలేవా? అనుకొని సర్దుకొనేవాణ్ణి. అలాటి వాటికి శ్రీరావుగారు భాస్కర రామాయణాది ప్రాచీన రచనలనుంచి ఉదాహరణ లిచ్చారు.

సంస్కృతంలో భావార్థకాలకు విధించే త్వ, తల్ ప్రత్యయాలపైన మరొక భావార్థక ప్రత్యయం రాదు. మనకు త్వ, తల్ ప్రత్యయాలు స్పష్టంగా కనిపిస్తేనే కాని సంతృప్తి వుండదు. సాన్నిధ్యం అనే దానికి తల్ రాదు. కాని మనకు సాన్నిధ్యత, ఐక్యత వంటి ప్రత్యయ యుక్తరూపాలు వాడడం అలవాటు, సంతృప్తిని. అలాటివి తప్పయినా సోమనవంటివాడు శిష్టులలో వ్యవహృతాలు కావడంవల్లనో ఏమో వాడాడు. శ్రీ రావుగారు సాన్నిధ్యతవంటివాటికి ప్రాచీనప్రయోగాలు చూపారు. (ఇంతమాత్రాన ఇవి నేను ప్రయోగార్హాలని కాదు.) ఇక అన్యదేశ్యాలలో అన్నిటికీ—ప్రాప్రయిటరు, ఫీజువంటి వాటికి కూడా వారు ఉదాహరణ లిచ్చారు. "తెనుగు నిఘంటువుల యందు ప్రయుక్తమైన ప్రతి పదమునకు కవిప్రయోగము లభింపగలదని నా యనుభవమునుబట్టి నిశ్చయముగా చెప్పగలను" అన్నది శ్రీ రావుగారి ధీమా.

నిఘంటువులోను అచ్చుతప్పులుంటే జిజ్ఞాసువులకు పిచ్చియెక్కినట్టవుతుంది. దురదృష్టవశాత్తు దీనిలో అచ్చుతప్పులు కనిపిస్తున్నాయి. ఈ కృషి ప్రాశస్త్యాన్నిబట్టి అవి అంతగా పాటించదగినవి కావనుకుంటాను.

ఇలాటి అనుబంధంతో సమగ్రనిఘంటు నిర్మాణానికి కొత్త తెన్నులు తీర్చి ఆంధ్రజాతికి మహోపకారం చేసిన శ్రీ వేంకటరావుగారు, సంస్కరణకు అర్హాలను ఎన్నుకొని వ్యయప్రయాసలనక ఆరవసారి యీ నిఘంటువును ముద్రించి ఆంధ్రావళికి అందజేసి తమ సాహిత్యప్రియత్వం చాటుకున్న "ది మద్రాస్ స్కూల్ బుక్ అండ్ లిటరరీ సొసైటీ"వారు, ప్రతి ఆంధ్రుని అభినందనకూ పాత్రులు కాగలారనడం నిర్వివాదం.

—రా. చ.

## రేణుక

[రచన: శ్రీ సరిపల్లి శ్రీమన్నారాయణ రెడ్డి. ప్రకాశకులు త్రైలోక్య విజయ ప్రచురణలు, జనార్దనపురం, కృష్ణాజిల్లా. పుటలు 44. మూల్యం అర్ధరూపాయి]

రెడ్డి కుటుంబంలో జన్మించిన రేణుక సుందరి, అనురూపుడైన రెడ్డి వీరునికి హృదయం అర్పించుకొన్నది. అతని ప్రేమ చూరగొన్నది. శిస్తు బకాయి వసూలు చేయవచ్చిన అధికారి ఆమెనుచూచి మోహిం

చినాడు. దౌర్జన్యానికి ఒడిగట్టినాడు. మానరక్షణార్థం పిట్టకల గూడులో దాగిన అబాలికి కాలసర్పం వాతె పడినది. ఆమె మరణానికి కారణమైన అధికారి తన అపరాధం గుర్తించి ప్రాణం తీసుకొన్నాడు. ప్రియురాలి మరణవార్త వినడం తడవుగా రెడ్డి యువకుడు ప్రాణం విడిచినాడు.

ముగ్గురిని ఒక్క తావునే సమాధి చేసినారు. ముగ్గురి జీవితాలు ఈవిధంగా అర్థాంతరంగా విషాదకరమైన విధంగా సమాప్తం కావడంతో వారి ఆత్మలకు శాంతి లేకపోయినది. సమాధులలోనుంచి ఆ ప్రేతాత్మలు చేసిన ఆక్రోశమే రేణుక.'

భావానికి అనుగుణమైన వాతావరణం సృష్టించడంలో రచయిత సమర్థుడు. దానికి భావ తోడు అయినది. ఉదాత్తమైన కల్పనాకౌశలము అన్నిటినిమించి సంయమనము ఈరచనకు వన్నె తెచ్చినవి. శ్రీ శ్రీమన్నారాయణ రెడ్డిని హృదయపూర్వకంగా అభినందిస్తూ తెలుగుజాతి వైశిష్ట్యం ప్రతిఫలింపజేసే రచనలు ఇంకా చేయగలరని ఆశిస్తున్నాను. కామరాజు.

## ఏకలవ్యుడు

[ఖండకావ్యము. రచయిత: శ్రీ శంకరంబాడి సుందరాచారి. పుటలు: 30. మూల్యం: 50 నయాపైసలు.[

ఏకలవ్యుని చరిత్ర జిజ్ఞాసువుల కందరికీ ఆదర్శప్రాయమైన దర్శనం చర్విత చర్వణం. శ్రీ సుందరాచారిగారి సూక్తి 'సౌందర్యము'లో శ్రీ రాయప్రోలు వారన్నట్లు "ఎంత తేటగా సూటిగా వినబడుతుందో అంత స్ఫుటంగా, సుదూరంగా ధ్వనిస్తున్నది."

ఏకలవ్యుని బొటనవ్రేలిని అర్జున పక్షపాతులైన ద్రోణాచార్యుడు యాచించి వేశాడన్నది వ్యాసకథనం. శ్రీ శంకరంబాడివారు ద్రోణుని చరిత్రను కలుషితం చేయనొల్లరు. అనుచిత నిందావాక్యాలు సహించక—

కోర సెత్తుగు పార్థుని కత్తిపిరికి
ఖసికుమునికోసి బొటనవ్రేలు కత్తిరించి

మసలు నెత్తుటి కుండము నోపడదిద్ది
పార్థు నలరించె బోయడు స్వార్థముడిగి

అని మార్చి ఈ విపరీత సన్నివేశాన్ని శిల్పభంగం కాకుండా సుష్టుగా రచన సాగించారు.

## యక్షప్రవాసము

[శ్రీ సున్నం వీరరాజకవి. కవితాసమితి. విశాఖపట్టణము. వెల ఎనిమిదణాలు]

మేఘసందేశకావ్యం మాతృకవిధంగా భావించి స్వకపోలకల్పిత రీతిలో శ్రీ సున్నం వీరరాజకవి ఈ ఖండకృతి రచించారు. ప్రవాసి యక్షుడీ కావ్యంలో ప్రేయసికోసం సందేశం పంపించడు. కాని పరిపరి విధాల తన మనోవేదన వెళ్ళబోసుకొంటాడు. ఈ విధంగా ఈ కావ్యం చాలా విచిత్రమైనవినూతన ధోరణిలో కొనసాగింది.

ఈ క్రిందివృత్తంలో వీరరాజకవి యక్షప్రవాసి గాథానురాగం మన హృదయాలలో స్ఫుటంగా స్ఫురింపజేస్తున్నారు.

'ప్రేయసి దివ్యమంగళ సు
విగ్రహరాజము నా శరీరమున్
దేయగవచ్చు రక్తమున
గోట్లకొలందిగ నుండుట్లో కలన్
వ్రాయుచు వచ్చుచుండిన
రకంతి యుద్బృప్తి జనింపదాయె; నా
కాయెలనాగ పోము కను
లారగనుంగొను భాగ్యమెన్నడో!'

శ్రీ వీరరాజకవి కవితాసమితి సభ్యులు. చిరకాలం నించి కవితాసాధన సాగిస్తున్న సహృదయులు. 'యక్షప్రవాసము' వీరి ఖండకావ్యాలన్నిటిలోను ఎన్నదగిన రచన. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి తమ అమూల్యాభిప్రాయంలో పేర్కొన్నట్లు వీరి కవనం అనర్గళంగా సాగిపోతున్నది. ఈ కవి సహజధోరణికి యక్షప్రవాస మొక తార్కాణం.



Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.